శ్రీః

# ఆంధ్ర కావ్యాలంకార సూత్రవృత్తి

—; ప్రథమాధికరణమున ప్రథమాధ్యాయము :—

ప్రణమ్య పరమంజ్యోతిర్వామనేన కవిప్రియా ।
కావ్యాలంకార సూత్రాణాం స్వేషాంవృత్తిర్విధీయతే ॥

కావ్యమలంకారమున గ్రాహ్యంబు ౧ సూ.

కావ్యమనునది యుపాదేయమగుట కలంకారమావశ్యకము. గుణాలంకార సుభగములగు శబ్దార్థములు కావ్యమనబడును. కాని యిచట కేవలశబ్దార్థములే యుపచారవశమున గావ్యమని గ్రహింపబడును.

ఇచట నుడువబడిన యలంకారమేమన ?

సౌందర్యమలంకారము ౨ సూ.

—: సొగసలంకారము :—

అలంకృతియను ధాత్వర్థమే యిచట నలంకార పదమున కర్థము. అనగా సొగసనిపర్యవసానము. అలంకరించు సాధనము అనునర్థమున నుపమాదులీశబ్దముచే చెప్పబడును.

అదిదోష గుణాలంకారముల హానాదానముల నేర్పడును ౩ సూ.

దోషములవిడిచియు గుణాలంకారముల స్వీకరించియు గవులు పైజెప్పిన సొగసును కావ్యమునకు గూర్పగల్గుదురు.

శాస్త్రమున నవి యెఱుగనగు ౪ సూ.

ఈదోషగుణాలంకారముల ♦ హానాదానముల ఈనుడువబోవు శాస్త్రమున నెఱుగనగును. శాస్త్రముల నెఱిగిగదా దోషముల విడువవలయును. అట్లే గుణాలంకారముల స్వీకరింపవలయును.

---

♦ వ్యా॥ హానాదానములు, హానము = విడుచుట, ఆదానము = స్వీకరించుట, క్రమముగ దోషములవిడుచుట గుణాలంకారముల స్వీకరించుట యని యర్థము.

ఇట్లు శాస్త్రముంజెఱిగి దోషములవిడిచి గుణాలంకారముల స్వీకరించి కావ్యమునకు సొగసుకూర్చినచో నట్టి కావ్యమువలన గలుగు ప్రయోజనమేమి ? యనినచో.

♦ అందమగు కావ్యము ప్రీతికీర్తుల కారణమగుట దృష్టాదృష్టార్థము ౫ సూ.

సొగసైన కావ్యమును వినునపుడు పలువురకు దానియందు ప్రీతి యొదవును. కావుననిది దృష్టప్రయోజనము, అట్లుప్రీతులగు లోకులందరు నాకావ్యకర్తను కీర్తింతురు. ఆకీర్తి స్వర్గసాధనము. అట్టికీర్తి యదృష్టమగు ప్రయోజనము.

గీ॥ కావ్యబంధమ్మువి ప్రతిష్ఠ గనుటకీర్తి ।
సరణి, యట్టులకుకవిత్వ మైనియపయ ।
శంబు పద్ధతికీరితి స్వర్గఫలము ।
చిరముకాలము దుష్కీర్తి నరకమూతి ॥

గీ॥ స్వర్గఫలమగు కీరితి సంగ్రహింప ।
నరకదూతిక దుష్కీర్తి పరిహరింప ।
సాధ్వలంకార శాస్త్రంబు సంగ్రహించి ।
విశదపఱచుట కవి పరివృఢులపనియ ॥

ఇయ్యది

కావ్యాలంకార సూత్రవృత్తియందు శారీరమను ప్రథమాధి ॥
కరణమున ప్రథమాధ్యాయము

---

♦ ఇట్లుస్వయనిషములగు ప్రయోజనములను కూర్పగలుగు నీకావ్యమునకు అలంకారము కూర్పవలసినదేకదా! అది లేదేని కావ్యము నలువురకునుపాదేయమగు టెట్లు?

—: రెండవ యధ్యాయము :—

కావ్యప్రయోజనము స్థాపితమైనది. ఇక నధికారి నిర్ణయము.

అరోచకులు సతృణాభ్యవహారులును కవులు ౧ సూ.

కావ్యప్రసంగమున కవులిరు తెఱగులనుందురు. అరోచకులు, సతృణాభ్యవహారులును. ఈరెండు శబ్దములును గౌణార్థకములు. వివేకమును, అవివేకమును ఆయర్థము.

మొదటివారు వివేకులు కావున శిష్యులు ౨ సూ.

అరోచకులు వివేచనాశీలురు కావున నుపదేశమున కర్హు లగుదురు.

తద్వ్యతిరేకమువలన నితరులుకారు ౩ సూ.

తద్వ్యతిరేకమువలన=వివేచనాశీలములేకపోవుటజేసి. ఇతరులు— సతృణాభ్యవహారులు, శిష్యులుగారు.

ఇట్లయిన శాస్త్రము సర్వానుగ్రాహకము కాకపోవునను శంకచే చెప్పుచున్నాడు.

శాస్త్రమద్రవ్యములందు సార్థకముగాదు ౪ సూ.

అద్రవ్యములందు=అవివేకులందు. శాస్త్రము ప్రయోజనవంతము కాకపోయినను దోషములేదు. దృష్టాంతము చెప్పుచున్నాడు.

కతకంబు బురదను శుభ్రపరుపదు ౫ సూ.

చిల్లగింజ నీటినిదేర్చునట్లు బురదనుదేర్చుటకు సమర్థముకాదు కదా? అధికారుల నిరూపించి రీతుల నిశ్చయించుచున్నాడు.

రీతికావ్యమునకాత్మ ౬ సూ.

శరీరమున కాత్మవలె రీతియనునది కావ్యమునకాత్మ. రీతి స్వరూపమును చెప్పుచున్నాడు.

విశిష్టమగు పదరచనరీతి యనంబడు ౭ సూ.

మంచి విశేషముగల పదములకూర్పురీతియనదగును. ఆవిశేష మేమనగా.

విశేషము గుణరూపము ౮ సూ.

సముదపోవు గుణస్వభావమే విశేషము.

ఆది "వైదర్భి, గౌడ, పాంచాలి" యని మూడువిధములు ౯ సూ.

ఆరీతి వైదర్భి, గౌడి, పాంచాలి యని మూడువిధములు. ఈరీతు లంపు దేశవశమున నేదైన గుణములు, ద్రవ్యములందువలె నేర్పడునా? లేకపోయినచో దేశవిశేషములతో వీనినేల పేర్కొందురు? అట్లుగాదు.

విదర్భాదులందు కనబడును గావున నాపేరు ౧౦ సూ.

విదర్భ, గౌడ పాంచాల దేశములందుండు కవులు వానిని వివిక్త స్వరూపములతో గనిపెట్టిరి గావున నాపేరు గలిగినది. అంతేకాని దేశవశమున గావ్యముల కుపయోగమేమియులేదు. ఆరీతులు గుణముల భేదముచే వేరగు ననుచున్నాడు.

అన్ని గుణములున్నచో వైదర్భియగు ౧౧ సూ.

ఓజస్సు ప్రసాదము మొదలగు గుణములన్నియు నున్నచో వైదర్భియనురీతి. ఈవిషయమున ప్రాచీనులకారిక.

గీ॥ లేశమేనియు దోషముల్లేకయన్ని।
గుణములను గుంభితంబయి కొామరుమిగిలి।
కలవిపంచీమృదుస్వరకలన సుభగ।
మైనరీతిని వైదర్భియనగదగును॥

ఆవైదర్భిని కవులిట్లు నుతింతురు.

గీ॥ ఉండుకాకేమి కవితయునుండుగాక।
యర్థముంగూడ నటులె శబ్దానుశాస।
నమ్ముపలుకులు తేనెల జిమ్మవేది
లేకపోయిన నదియెుక్క లీలగలదు॥

ఉదాహరణము :

* ఆవాలుంగనుబోయి, యానగు మొగంబాగుబ్బ పాలిండ్లపెంపా।
వేణీభరమాతనూవిలసనంబా యొప్పులే చెప్పినన్।
కైవారంబగుగాదె, కేవలశిరఃకంపంబు కల్పించి।
యాహాపుట్టింపదె యిక్షుధన్వునకు నయ్యబ్జాక్షి నీక్షించినన్॥

కళాపూర్ణోదయము.

ఓజఃకాన్తులు కలది గౌడియగు ౧౨ సూ.

కలదియనుటచే ప్రచురముగా నోజఃకాన్తు లిందుండవలయునని భావము. ఇందుమాధుర్యము సౌకుమార్యముసుండవు. మిక్కిలి సమాసములును అత్యుల్బణములగు పదములు నుండును. ఈవిషయమున పద్యము.

గీ॥ భూయసాసమస్తోద్భట భూరిపదయు।
బ్రవసదోజస్సు కాన్తివిభ్రాజితమ్ము।
నైనరీతిని రీతి విజ్ఞానులెల్ల।
తీవిగా బేరుకొంద్రు గౌడీయయనుచు॥

ఉదాహరణము :

. సీ॰ చిత్రకూటమణీ విచిత్రకూట సుఘట
చిత్రకూట స్థలాసీనుడగుచు
దండకాశరభ వేదండ కాసరముఖో
ద్దండకాననమృగ ధ్వంసియగుచు
మానవారిత పూజ్య మానవాసపిరాధ
మానవాదహిమోగ్ర భానుడగుచు
దానవాగ్నిభిదాని దానవారభయప్ర
దానవాక్పరితుష్ట మౌనియగుచు

* వ్యా॥ "ఆవాలుంగను బోయి" యని.

"ఆయొప్పులేడెప్పినన్" యిక్షుధన్వునకు నయ్యబ్జాక్షి నీక్షించినన్॥ ఇచ్చట గాఢబంధత్వముస్నది. కావున నోజస్సనుగుణము "ఆయొప్పులేడెప్పినన్ కైవారంబగు గాదె" ఇచట ఒంటి గాఢత్వ శైథిల్యములు కూడియున్నవి గావున ప్రసాదము. అనగు

[illegible]
[illegible]
[illegible]
[illegible]

మాధుర్యసౌకుమార్యములు గలది పాంచాలి యనం బడు. ౧౩. సూ.

మాధుర్యము సౌకుమార్యము నను రెండుగుణములు ప్రధానముగా నుండునది పాంచాలియనును. ఇందోజస్సుండదు గావున బంధము శిథిలముగా నుండుటయు, పదములుజ్జ్వలములు కాకపోవుట వలన (కాంతిలేకపోవునుగాన) మిసిమిలేకుండుటయు సంభవించును.

ఈ విషయమున పద్యము

గీ. అంతటను బంధశైథిల్య మలవరించి
ప్రాతగిల్లిన చాయల జాలువిడియు
మధురమై సుకుమారమౌ విధిని గవులు
పేరుకొందురు పాంచాలి పేరుతోడ.

ఉదాహరణము.

---

మొగంబు" అనుచోట బంధవైశ్లిష్యము గల్పించును. మృదువులు అసమాస సమాసములు గల పదములతో నుపక్రమించిన మార్గమును పూర్వక యట్లే నిర్వహించెను గావున సమత. “తావాలుంగనుదోయి” యని యారంభించిన క్రమముతో రెండవచరణము తుదివఱకు నిర్వహించెను గావున మార్గాభేదమువలన సమత. ‘తావాలుఁ’ అనుచోట నారోహము ‘కనుదోయి’ యనుచోట నవరోహము. ఇట్లే యారోహావరోహక్రమము స్థలాంతరములఁగూడ స్ఫురించును గావున సమాధి. ‘యాహా పుట్టింపదె యిక్షుధన్వునకు’ అని పదములు విడివిడిగా నుపయోగింపఁబడినవి గావున మాధుర్యము. ‘కేవలశీతకంపంబుకల్పించి’ యనుచోట బంధముపారుష్యము లేనిదిగావున సౌకుమార్యము. ‘ఆసగు మొగంబొగుబ్బ పాలిండ్ల పెంపు’ అనుచోటబంధము వికటముగా నుండుటవలన నుదారత. ఈపద్యమున పదములన్నియు నుజ్జ్వలములు గావున కాంతి; అర్థము సుఖముగా నభివ్యక్తమగును గావున నర్థవ్యక్తి యనుగుణము. ఇట్లు సకలగుణ సంపన్నయగుటవలన నారీతి వైదర్భియనఁబడును.

ఉ. వల్లభుఁడేగు దుర్లభుఁడు వానియెడన్ వలపూని యిట్లు మై
దల్లడమందెదేల యుచితస్థితికిన్ మనుబావఁజూచినన్
దల్లియు బంధువర్గమును దండ్రియునేమను వారెఱింగిరే
నల్లమ యేకనిట్లుతగునో? తగదో పరికించిచూడుమా.

రేఖలలో చిత్తరువువలె ఈమూఁడురీతులలోను కావ్యము ప్రతిష్ఠితమగును.

సర్వగుణములుండుట వైదర్భియే గ్రాహ్యంబు ౧౪ సూ.

స్వల్పగుణములుండుట కదమవి గ్రాహ్యంబులు గావు ౧౫ సూ.

గౌడియందు మాధుర్యము సౌకుమార్యమును పాంచాలియందోజఃకాన్తులును నుండవుకదా! కావున నవి గ్రహింపదగవు.

తదారోహమునకై యితరము లభ్యసింపవలయునని
యొకరు ౧౬ సూ.

ఆవైదర్భినిరచింప కల్గుటకే గౌడియపాంచాలీరీతుల యభ్యాసమని కొందరి మతము.

అదిసరికాదు; అతత్త్వశీలునకు తత్త్వముసిద్ధింపదు ౧౭ సూ.

అవాస్తవికమగు పరిశీలన మొనర్చినంతమాత్రమున వాస్తవిక స్వరూపము సిద్ధించుట యెన్నడైనాకలదా. అతత్త్వమును గైకొను వానికి దత్త్వమెప్పటికిని సిద్ధింపదు.

నిదర్శనము నిరూపించుచున్నాడు.

జనుపనారదారము నేతనేర్చినంతనే సన్ననినూలు దారము
నేతనేర్పురాదు. ౧౮ సూ.

జనుపనారతో గోనెలునేయు సాలెవాడు సన్నని నూలునేతలో నేర్పును బొందగలడా?

సమాసములు లేనిచో నది శుద్ధవైదర్భి. ౧౯ సూ.

ఏమాత్రమును సమాసములు లేకున్నచో నది శుద్ధవైదర్భి యనబడును.

అర్థగుణసంపద యటు లాస్వాద్యమగు. ౨౦ సూ.

వెనుకటి వైదర్భియందు శబ్దగుణములుగూడ సమగ్రముగా నుండును. ఇందు సమాసములు లేకపోవుటచే శబ్దగుణములగు నోజః ప్రసాదశ్లేషము లుండవు. కాని యర్థగుణములు మాత్రము సమగ్రముగా నుండును. అవికూడ సమగ్రముగా లేకున్నచో నిది యసలు వైదర్భి యెట్లగును? అన్నిగుణములున్నగదా వైదర్భి (౧౧ సూ.) కావున సూత్రములోని "సంపద" యను పదమునకు "సాకల్యము" లేక "సామగ్ర్యము" యనియర్థము. అనగా నిందర్థగుణము లన్నియు నుండి యాస్వాదనీయత కల్పించునని భావము.

అది కైకొనిన నర్థగుణలేశమైనను నాస్వాద్యంబగు. ౨౧ సూ.

ఆవైదర్భిరీతిని గ్రహించుచో నర్థగుణము లేశమైనను ఆస్వాద్యమగునుగదా. ఇక నర్థగుణసంపద యాస్వాద్యమగుటకేమి యబ్బురము. పెద్దలుకూడ నిట్లె చెప్పుచున్నారు.

* మ. సరియిదియట్టు లంచనగరాదని పల్కులకల్కి తళ్కుకు
ల్కురచన కొంచమైన నటకొంచముగా గనుపట్టదయ్యెదే
సరసుల కర్ణమార్గముల జాల్కొనుచున్నమృతమ్మువానగా
గురిసినయట్టు లుల్లములకున్ముద మెక్కుడు గూర్చుచుండుచో.

అదియు తాత్స్థ్యమున వైదర్భియే. ౨౨ సూ.

* వ్యా. 'సరియిది' యని. ఇచట వాణీవిలాస ప్రెస్సువారు వ్యాఖ్యానములోని 'జీవన్నదార్థ పరిరంభణమంతరేణ' యనునది పూర్వార్థమని తిప్పభూపాల వ్యాఖ్యానుసారముగ వ్రాసిరిగాని యదిపొరబాటు. ఏల? ఇచట సమాసశూన్యయగు శుద్ధవైదర్భిని ప్రశంసించు పద్యముగదా యిది. ఇది వృత్తికనురూపముగా నుండవలయును. ఇంతకుపూర్వము నిరూపించినవృత్తిప్రశంసాస్థలములలోని పద్యములుగూడ నాయా వృత్తులకనుగుణముగానే తత్తల్లక్షణములకు సరిపడియున్నవి. ఆచోటులయనుభవము ననుసరించి 'యిచటగూడనట్లే యితడట్టిశ్లోకమునే వ్రాసియుండవలయును' అనికదా మనము నిర్ణయింపవలయును. ఇక ప్రకృతపు శ్లోకార్థము వైలక్షణ్యమునకు తగినట్లులేదు. ఇందుకొంచెము సమాసడంబరము కన్పట్టుచున్నది చూడుడు.' జీవన్నదార్థపరిరంభణమంతరేణ శబ్దానధిర్భవతి నస్ఫురణేన సత్యం' అర్థవ్యక్తియు సరిగా నెంట నేలేదు. మరియు గీతలుపెట్టిన స్థలములంబరికించినచో గాఢబంధత స్ఫురించుచున్నది ఇట్లుండుట

ఆయర్థగుణసంపదయు కాత్స్న్యమువలనఁ వైదర్భియనఁబడును. ఆవైదర్భిరీతియందుండును గావున నీయర్థగుణసంపదయు వైదర్భి యనబడును. "మంచెలు కేకవేయుచున్నవి" అనుచోట "మంచెలు" అను పదము మనుజులను బోధించుటకు గారణము వారు మంచెల యందుండుటయేగదా: ఇచటదాత్స్థ్యముపచారమునకు సంబంధము. "మంచెలు" అనుపదము మంచెలనున్న పురుషులయందెట్లో యట్లే

---

శుద్ధవైదర్భి కనుచితముగదా. ఇందు సమాసాభావముండుననుటచే గాఢబంధాదులు గూడ నిరాకృతములేకదా. అట్లైనాక యవి గూడనుండుచో నిట నర్థగుణసంపదయే యాస్వాద్యమగు టేమి? శబ్దగుణసంపద లేకపోయినదా? కావున సమాసములుండవనుట వలన నోజఃప్రసాదోదారతలుండవనుట తెల్లమైనదియని మనమంగీకరింపవలయును. అప్పుడే 'పురాణచ్ఛాయయాన్వితాః' అనుటకు సంఘటించును. అందువలననే బంధము నకు విచ్ఛాయతయేర్పడును. కావుననేయిచట నర్థగుణసంపద అనగా తత్సామగ్ర్యమే యాస్వాద్యమని వామనుడు నుడివెను. ఇక మనము సవిమర్శముగా పరికించినచో నిర్ణయసాగరాలయమువారి 'అనల్పయత్నాత్కర్ణపథంప్రయాతా చేతస్సతా మమృత వృష్టిరివప్రవిష్టా' యనునదియే సరియైనపాఠముగా దోచుచున్నది. ఇందు శుద్ధవైద ర్భికి ఆనుగుణ్యమున్నది. పదములన్నియు మృదువుగాను విడివిడిగాను నుండి మాధుర్య సౌకుమార్యములతో నిండియున్నవి. కర్ణపథం, అమృతవృష్టియనునవి లెక్క పెట్టదగినంతటివి సమాసములుగావు. కావున నసలుశ్లోకము ఇట్లుండుట యుక్తమని మన మూహింపవచ్చును. 'కింత్వస్తికాచిదపరైవ పదానుపూర్వీ యస్యాం నకించిదపికించిదివావభాతి॥ ఆనల్పయత్నాగతకర్ణపథంప్రయాతా చేతస్సతా మమృతవృష్టిరివప్రవిష్టా' ప్రథమచరణమున 'పదానుపూర్వీ' యనునదియు నొకసమాసముగా స్ఫురింపబోదు. కావున వాణీవిలాససభవారిది పూర్తిగా పొరబాటే. అథవా నిర్ణయసాగరముద్రాల యమువారికన్న నేమైనవిశేషము తమరచ్చువేయు గ్రంథమున జూపవలెనని తలంచి యైన నిట్లు సవరించియుందురు. ఇక వ్యాఖ్యాతకో, యుక్తార్థము దొరకకుండుటచే నేదేనొకదానిని కూర్చెను. అందును 'కింతు' అని కనబడుచున్నది గావున దానికిదగు నట్లుగా బూర్వపక్షరూపమగు నభిప్రాయముగల యొకపూర్వార్ధము నితడుకల్పించు కొనవలసివచ్చినది. మేము అలంకారశాస్త్రానుగుణమును గ్రంథకారుని శైలీసంభావిత

[illegible] పై విశేషణమును నుపచారమున వ్యవహరింప బడునని యెఱుగవలయును.

ఇది కావ్యాలంకార సూత్రవృత్తియందు శారీరమను
మొదటి యధికరణమున రెండవ యధ్యాయము

---

ముచు న.కుపద్ధతి ననుసరించి విమర్శించితిమి. మాకు హైనిర్ణయసాగరమువారిదే సమంజసముగా నున్నది. కావున దానిననుసరించియే యిందు తెలుగువ్రాయబడినది.



—: మూడవ యధ్యాయము :—

అధికారివిచారమును, రీతులతత్వమును నిరూపించి కావ్యాంగముల స్పష్టపరచుచున్నాడు.

లోకము, విద్యయు, ప్రకీర్ణమును, కావ్యమున కంగములు. ౧ సూ.

పేర్కొనిన వరుసనే దీనిని తెలియజెప్పుచున్నాడు,

లోకమునడవడి లోకము. ౨ సూ.

స్థావరములగు వృక్షపాషాణాదులును, జంగమములగు నర పశు సరదాదులును లోకమనబడును. వానివాని స్వభావోచితమగు ప్రవర్తనమే నడవడి.

* శబ్దస్మృతి, అభిధానకోశము, ఛందోవిచితి, కళా కామ శాస్త్రములు, దండనీతి, మున్నగునవి విద్యలు. ౩ సూ.

శబ్దస్మృత్యాదులు వీనిలో మొదటివగుటలో, కావ్యనిర్మాణము లందు మొదట నపేక్షింపబడునవి యగుటయే కారణము. అవి కావ్యాంగము లెట్లగునో తెలియజేయుచున్నాడు.

శబ్దస్మృతినుండి శబ్దశుద్ధి. ౪ సూ.

శబ్దస్మృతినుండి:- అనగా వ్యాకరణమునుండి శబ్దములశుద్ధి, సాధుత్వ నిర్ణయమొనర్పదగును. వ్యాకరణముచే సాధువులుగా నిర్ణీతములగు పదములనే కవులు నిశ్శంకముగా ప్రయోగించుచుందురు గదా!

---

* వ్యా॥ 'శబ్దస్మృతి' యని.

అలంకారశాస్త్రముగూడ కావ్యాంగములలోనిదైనను ప్రథమాధ్యాయములోనే నాలవసూత్రమున నది కావ్యాంగమగుట స్పష్టపరుపబడినది. కావున మఱల చెప్పలేదు. 'వీనిలో మొదటివగుట' అనగా మొదటశబ్దము నెఱుగుటయు పైనదాని యర్థనిశ్చయమును, ఆపైన రచింపదలచిన పద్యముల ఛందస్సు నెఱుగుటయు సామాన్యముగా నుండునవి కావున వానిక్రమమున మొదట వ్యాకరణము, పిమ్మట నిఘంటువు, ఆపై ఛందశ్శాస్త్రము, అనుక్రమము సూత్రమున నాదృతమైనది.

అభిధానకోశములనుండి పదముల యర్థనిశ్చయము. ౫ సూ.

ఏదైన నొక పదమును పద్య నిర్మాణమున గూర్పదగునని తలంచియును కవి యాపదమున కర్థమేదియో సరిగా దెలియకపోవుట వలన స్వీకరింపజాలడు, విడువనుజాలడు. ఇట్లు డోలాయమానమానసు డగుటవలన కావ్యనిర్మాణమునకు విఘ్నమొదవును. కావున నిఘంటువులనుండి యర్థనిశ్చయము సంపాదింపదగును.

అపుడు కావ్యనిర్మాణము నిర్విఘ్నముగ జరుగును. కాని కొంతమంది కోరి పదముల వెదకుటకు నిఘంటువుల నుపయోగింతురు. అదిమాత్రము నిఘంటువుల ప్రయోజనమని భ్రమనొందకూడదు. ఇదివరకు కవులెవ్వరును ప్రయోగింపని పదముల నిప్పటి వారును ప్రయోగింపరాదుకదా ! ఇక నవి కావ్యనిర్మాణమున కంగము లగుట యెట్లు ? "ప్రయోగించినవానినే ప్రయోగించుచో నిక పదముల నర్థసంశయ మెట్లాడవును ? అర్థసంశయ మున్ననేగదా నిఘంటువులు కావ్యనిర్మాణముల కుపయోగించును." అని యనుట సరికాదు. ఆప్రాచీన ప్రయోగముల గ్రహించునపుడు సామాన్య రూపమున నర్థముబోధపడును "అలక" శబ్దమునకే వెంట్రుకలు చెప్పబడునని యొకరియుద్దేశము. అవి ముందు వెంట్రుకలా ? వెనుక వెంట్రుకలా ? యను సందేహము, "అలకాశ్చూర్ణకుంతలాః" యను నమరనిఘంటువునుజూచి ముంగురులనే యలకలందురను నిశ్చయముకల్గు పర్యంతముండును. కాన నిఘంటు వావశ్యకము.

అయితే యిదియెట్లు ?

శా. ఆకాశంబున జీబుకాడె సొగసై యాషాఢ యోషానితం
బాకీర్ణాలకజాలకంబులన పాయల్పాయలై మేఘముల్
రాకాచంద్రవిలాసముల్ ముసుగువారన్ నైల్యమాల్యంబులై
ప్రాకెన్ జీకటి చెట్లసోయగపు పూరంగుల్ దిశాంతమ్ములన్.
"మేఘము-జడకుచ్చులు" (రాయప్రోలు సుబ్బారావు.)

ఇంపలి ప్రయోగమునకు పొరబాటుగాని యుపచారముగాని మూలమైయుండును.

ఛందోవిచితినుండి వృత్తముల సంశయము తొలగును. ౬ సూ.

సామాన్యముగ కావ్యముల నభ్యసించుట వలననే వృత్తస్వరూపజ్ఞాన మభ్యాసకునకు గల్గును. కాని మాత్రావృత్తములు ఉపజాతులు మొదలగువానియం దొక్కొక్కయెడ సంశయముకల్గుట కవకాశమున్నది. అపుడు ఛందశ్శాస్త్రము నుపయోగించును.

కళాశాస్త్రములనుండి కళలతత్త్వము సరిగ దెలియును. ౭ సూ.

గీతము, నృత్యము, చిత్రలేఖనము మొదలగునవి కళలు. విశాఖిలుడు మొదలగువారు వ్రాసిన కళాశాస్త్రములు వానిని దెలుపునవి కాన వానినుండి కళాతత్త్వమును సరిగా తెలియనగును. అట్లెరుగనిచో గళావస్తువును గావ్యముల జక్కగాకూర్ప చేతగాదు గదా!

కామశాస్త్రమునుండి కామోపచారము. ౮ సూ.

"సరిగ దెలియును" అని వెనుకటి సూత్రమునుండి అనువర్తించును.

కామోపచారము కామశాస్త్రమునుండి సరిగ తెలియనగును.
కావ్యములోని * వస్తువు కామోపచార బహుళముగదా!

దండనీతినుండి నయాపనయములను ౯ సూ.

అర్థశాస్త్రమునుండి నీతిని దుర్నీతిని సరిగ నెరుగ నగునని యర్థము. షాడ్గుణ్యమును సరిగా బ్రయోగించుట నయము. దానికి విపరీతమైనది యపనయము. వానిని సరిగా దెలియక పోయినచో నాయక ప్రతినాయకుల నడవడిని కావ్యమున గూర్చుటకు వీలు గాదుగదా!

దాన నితివృత్తము † కుటిలతయు. ౧౦ సూ.

ఇతిహాసాదులే యితివృత్తము. అదియేకావ్యశరీరము. అది దండనీతివలన గుటిలమగుట సంభవించును. దుర్బలులు మొదలగు

* 'వస్తువు' ఇతివృత్తము.

† 'కుటిలత్వము' :- ఇది దృష్టాంతరూపమున స్పష్టపరచబడును. రామాయణమున వర్ణించిన రీతిగున శ్రీరామచంద్రచరిత్రము నాటకమున వ్రాయుచో

వ్యాకరణము కేవలప్రయోగమును జక్కఁ దెలియుట కదియే కదా మూలము. కావున ఉపదేశ్యులకుఁగూడ గావ్యనిర్మాణమున యథోచితముగ నుపయోగము చెప్పవలయును.

లక్ష్యము నెఱుఁగుట, యభియోగము, వృద్ధసేవ, అవేక్షణము, ప్రతిభ, యవధానము, ప్రకీర్ణము. ౧౧ సూ.

దానిలో లక్ష్యములనెఱుఁగుట యనఁగా, గావ్యపరిచయము ౧౨ సూ.

లక్ష్యముల నెఱుఁగుటయన నితరుల కావ్యములందు పరిచయము. అందువలన గావ్యనిర్మాణమున జక్కని వ్యుత్పత్తి గల్గును.

కావ్యబంధమున నుద్యమమభియోగము. ౧౩ సూ.

కావ్యబంధమనఁ గావ్యరచన, దానియం దుద్యమమనఁగా మాటి మాటికి విడువక ప్రయత్నించుట యభియోగ మనఁబడును. దానివలన కవి కుత్కర్షము సంభవించును.

---

నాటకము పంచసంధియుక్తముగా నుండవలెను. ప్రతినాటకమునందు గర్భవిమర్శములు సరిగా నేర్పడవు. ఒకమనుజుడు పుట్టెను. పెరిగెను. చదివెను. పెండ్లాడెను. ధనము నార్జించెను. అని కావ్యనాటకములు వ్రాయుచో నది మానవసామాన్య జీవితమాత్రమే యగుట నందు చమత్కారమేమియు లేకపోవుటయేగాక విశేషము నేర్పరిగినది యేమియునుండదు. అగ్రంథము పాఠకుల కనాదరణీయమగును. ఇక నదియే యతని జీవితములోని యేదుష్టయుక్తో యనుకూల ప్రతికూల శక్తుల సమావేశమొందిన యొకకొంతచరిత్రము కావ్యనాట్యములనై బంధించినది యితివృత్తమై చిత్రోత్పాదకమగుటచే చమత్కారావహమగుటయేగాక యాయాశక్తుల యానుకూల్య ప్రాతికూల్యములు హానోపాదానములకై విశేషములకు విజ్ఞేయములగును. అట్టియనుకూల ప్రతికూల శక్తులసమావేశమే గర్భవిమర్శ సంధులందు ప్రసక్తించును. కావున శ్రీరామాయణ చరిత్రవర్ణనమున నాటకముల గర్భవిమర్శ సంధుల నిరూపించదలచిన మహాకవులు రాజనీతి ప్రకారముల నాశ్రయించిరి. అప్పుడు శ్రీరామ రావణుల వృత్తమును జయ పరాజయ సాధనముగా వర్ణించుటకు వీలుగలిగినది. ఆయితివృత్తమును పరశురామాగమనము మొదలుకొని వ్యాపారాస్వాభావ్యమను వైచిత్ర్యము (కౌటిల్యము) నొందినది. ఇట్లువైచిత్ర్యసాధనము దండనీతియే గావున నని యిచట నట్లు నిరూపింపబడినది. ఫలనిర్వహణమున కనుకూల ప్రతికూలములగు శక్తుల సమావేశవిశేషమున నేర్పడు నొకకథావైచిత్ర్యమే కపటిలత్వము. అంతియకాని కౌటిల్యము మొదలగునది కాదని యెరుగునది.

కావ్యముల నుపదేశించు గురువులకు పరిచర్యజేయుట
వృద్ధసేవ. ౧౪ సూ.

ఇందువలన కావ్యవిద్య సంక్రమించును.

పలుకునుంచుటయు, దొలగించుటయు నవేక్షణము. ౧౫ సూ.

ఈవిషయమున పద్యములు :-

గీ. మనసటుయిటు లూగెడుదనుక పదము
వేయుటయు దీయుటయు సంభవించుచుండు
దానికి నిస్థైర్యమే స్థాపితంబయినను
నమ్మయదియె సరస్వతి యబ్బుటనగ.

గీ. పదములే కూర్పునను మారుపాటులేమి
యును సహింపనెసహియింపవను భవమున
పలుకులను బొందికగ గూర్పగలుగువార
లదియపో శబ్దపాకంబటందు రెపుడు.

ఉదాహరణము:-

క. మాకొలది జానపదులకు
నీకవనపుఠీవి యబ్బునే కూపనట
ద్భేకములకు గగనధునీ
శీకరములచెమ్మనందిసింగయతిమ్మా.

(ముక్కు తిమ్మనమీది చాటుధార)

ఇందు "గగన" యనుపదము నీపద్యరచయిత కూర్చెను. తరువాత శ్రీకృష్ణదేవరాయలవారి పద్యమునువిని "గగన" యను పదమును దొలగించి "నాక" యను పదమునుగూర్చిరి.

మొదటికూర్పులో గగనపదము * మారుపాటును సహింప గల్గినది. ఈరెండవకూర్పులో "నాక" పద మట్టిమారుపాటును

* మారుపాటును—ఇచటి తత్త్వమిది.

ఇది ముక్కు తిమ్మన్న గారి కవితాప్రశంస. ఇందు "కూపనటద్భేకములకు" అను పదము తర్వాత 'గగనధునీ' యను పదమును గూర్చుచో పద్యపునడక కుంటు

**మనసున కేకాగ్రత యవధానము. ౧౭ సూ.**

విషయాంతరములనుండి మనసు మరలుట యేకాగ్రత. అట్టి యేకాగ్రత్వముండిననేగదా మనసు రచనీయములగు నర్థములను చక్కఁగా గ్రహింపగలదు.

**అదీ దేశకాలమువలన నగు. ౧౮ సూ.**

**ఆయవధానము దేశకాలములవలన నేర్పడును.**

---

అని యుపాసన వెల్లడించెను. ఇందు మహోగ్రుని దుశ్చేష్టితమును నల్పుడు సభ్యులకును విశదపరచు ప్రకరణమున మాటలు విడివిడిగా గూర్చుటయు నతనియందు గల భీముని క్రోధమును వెల్లడించునెడ సమాసగుంభితము నోజఃకాంతి దీప్తియుతము నగు కూర్పును నిరసనీయతను వెల్లడించుటకై నిర్విశేషణముగ 'సుయోధను' అనియు, శౌర్యప్రదర్శనోచితమగు స్థలమును, నత్యల్పకాలమున దుర్యోధననాశ సూచకముగా వర్ణించుచో 'నుగ్రరణాంతరమ్మునన్' అని యనుప్రాస సంఘటనమును నన్నయ భట్టారకుని రచనావైదగ్ధ్యమును వెల్లడింపకమానవు. ఇట్లే స్థలాంతరముల కూడ నూహించునది. ఇక ప్రకృతమున వర్ణ్యానుగుణము గాకపోవుటవలన వెనుకటి 'గగన' యను కూర్పు గ్రాహ్యముకాదనుట స్పష్టమే. ఈవిషయమంతయు పూర్వకాలమున శ్రీకృష్ణదేవరాయలువారి సమయమున సాహితీసుధాసముద్ర తరంగముల నోలలాడు నండరకును ప్రముఖవేద్యమే. ప్రకృతకాలమున సాహిత్యము దురవస్థాపన్నమై యుం డుటచే నింతదూరము వివరింపవలసి వచ్చినది. ఇక 'నాక' యను పాఠమునగల గుణ మును విచారింతము. ఈ 'నాక' పదము వెనుకనున్న 'భేక' పదముతోను ముందున్న 'శీకర' పదముతోడను చక్కఁగా నానుకూల్యమునొంది కూర్పులో నెగుడు దిగుడును పోగొట్టి శయ్యాపాకములను సమకూర్చును. అపుడు చదువగనే 'భేకములకు నాకధు నీశీకరముల' యనుటలో ననుప్రాససంఘటనమువలన వెనుకటి విసుగు, ఉయ్యాలలోని యొకవింతవిసరువలె క్రొత్తసొగసునొంది స్ఫురించును. చక్కనియూపాకటి యనుభ వైక వేద్యమైనది స్ఫురించితీరును. ఈతీరుననూపు పాదాంతముల ముక్తపదగ్రస్త యమకములలోగూడస్ఫురించును. వర్ణ్యానుగుణమగు ధారాశుద్ధియు నిచట సహజ ముగనే స్ఫురించును. కాన నిచట 'నాక' పదమును మార్చుటకు వీలులేదు. మార్చిన, మరియేపదమునుగూడ నిచట నట్టి పాకమున బడజాలదు. కావున నిచట శబ్దపాక మని సిద్ధాంతము. ఇట్లే యర్థపాకము విషయముగూడ గ్రహింపవలయును. ఇచటనే యదికూడ తెలిసికొనదగును. 'గగనధునీ' యనుటలో గగనపుష్పాది స్ఫురణ కలిగి వివక్షితమగు ప్రశంసయం దవాస్తవికతనుబొపజేయును. 'నాకధునీ' యనుటలో నట్టి యవాస్తవిక వస్తుస్ఫురణ లేకపోవుటయేకాక శేషాభావసుఖముల స్ఫురణ కలి

ప్రదేశకాలములను చెప్పుచున్నాడు.

వివిక్తమగు ప్రదేశము. ౧౯ సూ.

నిర్జనమగుస్థల మేకాగ్రతను గలిగించును.

రాత్రి చతుర్థయామము కాలము. ౨౦ సూ.

రాత్రియొక్క నాలవజామున మనసు బాహ్యవిషయముల నుండి యుపరతమై ప్రసన్నముగానుండి యవహితము కాగల్గును.

ఇప్పటికి కావ్యాంగముల బ్రదర్శించుటయైనది. ఇక గావ్య విశేషముల నెరుగజేయుచున్నాడు.

---

గించి శ్రవణబోధనములందు సుఖశ్రవ్యత, యర్థవ్యక్తి, హృదయానందకత, మొదలగు సద్గుణముల స్ఫూర్తిని నొందింపజేయును.

కావున నిచట 'పాక' యను శబ్దార్థముకూడ పాకమనబడినదని గ్రహింప వలయును. ఇక పాక వైగుణ్యమున కుదాహరణము నిచ్చినచో నిదియింకను స్పష్టము కాగలదని వ్యతిరేకోదాహరణములు చూపబడుచున్నవి.

ఉ. అంచితులైన బందుగులయందిరె ముందర జెక్కి నిన్ను మె
చ్చించెద కుంతిచేత రవిచేత నిజంబని నీకు సాక్ష్య మి
ప్పించెద ఫల్గున ప్రముఖవీరులు గొల్వగ నెల్లభూమి యే
లించెద నప్రకీర్తి విమలీకృత సర్వదిగంతరంబుగన్.

ఇచట 'నిన్ను నెల్లెడ నరేంద్రునిఁజేసి మండలించెదన్' లేక 'ఎల్లవారలు నరే యనునట్లుగ మండలించెదన్' అని దిద్దవలయును. ఇందు యీతువిసమాస మర్ధా ననురూపముగుటయేగాక పైనుండివచ్చుచున్న సొగసును భగ్నమొనర్చుచున్నది. 'ఇట్లు చేయించెద' 'ఇట్లుచేయించెద' అని మాటలన్నియు మొదటనుండియు చెఱకుముక్కల వలె నుండగ నీచివరసమాసము దానిలో నేమాత్రముకలయక బ్రాహ్మణపరిషత్తులో చండాలునివలె నున్నది. ఇది పోయినను పద్యమునకెల్ల లోపమేమియు లేదు. ఇంకొకటి :—

ఉ. కామముచేతగాని భయకంపితచిత్తముచేత గాని యీ
భూమి సమస్తమేలుకొను పూనిక చేతనుగానియిట్లు నా
నేమమెగోరి చుట్టముల స్నేహితులన్ విడనాడి నేడు మ
త్స్వామి సుయోధనున్విడచివత్తునె వచ్చిన మెత్తురేజనుల్.

ఇచట 'భయముచేతగాని' యనుట బాగుగా నడుచును. మొదట కామముచేత ననుచు భయకంపితచిత్తమను సమాసమును వర్ణ్యమగు భయమున కనుగుణము కాని దానిని కూర్చుట యసంగతముకాదా! ప్రాచీనకవులట్టి సందర్భమున :—

గద్యము, పద్యమును కావ్యము. ౨౧ సూ.

గద్యమున గురు లఘు నియమాదులు సులభముగా గుర్తింపరావు. కావున నది రచించుట చాలకష్టము. ఈవిషయమును సూచించుటకే గద్యమును మొదట చెప్పినది. గద్యమును గురించి పెద్దలిట్లు చెప్పుచున్నారు. "గద్యమది కవులకును నికషమ్మంట్రుడు".

అదిమూడువిధముల నేర్పడినదని చూపుచున్నాడు.

గద్యము, వృత్తగంధి, చూర్ణము, ఉత్కలికాప్రాయమును. ౨౨ సూ.

వాని లక్షణములను జెప్పుచున్నాడు.

పద్యభాగముకలది వృత్తగంధి. ౨౩ సూ.

పద్యముయొక్క భాగములు స్ఫురించుచుండు గద్యము వృత్తగంధి యగును. ఎట్లన; "నేనెన్నిజెప్పినను నిదిమానవుగా, నామనోరమా, వినరాదా"—

అనావిద్ధ లలితపదము చూర్ణము ౨౪ సూ.

అనావిద్ధములు = దీర్ఘసమాసములుగూర్పనివి. లలితములు = ఉద్ధతములుకానివియు, మృదువులునగు పదములు గలుగు గద్యము చూర్ణము.

ఉదాహరణము :

పెద్దలయెడ వినయమును, పిన్నలయెడ వాత్సల్యమును, గురువులయెడ భక్తియు, నేరువదగినవి నేర్చుటయు, విడువదగినవి తప్పక వీడుటయును, మనుజున కుచితములు. అవి లేవేని మనుజుడగుట యెట్లు ? నలువురిలో దగుననిపించుకొనుటగదా మనుజుని జన్మమునకు ఫలము."

---

శా. కామోత్కంఠత గోపికల్ భయమునన్ గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్
బ్రేమన్ మీరలు భక్తి నేమునిదె చక్రింగంటి మెట్లైనను
ద్దామధ్యాన గరిష్ఠుడైన హరిజెందన్ వచ్చు నుర్వీశ్వరా.
(భాగవతము. సప్తమస్కంధము. ౧౨ పద్యము.)

ఏతద్విపరీత ముత్కలికా ప్రాయము. ౨౫ సూ.

దీర్ఘసమాసములు కలవియును, నుద్ధతములునగు పదము లుండిన గద్యముత్కలికా ప్రాయము.

ఉదాహరణము :

“కులిశశిఖరఖరనఖరప్రచయ ప్రచండచపేటపాటిత మత్తమాతంగ కుంభస్థల గలన్మదచ్ఛటాచ్ఛురిత చారుకేసరభారభాసుర ముఖే కేసరిణి.”

పద్యము పలుతెఱగులుకలది. ౨౬ సూ.

పద్యము, సమవృత్తములు, అర్ధసమవృత్తములు, విషమవృత్తములు, నింకనిట్టివేయగు ననేకభేదములు కలిగియుండును.

అది నిబద్ధము, అనిబద్ధమును. ౨౭ సూ.

అదియన పైజెప్పిన గద్యపద్యాత్మకమగు కావ్యము. ఈ రెండు విధములును ప్రసిద్ధములేకావున లక్షణమనవసరము.

స్రగుత్తంసములవలె నవి క్రమముగ సిద్ధించును. ౨౮ సూ.

మొదలు విడిగా పద్యములను గద్యములను రచించుట నభ్యసించుచు దానియందు నేర్పుగుదిర్చికొనదగును. అది కుదిరినపిమ్మట గ్రంధరచనము సిద్ధించును. పూవుల మొదలొక దండగాగూర్చుట నేర్చినచో పిమ్మట తలలోబెట్టుకొను నుత్తంసము కూర్చుట సిద్ధిం

చక్కగా పరిశీలించినచో నీరసనాలోపము బాగుగా నగపడును. ఇక నర్థపాకమునకుగూడ నిచటనే వ్యతిరేకోదాహరణము నిరూపింపబడును. మొదటి పద్యమున నాతుడి సమాసార్థమసంగతమగుటయు, నిరర్థకమగుటయుఁ గాక సమాప్తపునరాత్తత్వమను దోషమునుగూడ దెచ్చికొనివచ్చి పెట్టుట చదువరకు బాగుగనుండిన యర్థమును గూడ బాడుచేయుచున్నది. ఈప్రబంధముల నీదోషమునకంతగా ప్రసక్తి లేకున్నను నాటకములందు తప్పక యది ప్రసక్తించును. ఈసమాసమున నర్థమే మంచిపాకమున బడలేదు ఇది యీపద్యమునుండి తొలగించిను కలుగు లోపమేమియు లేదు. ఈయర్థమేమైనను ప్రకృతవక్తవ్యార్థమునకు పోషకము కాదు. పోష్యమునుగాదు. విశేషాధాయకమునుగాదు. చమత్కారాధాయకమునుగాదు. లోపపూరకమునుగాదు. ఇట్లే రెండవపద్యములోని ‘కంపితచిత్తము’ అనునదియు గ్రహింపదగును.

చునుగదా. కొందరు విడిపద్యములను గద్యములను వల్కుటయందే పర్యవసితులైరి. వారిని నిరాకరించుచున్నాడు.

అనిబద్ధము తేజఃపరమాణువొకటివలె ప్రకాశింపదు. ౨౯ సూ.

గ్రంథరూపమున కూర్పబడనిది ప్రకాశవంతము కాజాలదు. తేజఃపరమాణువైనను నొక్కటి వెలుగొంద గలుగదు. ఈవిషయమున పద్యము నుదాహరించుచున్నాడు.

గీ. గ్రంథరూపమ్మునను గూర్పకలుగదేని
కావ్యముల కేటిచారుత కలుగబోవు
తైజసములగుగాక మొత్తమునువీడి
వేరయిన పరమాణులు వెలుగగలవె.

సందర్భముల దశరూపకము శ్రేష్ఠము. ౩౦ సూ.

సంధర్భముల=ప్రబంధములలో, దశరూపకము=నాటకాదులు మంచివి. ఏలనన;

విశేష సమగ్రము గావున చిత్రవస్త్రమువలె నది చిత్రిముగదా. ౩౧ సూ.

అందు విశేషములు సంపూర్ణముగా నుండును గాన నాదశరూపకము రంగులద్దిన వస్త్రమువలె నింపుగొల్పును.

దానినుండి భేదాంతరకల్పనము. ౩౨ సూ.

ఆదశరూపకము నుండియే భేదాంతరములు కల్పితములు. కథ, ఆఖ్యాయిక, మహాకావ్యము నను నివి నాటకాదుల * పరిణా

* పరిణామములే:—అని; ప్రవేశక విష్కంభ చూళికాదులతో గలిసిన నాటకాదులనే శ్రవ్యరూపమున రచించినచో మహాకావ్యము, కథ, మొదలగునవియగును. ఉదాహరణము:—కాళిదాసని యభిజ్ఞానశాకుంతలము నాటకము పిల్లలమర్రి పినవీరభద్రుని శృంగారశాకుంతలమను ప్రబంధమైనది. ఇట్లే శూద్రకమహాకవి మృచ్ఛకటికము సెట్టి లక్ష్మీనరసింహముగారి వసంతసేనయను నాఖ్యాయిక యైనది. మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి సంస్కృతనాటకకథలు నాటకములు కథాపర్యవసితము లగుట నుదాహరణముగా గైకొనవచ్చును.

మనుటేగదా. ఆ కథాఖ్యాయికా మహాకావ్యముల లక్షణమెక్కుడు మనోహరముకాదని ప్రాయ ముపేక్షింపబడినది. అది మరియొక చోట నెఱుంగనగును.

ఇయ్యది

ఆంధ్ర కావ్యాలంకార సూత్రవృత్తియందు శారీరమను
ప్రథమాధికరణమున మూడవ యధ్యాయము.
శారీరమున ప్రథమాధికరణము ముగిసెను.



—: ద్వితీయాధికరణము :—

కావ్యశరీరము స్థాపితమైనది. ఇక కావ్య సౌందర్యమును భంగపరచుటకు హేతువులగు దోషములు, విడుచుటకై తెలియదగి యున్నవి. కావున దోషదర్శనమను రెండవయధికరణమును మొదలిడుచున్నాడు. అందు మొదట దోషస్వరూపము చెప్పబడుచున్నది.

గుణముల విపర్యయమే దోషముల స్వరూపము. ౧ సూ.

గుణములు ముస్ముందు నిరూపింపబడును. వాని విపర్యయమే దోషముల స్వరూపమగును.

దోషజ్ఞాన మర్థసిద్ధమే. ౨ సూ.

గుణముల స్వరూపము నిరూపింపగనే తద్విపర్యయ స్వభావములగు దోషముల నెరుగవచ్చును. కావున నీవిషయమున శబ్ద ప్రయోగమేల చేయవలసివచ్చెను ? అనుశంకను వారించుచున్నాడు.

విస్తరణము సుఖబోధార్థము. ౩ సూ.

దోషముల పేర్కొని లక్షణములవలన నిరూపించినచో సుఖముగా బోధపడునుగదా !

పదదోషముల జూపుచున్నాడు.

అసాధువు, కష్టము, గ్రామ్యము, అప్రతీతము, అనర్థకము నగు పదము దుష్టము. ౪ సూ.

క్రమముగా వ్యాఖ్యానమున నివి స్పష్టపడును.

శబ్దస్మృతివిరుద్ధ మసాధువు. ౫ సూ.

వ్యాకరణవిరుద్ధమగుపద మసాధువని యెరుంగునది.

ఉదాహరణము.

"కర్ణుడు * దుర్ణయుండగుచు గౌరవనాథుని బాడుచేసె."

[పాండవాశ్వమేధము.]

---

* 'దుర్ణయుండు' అని యిచట కొందరిది సమాధానమందురు. ఉపసర్గములలో 'దుర్, దుస్' అను రెండుగలవు. వానిలో 'దుర్' అనుదానికి పైవాతిక ముచలన నిషేధమువచ్చినను 'దుస్' అనుదానికి నిషేధము లేదుకావున 'దుర్ణయుండు'

ఇచట "దురష్టత్వణత్వయోరుపసర్గత్వ ప్రతిషేధోవక్తవ్యః" అను వార్త్తికమననుసరించి "దుర్నయుండు" అనియగును. ఇంకొకటి "ఉదహరించుట" ఇచట "ఉత్" అను నుపసర్గము "హరించుట" యను కృదంతరూపము నున్నది. అప్పుడుద్ధరించుటయే యగును.

---

అనుపదము సాధువు అని వారివాదము. కాని యదిపొరబాటు. 'దుర్' అనుదాని కుపసర్గత్వమేవిషయమున నిరాకరింపబడినది ? ఎందులకు ? అనువిషయమును మొదట విచారింతము,షత్వముగానిణత్వముగానివచ్చువిషయమున, రాకుండుటకై యుపసర్గత్వ ప్రతిషేధము చేయబడినది. ఇచ్చటనో నడనష్టమేమి ? 'దుష్టాహాసికుడు, దుర్ణయుడు దుర్ణీతుడు' మొదలగురూపము లేర్పడుటకు లేక వానికసాధుత్వము దానిప్రయోజనము. ఇప్పుడు 'దుర్' అనుదానిని నిషేధించినను 'దుస్' అనుదానితో నీరూపము లేర్పడచినచో లేక వీనికి సాధుత్వమేర్పడినచో నిక నీనిషేధమునకు ప్రయోజన మెట్లు సిద్ధించును ? 'డీప్, డీష్, ఙీన్' అను మూడింటికిని ఈకారవిధి పర్యవసాన మున్నను వేరుస్వరములసంధానము విభిన్నరూపమున నిరూపించుటకు గారణమైనట్లిచట నేదైన నట్టిప్రయోజనాంతరమును దీసుకొనిరాగలరా ? 'దుర్' అనుదానికి నిషేధమును, 'దుస్' అనుదానికి తదభావమును జెప్పువారికి విభిన్నమగు ప్రయోజనమేదైన సంభవించునా ? దుర్ణయశబ్దనిష్పత్తియే నిషేధాభావమునకు ప్రయోజనమనినచో నిక నిషేధము నిరవకాశమేయగును. అపుడును నది ప్రబలమై దుర్ణయశబ్ద నిష్పత్తిని బాధించును. కావున 'దుర' అనుచోటు నిషేధము. 'దుర్' అనుదానితో దుర్ప్రయోగ మేదైనను 'దుస్' అనుదానికిగూడ సంభవించునని యొప్పవలయును. లేదా 'స్థితస్యగతిశ్చింతనీయా' అను న్యాయమున పాణినికంటె ప్రాచీనుల ప్రయోగములను సాధువులనిపించుటకైన నానిషేధాభావము నంగీకరింపవలయును. 'సఖినావానరేంద్రేణ' ఇత్యాదిప్రయోగముల సమర్థించిన దట్టిపద్ధతియేకదా. అంతియగాని నవీన ప్రయోగముల సాధుత్వమున కాపద్ధతి యుపయోగింపదు. నవీనులట్లు ప్రయోగింపరాదు. శ్రీమద్రామాయణములో 'సఖినా' యనునదియు, మరియొక ప్రాచీన గ్రంథములో 'సీతాయాఃపతయేనమః' యనునదియు నున్నవని యధునాతనులు వాని నట్లు ప్రయోగింపవచ్చునా ? ప్రయోగింపరాదనియేకదా వ్యాకృతిమర్మజ్ఞుల సిద్ధాంతము. కావున నీతిరుపతి వెంకటకవుల 'దుర్ణయ' పదమసాధువే.

చెవికింపుగానిది కష్టము, ౬ సూ.

ఎంతమంచి కావ్యమునందున్నను నదిచెవికి వెగటుగానే యుండును. ఎట్లన: "తిగికనినికగ్రాలు దృగంచలంబుతో సొగసుగ నా పయింబోలయు చూపు గిఱుక్కున గ్రిమ్మరించితి." (చండకౌశికము ౧వ అంకము.) ఇచట "గ్రాలుదృగంచలంబ"నునది వినుటకు వెగటు గొల్పుచున్నది.

లోకమునందే వాడుకగలది గ్రామ్యము. ౭ సూ.

లోకమునమాత్రమే వాడబడునది గ్రామ్యమనబడును. శాస్త్రమున దీనికి వాడుకయుండదు.

ఉదాహరణము

"ఫూత్కరించుచు నేచ్చెడుబొలతియయ్యె" ఇచట 'ఫూత్కరించుట' కావ్యముల నెక్కువగా వాడబడదు. ఇట్లే "తల్ల, గల్లా"ది శబ్దముల నెరుగునది.

శాస్త్రమునందే వాడుకగలది యప్రతీతము. ౮ సూ.

లోకమున నిదివాడబడదు.

ఉదా:- "పలుపలుకులేల నేను చెప్పగను రూప
స్కంధమున గుణము లేమియు గనుబడవిట
ప్రేమయనినను గుణనాంతరీయకంబు
గద యిచట నిన్నునేమనగలదు నాకు.

ఇందు "రూపస్కంధము, నాంతరీయకము" ఈరెండును లోకమున వాడుకలేనివి. బౌద్ధుల తత్త్వశాస్త్రమున మొదటిపదమును న్యాయాదిశాస్త్రమున రెండవపదమును వాడబడును.

పూరణమునకు మాత్రమే యగునది యనర్థకము. ౯ సూ.

ఉదా:- *"మునిపతియౌనగస్త్యుడు ప్రభూతదయామతి యీశరాసనం

* 'మునిపతి'__అని. ఆంధ్రమున చకారాదులవంటి ప్రత్యేకాక్షరములు పాదపూరణమాత్ర ఫలకములు లేమిచే నీపదమట్లుపూరింపబడియెను.

జనుల కరబాణసంతతుల నొప్పెడు తూణయుగంబు ప్రీతి ని
ప్పైను సకలక్షమాపతుల చేవయడంగగ జేయజాలు నీ
ఘనపు మహాత్త్రరంబు సురతల్లజసన్నుతమో తలోదరీ."

శ్రీ రామాభ్యుదయ కావ్యమున తృతీయాంకము.

ఇందు "ప్రీతి" యనునది పద్యపూరణమాత్రమునకే యుపయుక్తమైనది. మొదట "ప్రభూతదయామతి" యని యున్నదిగదా !

వాక్యాలంకారార్థకము లనర్థకాలు. ౧౦ సూ.

ఇది వెనుకటి సూత్రమున కపవాదము. వాక్యమున కలంకార మాత్రప్రయోజనము నపేక్షించి ప్రయోగింపబడిన ననర్థకముగాదు.

ఉదా :– "తెలియనివన్ని తప్పులని దిట్టతనాన సభాస్థలంబునన్
పలుకగరాకు మోరి పలుమారు పిశాచపు పాడగట్టనీ
పలికిననోట దుమ్ముపడ భావ్యమెరుంగక పెద్దలైన వా
రల నిరసింతురా ప్రగడరాణ్ణరసా విరసా తుసా భుసా."

తెనాలిరామలింగని చాటుధార.

ఇందు "తుసా, భుసా" యనునవి వాక్యాలంకారైక ప్రయోజనములు.

ఇకపదార్థదోష ప్రకరణము :–

అన్యనేయగూఢార్థములు నశ్లీలము క్లిష్టమును. ౧౧ సూ.

నాలవసూత్రమునుండి "పదముదుష్టము" అనునది తెచ్చికొని బహువచనములోనికి మార్చుకొని యిచట నన్వయించుకొన వలయును. అపుడు, అన్యార్థ, నేయార్థ, గూఢార్థాశ్లీల క్లిష్టములగు పదములు దుష్టములని సూత్రమున కర్థము; క్రమముగావాని లక్షణముల జెప్పుచున్నాడు.

రూఢిఁ బేడిన దస్వార్థము. ౧౨ సూ.

రూఢియనగా శబ్దము వినబడునంతనే దానివ్యుత్పత్త్యనుసంధాన మవసరము లేకుండగనే పదముమొత్తముమీద స్ఫురించునర్థము. ఆయర్థమును వీడి పదావయవముల యర్థమును మాత్రము గైకొని ప్రయోగింపబడిన పదమస్వార్థమనబడును. ఇచట 'కుండ' యనునర్థమున బ్రయోగింపబడిన 'గుడ్డ' యనుపదముగూడ నస్వార్థమేగాని యది యత్యల్పమతులకు గూడ తెలియవచ్చునదియే కావున దీని నీశాస్త్రమున గ్రహింపలేదు.

ఉదా :– "గంగాభవాని" (విజయవిలాస) భవాని పదము పార్వతియందు యోగరూఢము. అట్టిది యిచట గంగ యందు యోగ శక్తిమాత్రమున బ్రయోగింపబడినది.

కల్పితమగు నర్థముకలది నేయార్థము. ౧౩ సూ.

శబ్దము వినబడునంతనే తోచునర్థముగాక వేఱ యూహింప వలయునట్లర్థము నొకదానిని కల్పించినచోనది నేయార్థము. ఎట్లన :–

గీ. నలినిపంక్తివిహంగమనామ భృత్తనయ
విశిష్టమ్ము ప్లవగసైన్యమ్ము పర్వతముల
వర్షించుచుండగా దాని నబలహీనత
నులూకజిత్తు జయించెనపుడు.

ఇచట "విహంగమ" మనుటచే జక్రవాకమభిమతము. దాని పేరుగలవి చక్రములు. వానిని ధరించునవి రథములు. అవిపంక్తి సంఖ్యాకములు కలవాడు దశరథుడు. తత్తనయులు రామలక్ష్మణులు. ఇట్లే "ఉలూకజిత్తు"ను పదముచే నింద్రజిత్తను నర్థము కల్పింపబడి నది. ఎట్లనగా, కౌశికశబ్దము నింద్రుని నులూకమునుగూడ జెప్పును. ఇట్లు కౌశిక శబ్దముచే నులూకమువలె నింద్రుడును బోధింపబడును కావున నులూకుడన నింద్రుడని యర్థము.

ఇట్లైన రథాంగనామయని చక్రవాకపరముగా నుపయోగించుట గూడ తప్పుగావలసి వచ్చును గాని యది నిరూఢలాక్షణిక పదము

కావున నిట నీరజము కేసరి ఇత్యాది "రథాంగనామా, రథాంగవైరి" ఇత్యాదులను నిహతార్థములని గ్రహింపవలెను.

ప్రసిద్ధముగాని యర్థమున ప్రయోగింపబడినది నిహతార్థము. ౧౪ సూ.

ఏదైన నొకపదమున కొకయర్థము ప్రసిద్ధముగాను మరొకయర్థ మప్రసిద్ధముగా నుండుననుకొనుడు. అట్టిపదము నాయప్రసిద్ధార్థమున ప్రయోగించినచో నది నిహతార్థమగును.

ఉదా:— "తెలియనఖాంకురాళి నెలచేడియసైకముదానుచక్కనుణా"

విజయవిలాసము.

ఇందు "చుక్క" యనునది "నక్షత్రము, అల్పభాగము" అను నర్థములందు ప్రసిద్ధము. "తరుణాతిది" యను నర్థమున నప్రసిద్ధము. ఇచట నీయర్థమును జెప్పు*వారిమతమున నిదిగూఢార్థము. ఇట్లే "అల సహస్రగు సేనానాయకుల కోర్వరాద పోసీదు సేనభూరమణవర్య" ఇచట "గో" శబ్దమున కర్థముగా ధేనువు ప్రసిద్ధమైనది. నేత్రమను నర్థము కవిసాంప్రదాయమున గోపదమునకు ప్రసిద్ధమగు నర్థముగాదు. అయినను, "సహస్రగు"-అనిన వేయికన్నులు గలవాడింద్రుడను నర్థమున వాడబడుటచే గూఢార్థము.

అసభ్యమగు నర్థాంతరముగలదియు నసభ్యమును స్మరింప
జేయునదియు నశ్లీలము. ౧౫ సూ.

ఏపదము వినబడినంతనే తానసభ్యార్థమును బోధచేయునో యది యశ్లీలము. "వీర్యము, వర్చస్సు" ఇవిరెండును క్రమముగా "శుక్రము, పురీషము" నను నసభ్యార్థములను బోధించును. వీనికి "పరాక్రమము, తేజస్సు" అను మంచి యర్థములుగలవు.

ఇట్లే యేపదములోని యొకభాగమసభ్యమగు నర్థమును స్ఫురింపజేయునో యదియు నశ్లీలమే. ఎట్లన :- "కృకాటికా" ఇందు "కాటి" యను నేకదేశము శ్మశానమును స్ఫురింపజేయును. "ఉత్త

*ఈ విషయమును నెక్కువగా తెలియగోరువారు ఆంధ్రశబ్దచింతామణి వ్యాఖ్యాలోకము చూడుడు.

ముండవె కాపురుషోత్తముండ'' ఇచట * ''ఉత్తముండవు'' అను దానిలోని యేకదేశము ''ముండ'' యనునది ''విధవ'' యను నిందార్థమును బోధించును.

గుప్తము, లక్షితము, సంవృతము, నశ్లీలములుగావు. ౧౬ సూ.

ఇది పైసూత్రమున కపవాదము. ఇట్టివశ్లీలములు కావు. వీనికి లక్షణముల జెప్పుచున్నాడు.

అప్రసిద్ధాసభ్యము గుప్తము. ౧౭ సూ.

అసభ్యమగు నర్థమేపదమున కప్రసిద్ధముగానుండునో యది గుప్తము.

ఉదా :—''సంబాధము'' దీనికి ''సంకటమను'' నర్థముప్రసిద్ధము. అసభ్యమగు గుహ్యార్థము ప్రసిద్ధముగాదు.

లాక్షణికాసభ్యము లక్షితము. ౧౮ సూ.

లక్షణ నాశ్రయించిననే, యేపదమునం దసభ్యార్థము స్ఫురించునో యది లక్షితము.

ఉదా :—''జన్మభూమి'' ఇది లక్షణ నాశ్రయించిననే గుహ్యమును బోధించును. శక్తిచేకాదు.

లోకసంవీతము సంవృతము. ౧౯ సూ.

అసభ్యార్థము ప్రముఖోపస్థిత మగుచున్నను ♦ లోకమాదరించిన పదము సంవృతము.

---

* 'ఉత్తముండవు':—అని. ఇందు అనంతరైకదేశము విధవయని బోధింపగనే మొదటి యేకదేశము దానిలోనికి అన్వయించియే యర్థోత్కర్షమును గొనిరా గల్గును. 'ఎందుకు బనికిరాని విధవవు' అని నిందోత్కర్షమును బోధించును. ఇదియే వెనుకటి యుదాహరణములకన్న విశేషము. ఇట్లె 'నీవేకాముండవు'. నీవేరాముండవు. ఇత్యాదులు గ్రహించునది.

♦ 'లోకమాదరించిన'—అని. ఇందువలన కడమకావ్యాంగములన్నిటికన్నను లోకమునకెక్కువ ప్రామాణ్యమిచ్చినట్లగపడుచున్నది. ఒక్క లోకాదరమేకదా

ఉదా :— [illegible] ఉపస్థానము, అభిప్రేతము, కుమారి, [illegible]

[illegible] :—

ఉ. పలువురంగీకరించిన పలుకులందు
దోషములు వెదకుటది సాహసకారమగును
పవ్వనికి నెవ్వాదము హృదయమందు
మూడు శివలింగమున్నట్టి తీరుజూడ.

అవి వ్రీడాజుగుప్సామంగళాతంకదాయి యని మూడు విధములు.

౨౦ సూ.

అది :— అశ్లీలము, వ్రీడాదాయి, జుగుప్సాదాయి, అమంగళాతంకదాయి యని మూడువిధములు.

వ్రీడాదాయి— (సిగ్గు నొనరించునది).

ఉదా :—"వాక్కాటపము" ఇందేకదేశమగు "కాట" పదము పురుషచిహ్నస్మారకము గావున సిగ్గు గలిగించును.

---

పైపదముల గ్రహించుటకు ముఖ్యసాధనము. ఇచట లోకమనగా, శిష్టలోకమని యర్థమైనట్లైలయును. లేక పామరలోకమైనచో వెనుక 'గ్రామ్యము' అనుదోషమును నిరూపించుట యసంగతము కావలసివచ్చును. ఇందువలన 'లోకమునందే వాడబడినది గ్రామ్యము' అను యేతత్సూత్రములోని లోకపదమునకు కేవల పామరలోకమని యర్థము చెప్పవలయునని తేలుచున్నది. శిష్టలోకాదృతమైనంతమాత్రమున నసభ్యార్థకపదమును స్వీకరించినపుడు కేవలశిష్టలోకమాత్రప్రసిద్ధమగు సభ్యార్థకమైనపదముదుష్టమగునని గ్రహింపబడునా ? కావున లోకపదమునకు పామరలోకమనియే యర్థము. ఇవుడు పైయాశంక రాదు. అసభ్యార్థకము కాకున్నను గ్రామ్యమనునది శిష్టలోకమున నప్రసిద్ధమగుటచే దానివలన నర్థప్రతీతి యేర్పడక శిష్టోదితములును, నానాదిగ్గంతవ్యములు కావలసినవియునగు గ్రంథములకు బ్రచారము కలుగకపోవును. ఇదియేకదా యిప్పుడు గ్రామ్యభాషానిరాసకుల యుక్తి. ఇట్లు గ్రామ్యపదమునకు దూషకతాబీజమున్నదిగావున దానిదుష్టత్వమున విప్రతిపత్తి యొదవదు. సుభగ, భగిని ఉపస్థానములందు భగాదిశబ్దములును, నాలవదానిలో క్షేతపదమును, కుమారిలో మారి యనవాశకురాలుఅనునమంగళాశ్లీలమును, దోహదములో 'హద' పురీషోత్సర్గే యను ధాతువు స్మృతికిగొని రాబడుటవలన జుగుప్సాశ్లీలమును కలవు. కానియివియన్నియు లోకసంవీతములు కావున దోషములేదు. విమానము, కాలింగము, పద్మయోని మొదలయినవి యిట్లే గ్రహింపవలయును.

జుగుప్సాదాయి—(రోతకల్గించునది)

ఉదా:—"కపర్దకము" ఇందేకదేశమగు "పర్ద" యనునది పురీషద్వార రవస్మారకము గావున రోతకలించును. ఇశ్లేఆగుదము అనునది.

అమంగళాతంకదాయి—(అశుభము ఒకనుకల్గించునది).

ఉదా:—"సంస్థితుడు" ఇచట బాగానున్నాడను నర్థమున ప్రయోగింపబడినను ఈపదము మృతుని దెల్పునుగావున నశుభ సూచకము.

వెంటనే యర్థము స్ఫురింపనీయనిది క్లిష్టము. ౨౧ సూ.

ఉదా:—క. శతపత్రంబుల మిత్రుని
సుతుజంపినవానిబావ సూనునిమామన్
సతతము తల ధరియించిన
సుతవాహన వైరివైరి సున్నంబిదిగో.

ఇందు శతపత్రంబులమిత్రుడు - సూర్యుడు, వానిసుతుడు - కర్ణుడు, వానిజంపినవాడు-అర్జునుడు, వానిబావ-కృష్ణుడు, అతడు మహావిష్ణువుగాన నతని సూనుడు మన్మథుడు, అతనిమామ-చంద్రుడు, మన్మథునితల్లి-లక్ష్మీదేవియు, నితడును పాలసముద్రములోనే బుట్టినారు కదా! అతనిని సతతముతలధరియించినాతడు-చంద్రమౌళి, ఈశ్వరుడు, అతనిసుతుడు-విఘ్నేశ్వరుడు, అతనివాహనము-మూషికము, దానివైరి-పిల్లి, దానివైరి-కుక్క, అను సమన్వయమున నోకుక్కా సున్నమిదిగో యని పర్యవసన్నార్థము. ఈపద్యమున నర్థము వెంటనే స్ఫురింపక చాలవ్యవధానముగా స్ఫురించును. ఇది మరియొకయెడ ప్రసిద్ధము కానందున నన్యార్థముకాజాలదు గావున నిదిక్లిష్టము. మరియొకయెడ ప్రసిద్ధము కాకపోయినను వెంటనే యర్థప్రతీతి కలుగుచో నది క్లిష్టముకాదు.

ఉదా:—పై పద్యముననే "శతపత్రంబులమిత్రుని" యనునది. ఇశ్లే "కాంచీగుణస్థానము" అనునది గ్రహింపనగును.

తుది రెంటిచే వాక్యమును వ్యాఖ్యాతము. ౨౨ సూ.

అశ్లీలము క్లిష్టము నను చివరి రెండు దోషములచేతను వాక్యము గూడ వ్యాఖ్యానము చేయబడినది. అనగా వాక్యము గూడ నశ్లీలమును క్లిష్టమును గాగలదని యర్థము.

ఉదాహరణము :

గీ. అవినయమనసాఘనోన్నతి యనితలంప
కోయి యేది కళత్రరతిదాయియగునో
యిలబరార్థము బద్ధకక్షులగువారి
కెంతఘనమైన పేలవమే నిజముగ.

గీ. వాయువేగము నప్పిత్త వాపోయెను
పొలతుక మహాపక్షమ్మున మోటరెక్కి
వాటిపోయెను దైవమా తాళజాల
పోయి కలిసెద నేట నిప్పుడికరాను.

క్లిష్టోదాహరణము

గీ. ఎవనికి గురంగశాబాక్షి యెవరుబెట్టి
లేనితీరున నొప్పెడు సూనకలిత
మగు కబరిరంజితంబుగ మిగులకాక
యుండు నందము గన్గొనజుండు మనము.

లేదా

శా. చేసేతం బృథివీశులందికొన గాశీ సింధు తోయంబులన్
జేసెన్మజ్జన మంగుటంబున హరించెఁ బల్లవోర్వీశు న
ల్లాసంబొందగ ఫాలలోచనము, లీలంగట్టె గావేరి హే
లా సాధ్యాఖిల దిఙ్ముఖుండు కరికాలక్ష్మావిభుండల్పుడే.

(నిర్వచనోత్తర రామాయణము—తిక్కన)

ఇది

ఆంధ్ర కావ్యాలంకారసూత్రవృత్తియందు దోషదర్శనాధి
కరణమున ప్రథమాధ్యాయము.

—: ద్వితీయాధ్యాయము. :—

పద, పదార్థదోషముల బ్రతిపాదించి యిక వాక్యదోషముల జెప్పుచున్నాడు.

భిన్నవృత్తము, యతిభ్రష్టము, విసంధియునగు వాక్యములు ౧ సూ.

దుష్టములని సమన్వయము. క్రమముగావివరించుచున్నాడు.

లక్షణభ్రష్ట * వృత్తము భిన్నవృత్తము. ౨ సూ.

వృత్తము తనలక్షణమునుండి తొలగియుండువాక్యము భిన్నవృత్తము.

ఉదా :- "నాకువ్యసనికి నట్టిదినములువచ్చె గొన్ని గొన్ని రాగల విక కొన్నికొన్నిపోయె."

[బాలరామాయణము.]

విరసవిరామము ♦ యతిభ్రష్టము. ౩ సూ.

విరసమనగా చెవికింపుగానిది. అట్టి విచ్ఛేదముకలది యతిభ్రష్టము.

---

* వృత్తము—ఈపదమునకు పద్యమని యర్థము. అంతియకాని ఛందోభేదమగు వృత్తమని యర్థము చెప్పరాదు. అట్లయినచో జాత్యుపజాతులలోని లక్షణభంగములు దోషములు కాకపోవలసివచ్చును. ఈయర్థమును పురస్కరించుకొనిననే మూలకర్త వైతాళీయము నుదహరించుట యుపపన్నమగును. అతని మార్గము ననుసరించియే జాతిపద్యముదహరింపబడినది.

♦ యతిభ్రష్టము—సంస్కృతమున యతి యనగా విచ్ఛేదము. ఆంధ్రభాషయందు వర్ణసాజాత్యమునకు యతియందురు. ఇట్టి పేరు వచ్చుటకు కారణమేమని యోచింపగా మాకీయభిప్రాయము పొడగట్టినది. సంస్కృతమున యతి యనగా విచ్ఛేదముకదా. తెనుగున వచ్చు యతి ఇంచుమించుగా విచ్ఛేదస్థానమున నేర్పడియుండుట తఱుచుగా నుండును. కావున దత్స్థానభవమగుటచేత నుపచారమున యతియను పేరు మొదట వచ్చినతరువాత నాయర్థమున చిరకాలప్రయోగవశమున నది నిరూఢలాక్షణికమై యుండును. ఇందుకు విరతి, విశ్రాంతి పదములుగూడ నీయర్థిని బోధించుచుండుట యొకతార్కాణము. లేక యతియనగా నియమముతప్పక యుండుటయని యర్థము. తెనుగుపద్యములం దెల్లెడలను నీవర్ణసాజాత్యము నియతము

స్వరసంధికృతముగాని ధాతునామ భాగభేదమున దరచుగా
నది యుండును. ౪ సూ.

స్వరసంధియనగా నచ్చులతోడిసంధి. ధాతుభాగముగాని నామ భాగముగాని విడిబడుచో నవలి వాక్యము చాలవరకు యతి భ్రష్టమగును. ఆ విచ్ఛేదము స్వరసంధికృతమగుచో మాత్రము క్షంతవ్యమే. ధాతువులోని యొకఖండముగాని నామములోని యొకఖండముగాని విడిబడినచో వాక్యములు యతిభ్రష్టములగును. ఆ విడబాటు స్వరసంధి వలననైనచో నదిచాలవరకు దోషముకాదు.

---

గమ: ! కావ్యమున శబ్దార్థ దుష్టమనెడుఖను నర్థమునఁ గాని యీపదము నిరూఢలాక్షణికమై యుండదనవచ్చును. ఇట్టియతిమాత్రమేగాక ప్రాసముకూడ తెలుగులోని జాతివృత్తము లందు నియతముకావున నవిలక్షణానుసారముండనిచోట్ల యతిభ్రంశము, ప్రాసభ్రంశము నని రెండుదోషములు ఏర్పడును. మూలములోని యతిభ్రంశ మాంధ్రమున నసలు దోషమేకాదు. కావున నాంధ్రమున నీవక్ష్యమాణ యతిభ్రంశమే స్వీకరింపఁదగును.

యతిభ్రంశమున కుదాహరణము :—

'జెగజెట్టి నృసింహరాయశేఖరు డొసగుఁజో'

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

ఇచట 'జెగజెట్టి' యనుకొని 'శే' యని యతి కూర్పబడినది. కాని అసలు పదము 'జగజెట్టి' యని కావున నిచట యతి చెడినది.

'చన్నుగవమీద పయ్యెద చంగలింప. మైరావణచరిత్ర. మాదయ.

అసలుపదము 'చెంగలింప' యనికాని 'చంగలింప' కాదు. భ్రాంతివశమున నిచట యతి పాఠోదర్పబడినది 'చౌకళింప' యనిదిద్దుచో బాగుండును.

ప్రాసభ్రంశమున కుదాహరణము :—

శా. ప్రత్యక్షంబుననుండి యెల్లప్రజలన్ పాలించుచున్నప్డు సం
రక్షింపంగొని యాడినాముగద స్వర్గస్థాత్రియై కంటిచే
వీక్షింపంబడరానిదై ... ... విక్టోరియారాణి ప్రశంస.

తిరుపతి వెంకటకవులు.

ఇందుద్వితీయాక్షరమగు 'త్యా' క్రింద మూడుపాదముల ప్రాసముగా గ్రహింపబడలేదు. కావున నిది ప్రాసభ్రష్టము.

ధాతుభాగము విడిబడుటకు * మందాక్రాంతమున నుదాహరణము :—

ఏతస్యాం రా, జతి సుమనసాం దామకంఠావలంబి....

దుర్దర్శశ్చ, క్రకచకపిశః శార్ఙ్గిణో బాహుదండః (మందాక్రాంత)

నామభాగము విడిబడుట కుదాహరణము :—

కురంగాక్షీణాం గం, డతలఫలకే స్వేదవిసరః (శిఖరిణి.)

ధాతునామ భాగాతిరిక్తము వేర్పడినను దోషముకాదు.

ఉదా:— శోభాంపుష్యత్యయ మభినవః సుందరీణాంప్రబోధః (మందాక్రాంత)

విమిశ్రశ్శ్యామాం తేష్వరరపుట చీత్కారవిరుతైః (శిఖరిణి)

స్వరసంధికృతమగుచో దోషముకాదు.

ఉదా:— కించిద్భావాలసమసరలం ప్రేక్షితం సుందరీణాం.

వృత్తదోషమునకన్న యతిదోషము వేరుకాదు; వృత్తము యత్యాత్మకముగదా ! ౫ సూ.

"వృత్తము యత్యాత్మకమేగావున యతిభ్రష్టమునకు భిన్నవృత్తమను వెనుకటి దోషమునందే యంతర్భావము కావున నీదోషము వేరుగా గ్రహింపరాదు." అనిన, సమాధానమును చెప్పుచున్నాడు.

లక్షణము వేరుకావున పైమాట సరికాదు, ౬ సూ.

అట్లుగాదు. వృత్తలక్షణము వేరు. యతిలక్షణము వేరు. ఎట్లనగా; గురువులు, లఘువులు, వీని నియమస్వరూపము వృత్తము. పదవిచ్ఛేద స్వరూపముయతి, కావున భిన్నవృత్తదోషము, యతిభ్రష్టదోషమును నొకటిగాదు.

---

* మందాక్రాంతమున :— మందాక్రాంతవృత్తమునకు నాల్గింట, ఆరింట, ఏడింట విచ్ఛేదము సంస్కృతమున జెప్పబడినది. శిఖరిణీవృత్తమునకు ఆరింటను, పదునొకండింటను యతి చెప్పబడినది.

పదములకూర్పు విరూపమైన విసంధి. ౭ సూ.

పదములకూర్పు రెండు విధముల నుండును. కొన్ని యెడల నసలు కలియకగాను, మరికొన్ని యెడల పదములదగ్గర చేరికరూపముగాను నుండును.

కలియకుండుటయు, స్లిష్టతయు, కష్టత్వమును వైరూప్యము. ౮ సూ.

కలియకుండుట రెండువిధములు * ప్లుతప్రగృహ్యాసమావేశమునను, ఇచ్ఛావశమునను, పదములు కలియకయుండును. మొదటి విధములో ప్రగృహ్యాలు సంస్కృతముననే సంభవించును. అదిదోషముకాదు. ప్లుతమునకు ఉదాహరణము :—

శా. నాయయ్యాయని నాసుతాయని యయోనాన్నా యటంచుఁ బరే
నా? యింతేన? యటంచునాపయిని యింతాయంత ప్రేమంబుగాదే?
ఈయయ్యకునంచురాదె ? ఇకనోయీయిట్టి కార్యంబు నే
చేయన్నీకని ? యిట్టు లేడిచి కృశించెఁ మాటికిఁ మాటికిఁ.

ప్రగృహ్యమునకు ఉదా:— కమలే ఇవలోచనే ఇమే అను బధ్నాతివిలాస పద్ధతిః.

కవి ఇచ్ఛావశమున కలుపకుండుట ముఖ్యముగా ♦ దోషమే.

**ఉదాహరణము :—**

ఒకడునుచేయిచాచి ఫలమొందక యిప్పటికేగలేదు నే
డకట ధనంబులేనిసమయాన నితండరుదెంచినాడు ఇం

---

* ప్లుతప్రగృహ్య .. :—ప్లుతమనగా మూడుమాత్రలుగల యచ్చు. ఇట్టి ప్లుత మేడ్పునందును, దూరమునుండి పిలుపునందును' ప్రశ్నమందును, వికల్పమందును దఱచుగా సంభవించుచుండును. ఈనాల్గు విధములగు ప్లుతములు 'నాయయ్యా' అను పద్యమున నున్నవి. ప్రగృహ్యములు సంస్కృతమున మాత్రమే యుండును. తెలుగునందు లేవు.

♦ దోషమే—సంస్కృతమునందు వాక్యావసానమైనను విసంధి దోషమేగాని యాంధ్రమున వాక్యావసానమైనప్డు పాదావసానముకూడనగుచో నచట విసంధి దోషముగాదు. వాక్యావసానమైనను \ పాదమధ్యమునందు విసంధిదోషమే. ఈవిషయము నమసరించియే.

తకువిధివ్రాత యెప్పటికి తప్పదు కాదె ప్రయత్నముం బొన
ర్చుకొనినహీయటంచనక రూఢియొనర్చెద నాదు దానముల్.

1915 సం॥రం విజయనగరములో గణపత్యుత్సవ సందర్భమున
నష్టావధానము—భోగరాజు నారాయణమూర్తిః.

అశ్లీలమున కుదాహరణము :— జుగుప్సార్థమున-

* "చూడరాదేరుగుచితమ్ము వాడియుంట"

---

గీ. సర్వతీర్థాభిగమనంబు సర్వవేద
సమధిగమును సత్యంబుతో సరియుగావు
ఎరుగు మెల్లధర్మములకు నెల్ల పెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు.

అనుభారతపద్యము నుదాహరింపలేదు.

* 'చూడరాదేరుగుచిత' ... ఇచట మలార్థమున శకటరేఫము వలయును గావున నశ్లీలముగాదని భ్రమపడరాదు. శకటరేఫము లేకుండుటవలన శ్రోతలకా యర్థము ప్రతీతముకాకున్నచో నశ్లీలము కాకపోవునుగాని, అదిలేకున్నను మలార్థ ప్రతీతి వెంటనే కలుగును. కావున నిది యశ్లీలమే. కనుక నే

సంస్కృతమున నుదాహరణము :— 'చకాశేపనసప్రాయైః పురీషండమహో ద్రుమైః' అనునది పొసగును. పవర్గ ద్వితీయాక్షరము (ఫ) యనునదిసవిసర్గముగా నున్నగాని లింగవాచకముగాదు. అట్లులేకున్నను 'శేప' యనుదాని నుదాహరణమిచ్చు టలోగల యభిప్రాయమేమనగా; అశ్లీలార్థ వాచకము కాకపోయినను పదసమా వేశమువలన నశ్లీలార్థము ప్రతీతమైనను చాలునని. అచట నిర్విసర్గమైనను, షవర్ణము లేకున్నను లింగప్రతీతి కలుగునుగాన నచట నశ్లీలదోషము తప్పనిదే. ఈ పద్ధతిని నిరూపించుటకే యిట్టియుదాహరణ మీయబడినది. ఇంకొకవిశేషమేమన :—

భరమైతోచు కుటుంబరక్షణముకా బ్రాల్మాలి చింతల్ నిరం
తర తాళీదళ సంపుటప్రకర కాంతారంబునం దర్థపుం
దెరువాటుల్ దెగికొట్టి తజ్జ్ఞపరిషద్విజ్ఞాత చౌర్యక్రియా
విరసుండై కొఱతంబడుల్ గుకవిపృథ్వీభృత్సమీపక్షితిన్.

(మనుచరిత్రము).

పైపద్యమున 'కొఱతల్' అనుచోట అత్వమప్రకృతార్థమున నుండరాదని శ్రీప్రభాకరశాస్త్రిగారు మనుచరిత్రపీఠికలో వ్రాసియున్నారు. అయ్యది అలంకార శాస్త్రసంప్రదాయాననుగుణము. ప్రకృతమున శ్లేషస్థలమనుకొన్నను 'సబిందుకాబిందుక యోః సవిసర్గావిసర్గయోః' అను న్యాయము ననుసరించి యత్త్వమున్నను నర్థప్రతీతి నిర్బాధముగాన నిచట దోషము రాజాలదు. 'చకాసేపనస' అనుచోట నిర్విసర్గమైనను నసలొకయక్షరమునకు మరియొకయక్షరమే యిచటనున్నను నర్థప్రతీతి కలుగును

"మాడదాపేప సట్టుగా నాపియుంటి"

* "........యితడా పృష్ఠ్వైభరం బొక్కెటా." (పాండవాశ్వమేధము.)

లజ్జార్థమున :–

"అవిమె నీచుల్లిపాయలు మివులనవిసె"

"మున్నరికంపుమాటల సముద్ధతిజూపితి." (పాండవాశ్వమేధము.)

అమంగళార్థమున :–

"తలచు చావునుగొని తెచ్చు దారినతడు."

కష్టత్వమున కుదాహరణము :–

స్వస్తికృద్వాస్తవస్తుత్యగస్తిమఘవ ।
మకుటమోటన శతకోటి మంత్రిభృత్య ।
భూతభూతాత్తశాంభ వీభూమికుండు ।
తత్పురంబేలు పాండ్య మత్స్యధ్వజుండు ॥ ఆముక్తమాల్యద.

వాక్యదోషముల నిరూపించుట ముగిసినది. ఇక వాక్యార్థ దోషముల జెప్పుచున్నాడు.

వ్యర్థము, ఏకార్థము, సందిగ్ధము, అయుక్తము, అపక్రమము, లోకవిద్యావిరుద్ధములును దుష్టములు. ౧ సూ.

క్రమముగా వివరించుచున్నాడు.

---

గావున నుదాహరణత్వము సరిపెట్టుకొనుటలేదా? ఇట్లే శ్లేషస్థలములందు నీషద్వైషమ్యమర్థప్రతీతిభంజకము కాదేని దోషమేమాత్రము కాజాలదని గ్రహింపవలయును. ఇట్టి విషయములు శ్లేషస్థలములందు దరచుగా సంభవించుచుండును. వేంకటాధ్వరి మొదలగు శ్లేషకవుల గ్రంథముల బరిశీలించిన నగపడును. అవి కావ్యసౌందర్య భంజకములుగాని రసప్రతీతి ప్రతిబంధకములుగాని కావు. కావున వానిని దోషములనరాదు. సాహిత్యసుధాసముద్రమున నవి యత్యంతాదరణీయములు. కావుననే 'పపపతామిహాహాభభభూతలే' (రసగంగాధరము) ఇత్యాదిప్రయోగములాలంకారిక పరిగృహీతములగుటయేగాక రసికజనమునకత్యాదర పాత్రములై యున్నవి. ప్రకృతస్థలము వ్యంగ్యస్థలముగాని వాచ్యశ్లేషస్థలముగాదు. అట్టి స్థలములందు పదము లర్థము నేవిధముగానైన స్ఫురింపజేయ జాలును. కనుకనే 'అత్రాంతరే కుసుమ సమయ యుగముప సంహరన్నజృంభత గ్రీష్మాభిధానః ఫుల్లమల్లికా ధవళాట్టహాసో మహాకాలః' అనుచోట 'కుసుమ సమయ యుగ ముపసంహరన్' అనగా మన్మథ సంహర్త ప్రతీతుడగును. ఇచట 'కుసుమశరం' అని లేదుగదా!

ముందువెనుకల యర్థవిరోధమున్న వ్యర్థము. ౧౦ సూ.

ఉదా :— " ప్రాయంబెంతయొ కొంతయేగె నిక జత్వారింశదబ్దంబు

---

* ...'పృథ్వీభరం బొక్కుటూ' ఇచట వేంకటశాస్త్రిగారు 'బొక్కు' యను పదమునకు ప్రాచీనప్రయోగము గలదు కావున నది యశ్లీలముగాదని సమాధానము వ్రాసిరికాని యది సరియైనట్లు తోచదు. ఈయశ్లీలములనునవి వెనుకటి ప్రయోగము లున్నంతమాత్రమున సరియగునవి కావు. అట్లు సరియగుచో 'శస్పాణ్యత్తి ప్రకిరతిశకృత్పిండకానామ్రమూత్రాన్' అను భవభూతిప్రయోగమున్నదని యెవ్వరైన 'మంచి శష్పంబుల సమృద్ధిబెంచియుంటి' యని ప్రయోగింపవచ్చునా ? ఇట్లేకంపుపదము దృష్టాంతముగూడ గ్రహించునది. ఇందలి తత్త్వమిది :—కవి యేపదములను ప్రయోగించునో యాపదములందుగాని పదముల సమావేశమందుగాని తనకాలమున నశ్లీల ప్రతీతి లేకుండ చూచుకొనవలయును. అశ్లీలప్రతీతి యుండెనేని ప్రాచీన ప్రయోగము లున్నను నుపకరింపవు. ఇందులకు తార్కాణము పైనుదహరింపబడిన 'శష్ప' పదము. ఇట్లే 'యభిప్రేతపదముకూడ గ్రహింపనగును. ఈపదములోకపరిగృహీతము కావున సంవృతమని చెప్పి యశ్లీలదోషములేదని వామనుడువ్రాసెను. ప్రతాపరుద్రీయకారుడగు విద్యానాథుడు దీనినేయశ్లీలదోషమునకు 'అభిప్రేతపదావాసః కదానస్సంభవిష్యతి' యని యుదాహరణముగా వ్రాసెను. దీనివలన వామనుని కాలమున 'అభిప్రేత' పదము నిర్దుష్టముగా నంగీకరింపబడినను విద్యానాథుని కాలమున లోకులకాపదమున నశ్లీలప్రతీతి గలుగుచుండెననియు నందువలననాపదము నశ్లీలదోషదుష్టముగా విద్యానాథుడుదహరించెననియు మనకు స్పష్టమగుచున్నది. ఈయభిప్రేత పదమునకు ప్రాచీనప్రయోగములు కాళిదాసుని మాళవికాగ్నిమిత్రము మొదలగువానిలో నగపడును. కావున ప్రాచీనప్రయోగములున్నను ప్రయోక్తకాలమున నశ్లీలార్థప్రతీతిని కలిగించునది యశ్లీలమేయని యొప్పకతప్పదు. ఈహేతువుననే వారుచూపిన 'మరువక ననుష్ఠించునది సమంజసబుద్ధిన్' అనుప్రయోగమును ప్రకృతకాలమున 'అనుష్ఠించు' అనుపదప్రయోగము నశ్లీలమునుకాకుండ కాపాడజాలదు. ప్రకృతకాలమున నీపదమును, అశ్లీలార్థప్రత్యాయకముగా నేలోకమునప్రసిద్ధమైనదిగదా. ఇట్లే 'బొక్కు, కంపు' అనుపదములవిషయమునగూడ ప్రకృతకాలముననశ్లీలార్థ ప్రత్యాయకత్వమంగీకరించినదే. ఇంకొకవిషయము. ప్రాచీనకాలముననశ్లీలములైనను కవికాలమున నశ్లీలార్థప్రతీతి లేనిచో నచట దోషము రాజాలదు.

ఉదా:—'వాయుపదమును జూడుడు' ఇది జుగుప్సాకరమగు నర్థమునుబోధించునని యశ్లీలముగా హేమచంద్రాదులువ్రాసిరి. వారేకాక వామనుడుకూడ నంగీకరించినట్లు 'సోపానపథముత్సృజ్యవాయువేగస్సముద్యతః' అనుచోటబరికించినచో స్పష్టపడును. ఈపదము ప్రకృతకాలమున నశ్లీలార్థప్రత్యాయకముగాలేదు. ప్రాచీనకాలమున నశ్లీలమగుటకును నవీనకాలమున నట్లుగాకుండుటకును నుదాహరించెదము. 'వాయుజూడు'

కావామీ విస్మృతిమెందునా కౌతగొ". తిరుపతిశాస్త్రి

"ఎంతో కొంత యూను గడచెను" అని తెలియకట్లుచెప్పుట యైనను లేక విసుగుదలతో చెప్పదలచుకొనకుండుటయైనను నలువదియవ సంవత్సరము రాబోవుచున్నదియను ముందటి స్పష్టోక్తితో విరోధించుచున్నది.

తెలిపిన యర్థమును దెలుపుపదములున్న నేకార్థము. ౧౧ సూ.

ఉదా:— 'మోహచింతాత్మకమనంగమును సృజించె కమలలోచన చూపులు కాముకునకు" అనంగమనగాశృంగారము. ప్రకృతమగు విప్రలంభ శృంగారము చింతామోహాత్మకమేకావున ననంగ పదముచే మోహము, చింత యను పదములుక్తార్థములైనవి. ఒకయర్థమునుదెలుపు పదములు రెండు తనలో యుండుటవలన *వాక్యమేకార్థమనబడినది.

---

* వాక్యమేకార్థమనబడినది:—ఇచట గోపేంద్ర తిప్పభూపాలవ్యాఖ్యానములో నిట్లవతారిక వ్రాయబడినది. " 'ఏకార్థమగుట' యను లక్షణమును విచారించినచో నీదోషము పదగతమగుచున్నది. పదములలోగదా యొకే యర్థమును నుడువుట సంభవించినది. గానదీనిని వాక్యదోషమను టెట్లు సంభవించును. అనినదీనికి భావమిట్లు వ్రాయబడినది. ఛత్రిన్యాయమున (అనగా నొకగుంపులోనొకడు గొడుగు వేసికొనినను అందరినికలిపి ఛత్రులు వెళ్ళుచున్నారు అనునట్లు) వాక్యైక దేశమగు పదముయొక్క ధర్మము ఏకార్థత్వమనునది వాక్యమునందారోపింపబడి వాక్యము నేకార్థమని నిరూపించును." అని. కాని యివి సరికాదు ఇది వాస్తవముగ పదగతదోషమే యగుచో లక్షణాశ్రయణమున దీనికి వాక్యదోషముగా వ్రాయవలసిన యావశ్యకత లేదు. లక్షణ యనునదికూడ దోషమేగదా. బాగుగనాలోచించిన నిది పదదోషము కూడ కాకపోవచ్చును. ఒకేయర్థమున రెండుపదము లుండకూడదా? ఉండిన దోషమా? 'ఘటము, కలశము,' 'రాముడు, దాశరథి' ఇత్యాదిపదములు దుష్టములా? కావుననిది పదములదోషముకాదు. వాక్యదోషమే కావచ్చును. ఏకవాక్యఘటకము లగునపుడే పదములవిశిష్టముగా నర్థమును నుడివినచో నొకపదముచేతనే యచట నాకాంక్షితమగు నర్థ మునమకూరుచుండ ననాకాంక్షితమగు ద్వితీయపదము ప్రకృతవాక్యమున నుండుటవలన వాక్యమునకే యసౌందర్యము సంభవించును. కాలు కుంటిగామన్నచో మనుష్యశరీరమునకు లోపము సంభవించునుగాని కాలునకు లోపమేమైన కలుగునా? కుంటితనముకూడ మనుష్యశరీరాపేక్షమేగదా? అట్లే యిచట్ల

విశేషమున్నచో నేకార్థము దుష్టముకాదు. ౧౨ సూ.

ఆవిశేషమును నిరూపించుచున్నాడు.

"విలునారి చప్పుడు"లో విలుపదము ఎక్కుపెట్టుట
దెలుపుటకు. ౧౩ సూ.

"విలునారిచప్పుడు" అనుమాటలో "నారి" యనగా వింటినారి యేకావున విలుపదముక్తార్థమే. అయినను నది నారి వింటికెక్కింపబడిన

---

పదమునకుక్తార్థతకూడ ప్రకృతవాక్యము ననుసరించియే యేర్పడినది. వాక్యమునుండి దాని వేరుపరించినచో నాపదమునందేమైన దోషముకలదా? వాక్యప్రయుక్తమనగా నిదియేకదా! ఇట్లు వాక్యప్రయుక్తమగు నుక్తార్థత పదమునందేర్పడినను నది వాక్య దోషమేగాని పదదోషముకానేరదు. ఎచటదోషము వాక్యప్రయుక్తముగాక వాక్య భ్రంశితమగునప్పుడుగూడ బదమునందు స్ఫురించునో యచటనేయది పదదోషమగును. 'కృకాటికా' మొదలగు పదదోషముల యుదాహరణములను గమనించినస్పష్టపడును. వాక్యగతములుగాకున్నను పదాంతర ప్రయుక్తములైనచోనసగా(ఏకపదమునందాయా దోషములుండకున్నను) పదద్వయ సమావేశమాత్రమున దోషము సంభవించుచో దానిని గూడ (యది పదనిష్ఠమగుటకవకాశమున్నచో) పదదోషము క్రిందనే గణింప వచ్చును. కావుననే సంస్కృతములోని 'అన్యకారక వైయర్థ్యం' ఇత్యాదులును తెనుగులోని 'ఉదహరించు' ఇత్యాదులును దుష్టములైనవి. ఇట్లే యితర పదదోష ముల విషయమున గ్రహించునని.

ఇక దోషము వాక్యప్రయుక్తమగుచో నది పదమునందున్నను వాక్యమునం దున్నను నది వాక్యదోషమే. మరియు నేపదమునందును ప్రత్యేకముగా నిరూపింప వలనుకానిదియు, పదద్వయ సమావేశమాత్రనిష్పన్నమగునదియుగూడ వాక్యదోష ముగనే వామనుడు గ్రహించెను. కావుననే పదసంధి వైరూప్యవశమున నేర్పడు దోషములు పైజెప్పినవి వాక్యదోషములుగాజెప్పుట సరిపడినది. ఈవిషయ ముదా హరణముఖమున స్పష్టపరుపబడును. చకాశేపనసప్రాయైః—ఇచట 'శేప' యను వర్ణములు సమావేశమున దోషమేర్పడినది. ఇదియేపదమునందును ప్రత్యేకించి నిరూ పింపవలనుగాదు. 'చకాశే' పదమునందుగాని 'పనస' పదమునందుగాని ప్రత్యేకమీ దోషములేదు. కావుననే దీనినిగూడ వాక్యదోషమునుగా గ్రహించెను. ఇట్లు తెలు గున 'చూడరాదేరు గుట్టుగా దాచియుంటివి' అనుచోటు గ్రహింపవలయును. కావున వామనుని దోషవిభాగ పద్ధతిని, దోషలక్ష్యపద్ధతిని, సూత్రవిన్యాసపద్ధతిని, నిరూపణ పద్ధతిని బరిశీలించినచో నీచోట అనగా 'ఏకార్థపదత్వాద్వాక్యమేకార్థమిత్యుక్తమ్' (ఒకేయర్థమునుదెలుపు పదములు రెండుండుటవలన వాక్యమేకార్థమనబడినది' యను చోట) నిది పదదోషమైనను దీనిని లక్షణ నాశ్రయించి ఛత్రిన్యాయముచే వాక

మని తెలుపుటకు ప్రయోగింపబడుచున్నది. "విలు" అను పదము ప్రయోగింపనిచో వింటికి కెక్కు పెట్టబడిన నారి విలునారి యని తెలియుటకవకాశములేదుకదా.

ఉదాహరణము :—

"విలునారికాయ గుఱుతులుగల భుజమతిశయించె కలనమహీపా"

---

దోషమని చెప్పవలసివచ్చినవి. అని తిప్పెంద్రభూపాలుడు వ్రాసినది వామనుని యభిప్రాయముగాదు. వామనునకీ యభిప్రాయమున్నచో నిట్లు వ్రాయునేమో ? 'పదదోషస్యాపి ఛత్రిన్యాయేన వాక్యదోషత్వముక్తమ్' అని. 'అన్వాఖ్యాం వాక్యం వ్యాఖ్యాతం' అను వెనుకటివానివలనను— 'అర్థద్వారేణ లోకవిరుద్ధత్వం వాక్యానాం' అను లోకవిరుద్ధ దోషముయొక్క వృత్తివలను వామనుని శైలి పరికించిన 'ఏకార్థకపదత్వాత్ వాక్యమేకార్థమిత్యుక్తం' అని వ్రాయుడనితోచును. మరియు వాక్యదోషములుగా చెప్పబడినవన్నియు నించుమించుగా నీయేకార్థమువలె పదనిష్ఠములు గావా? వానికన్నిటికిని జెప్పని న్యాయమిచట నేల చెప్పవలసివచ్చును. కావున పైయభిప్రాయ మిచట వామనునకులేదనిస్పష్టమగును. ఇక నేమనిన 'వాక్యమేకార్థ'మని దోషము చెప్పుచున్నారు. అనునదియుక్తముగాదు వాక్యమే కార్థమగుటయేయుక్తము. వాక్యము భిన్నార్థకమగుచో వాక్యభేదదోషము రాదా? కావున నేకార్థత్వము దోషమనదగునా ?' అనుప్రశ్నకు సమాధానము జెప్పుచున్నాడు. వాక్యమేకార్థమగుట యుక్తమే గాని యీయర్థైక్యమాకాంక్షా పర్యవసితము (అనగా పరస్పర సాకాంక్షమగు నర్థములుండుట) 'అర్థైకత్వాదేకంవాక్యం సాకాంక్షంచే ద్విభాగేస్యాత్' అని కదా వాక్యమును నిరూపించి యున్నారు. ఇక ప్రకృతమున నట్టియేకార్థత లేదు. పదము లేకార్థములనగా నభిన్నార్థములు. అందువలన నిరాకాంక్షార్థ ప్రత్యాయకములైనవి. ఇట్టియేకార్థత పదగతమైనది. ఇది వాక్యగతమును, వాక్యైక్యమునకును, అథవా వాక్యసాధుత్వమునకును, వాక్యత్వమునకును, సాధకమునునగు నేకార్థత యనునదికాదు. అదిదోషముకాదు. ఇది వేరువిధము. ఉక్తార్థపదసంపన్నత్వరూపము పదగతమగు నేకార్థత వాక్యమునకు దోషావాదకము. దీనివలన వాక్యమేకార్థమని దోషము నిరూపించుచున్నామని యిచటి వాక్యగతమగు నీయేకార్థత్వస్వరూపమును వివరించుచున్నాడు. అంతేకాని వేరుకాదు. ముందు సందిగ్ధదోషనిరూపణమున సందిగ్ధమనగా సంశయ విషయముగదా దోషమెట్లగును ? అని యాశంకరాగా సంశయమును కల్గించును కావున సందిగ్ధమని వివరించుచున్నాడు. కావున వామనుని శైలి ననుసరించి యిచట వివరింపబడినదే యాతనితాత్పర్యమని గ్రహింపవచ్చును. సందిగ్ధదోష వివరణమును విశేష జిజ్ఞాసులు పరికించునది.

(కర్ణావతంసకర్ణ కుండల శిరశ్శేఖరములందు కర్ణాదుల నిర్దేశము సన్నిధికి).

చెవిపోగు, చెవిదుద్దు, తలపాగలందు చెవి తలల నుడువుట చేరువకు. ౧౪ సూ.

పైపదములందు కర్ణాదిపదములుక్తార్థములైనను చేరువను దెలుపుటకై యవి నుడువబడుచున్నవి. కర్ణాదిపదములు లేనిచో "చెవినిపెట్టుకొనిన పోగుల"ను నిట్టియర్థములు రాజాలవుగదా!

ముక్తాహారశబ్దమున ముక్తాశబ్దము శుద్ధికి. ౧౫ సూ.

హారశబ్దముచే నుక్తార్థమైనను ముక్తాశబ్దము శుద్ధిదెలియుటకు వాడబడినది. అనగా నితరములగు రత్నాదులతో గలియక కేవలము ముత్తెముల హారమేయని తెలియుటకు.

పూవులదండ యనుటలో పూవుపదము మంచికి. ౧౬ సూ.

దండ యనగానే పూవులదండ యని యర్థము దెలిసినను "పూవుల" పదమును బ్రయోగించుట మంచి పూవులని దెలుపుటకు. మంచి పూవులదండయని భావము. అయితే దండయనుపద మితర స్థలములందుగూడ "రత్నములదండ, మాటలదండ" యని ప్రయోగింపబడుచున్నందున తద్వ్యావృత్తికొరకై యచట "పూవుల" యను పదము ప్రయోగింపబడినదని యనరాదు. పైపదములందు ఆప్రయోగ ముపచారమున నేర్పడినది. వేరు పదముతో కలియని "దండ" యనుపదము పూవులదండనే తెల్పును కావున పైప్రయోజనమునకనరాదు.

ఏనుగుగున్న యనుమాటలో నేనుగుపదము తాద్రూప్యమునకు. ౧౭ సూ.

గున్నయన నేనుగు సంతానమేకావున నేనుగుపదము పునరుక్తము. అయినను తాద్రూప్యమును బోధింపగలుగును గావున నదుష్టము. ఏనుగు=ప్రౌఢయగుహత్తి. తద్రూపమగు (అట్టిదియగు)

సన్నిధమవి యసవిధానము. ఉదా :—పసగుసున్న యేటికి వహించెదు ప్రేమమున నాపకాంగనన.

విశేషణమునకు. ౧౨ సూ.

విశేషణము పోషపడుటకును నుక్తార్థమగు పదము ప్రయోగింప బడును.

ఉదా :— *"స్పష్టాక్షరమును, మధురమునగు మాటలనుడివెను" ఇచట "నుడివెను" అనుటవలననేమాట యుక్తార్థమైనది. అయినను

---

* తిప్పభూపనిచే నిచట నిట్లు నిరూపింప బడినది. 'స్పష్టాక్షర మధురముగా నుడివెను' అనుచో నుక్తార్థమగు 'మాట' యను పదమక్కరలేకయే విశేషణములు తెలియవచ్చును. కావున నీయుదాహరణము సరియైనదికాదు. ఇక నేదియన:_'నీలనీరజ వికాససుందరమగు చూపుగవచే ప్రియునివీక్షించుచున్నది.' అని. కాని యిదియుక్తము గాదు. ఏమనగా; 'స్పష్టాక్షరమధురమగు మాటను నుడివెను'. అను దాని యభిప్రాయము విశేషాపాదనము లేకుండ, అనగా తాను (వ్యాఖ్యాత). నిరూపించినట్లు కాకుండ (నాయభిప్రాయమును) మరియొకవిధముగా కవిచెప్పలేడా ? చెప్పబడదో? 'విశదమధురమగు నమృతప్రసోన యతనినోట వెలువడెను' అనుచో నైదాని యభిప్రాయమురాదా ? అది యిచట విచార్యమా ? పోనిండు. తానిచ్చిన యుదాహరణమున మాత్రమట్టి యవకాశములేదా ? 'నీలనీరజవికాస 'సుందరముగా జూచెను. ఇచ్చడు క్రియయగు చూపునందు నీసౌందర్యమురాలేదా ? ఆసౌందర్యము నేత్రగతము గాని దర్శనక్రియగతము కాదందురా, పైచోటమాత్రము మాటయందు స్పష్టాక్షరత్వాదు లుండునుగాని 'పలుకుట' యను క్రియయందుండునా ? అట్లుగాదు. నుడువుట యనగా స్పష్టమగుమాటను జెప్పుటగావున నందేకదేశమగు మాటలో స్పష్టాక్షరమధురత్వాదు లన్వయించును. ఇచట వీక్షించుటయనగా చూచుటమాత్రమే కావున నిందు నేత్రాన్వితము కాదగిన నీలనీరజవికాస సౌందర్యము నేత్రములు వాచ్యములు కానందున నన్వయించుటకు వీలుకాదు. అనియందురా ? 'చూచుట' యనునది నిరుపపదమగునప్పుడు నేత్రైక నిర్వర్త్యమేకావున నియతసహచరితమగు నేత్రము నాకర్షించియే తీరును. అట్లాక్షిప్తములగు నేత్రములయందే యీప్రాగుక్త సౌందర్య మన్వయించును. ఇంతకును వామనుని యుదాహరణమునకన్న తన యుదాహరణమున నేమో గొప్పవిశేషమున్నదని చూపబోవుట యట్టి సమంజసము గాదు. ప్రాచీనప్రయోగములను సవరించుటకు ప్రయత్నించిన వామనునియుదాహరణము దుష్టమగునా? కావున వామనుని యుదాహరణమునం దన్యాధా సిద్ధికల్పించిన వ్యాఖ్యాతయొక్క నిరూపణమంత యుక్తముగాదు.

స్పష్టాక్షరము, మధురమునను విశేషణములు తెలియుటకే మాటయని ప్రయోగింప బడినది.

* ఈ సమర్థనము ప్రయుక్తముల విషయము. ౧౯ సూ.

ఈ నిరూపించిన సమర్థనమంతయు నిదివరకు ప్రాచీనులగు మహాకవులు ప్రయోగించిన విషయముననేకాని యిక క్రొత్తప్రయోగములు సృజించుటకు గాదు. ఎట్లనగా: "శ్రవణకుండల" మనునట్లు "నితంబకాంచి" యని యనరాదు "ఏనుగుగున్న" యనునట్లు "ఒంటెగున్న" యని యనరాదు.

సంశయము కల్గించునది సందిగ్ధము. ౨౦ సూ.

రెండర్థములకును సాధారణములగు ధర్మములు శ్రుతములగుచుండుటవలన నేదోయొక పక్షమును నిర్ణయించుటకుగావలసిన విశిష్టధర్మములు వినబడుకుండుటవలనను వాక్య ♦ మర్థసంశయమును కలిగించును. దానిని సందిగ్ధమనదగును.

---

* ఈసమర్థనము:—అనగా, ప్రాచీనమహాకవులు పద్యముల నుక్తార్థమును వ్యర్థముగా ప్రయోగించియుందురనుటకు వీలులేదు. ఏమన, వారివ్యుత్పత్తిప్రతిభానములు గ్రంథము నితరభాగములందు మనకు తెలియునప్పుడవి పైయూహకు ప్రతిబంధకములుగానున్నవి. అయితే నిచట నుక్తార్థములగు నీకనబడు పదముల గతి యేమందురా; అచ్చటచ్చట నామహాకవులీ యుక్తార్థక పదప్రయోగముల నొనర్చుటలో నేదోయొక విశేషమును స్ఫురింపజేయ దలచుకొనియే యుందురు. మనకుగూడ నాయాచోట్ల నాయావిశేషములు చాలవరకు సహజముగా స్ఫురింపక పోవుటలేదు. మరియు మనకు గౌరవయోగ్యులైన యా మహాకవుల ప్రయోగముల కేదోగతి 'స్థితస్యగతి శ్చింతనీయా' యను న్యాయమున కల్పింప వలయును గదా? కావున పైచెప్పిన హేతువుల ననుసరించి యచటనాపదములకు పైనిరూపించిన తీరున విశేషజ్ఞాపన మొనర్చుట ప్రయోజనమని సమర్థింపబడినది. ఉక్తార్థములు వ్యర్థములు కావున నట్లు విశేషస్ఫోరకములగుట సాంప్రదాయసిద్ధమే. 'వ్యర్థంసత్ కించిత్ జ్ఞాపయతి' యనికదా వైయాకరణసాంప్రదాయము అని వామనుని గూఢమగు నభిప్రాయమని తోచును.

♦ ఇచటి యభిప్రాయమిది. సందిగ్ధమనగా సంశయగోచరమగునది. అది దుష్టమెట్లగును? చీకటిలో నెత్తుగానున్న వస్తువునుజూచి 'మొద్దా? మనిషియా?' యన్ని మనము సంశయపడినంతమాత్రమున సంశయగోచరమగు నావస్తువు దుష్టమగునా?

ఉదా:- "అమ్మహాత్ముండభాగ్యవశమ్ముచేత, నాపదవియుక్తుడయ్యె సుమ్మనవరతము".

మాయాదుల వికల్పితమగునర్థ * మయుక్తము. ౨౧ సూ.

వికల్పితమగు నర్థము—విరుద్ధముగా గల్పింపబడిన యర్థము.

ఉదా:- రాత్రిబగలు యేకాదశి రాజితముగ
భోజనత్రయమ్ము చేయగా బూనవలయు."

క్రమమునువీడిన యర్థముగలది యపక్రమము. ౨౨ సూ.

మొదట నుడివినవానికిని తరువాత నుడివినవానికిని నుండు సంబధము క్రమము. అది యర్థమునకులేనట్లు వాక్యమునస్ఫురించెనేని యావాక్యమపక్రమము.

ఉదా:- రాజకీర్తిప్రతాపముల్ రాజితముగ
సూర్యచంద్రుల సరియయి సొగసుమిగులు."

మరియు "అజగవశార్ఙ్గాలంకృత భుజగర్వ నిరస్తదైత్యభూమస్తుత్యా
త్రిజగద్ధారణనిత్యాభుజగసమాచరితశయనభూషణకృత్యా"

విరాటపర్వము. ఆ ౧ ప ౩౯.

---

యని యాశంకరాగా సమాధానమును చెప్పుచున్నాడు. ఇచట సందిగ్ధమన సంశయ జనకమని యర్థము. ప్రమాణములు నిశ్చయజనకములను శాస్త్రజ్ఞుల సంప్రదాయము ననుసరించి శబ్దప్రమాణమగు వాక్యముకూడ నిశ్చయజనకమే కావలయును. కావున సంశయజనకమగునపుడది దుష్టము అని.'

* అయుక్తము—ఇచట సరిగా ఉదాహరణముమాట యటుండనిండు. అసలు సూత్రార్థమే బోధపడుట కష్టము. ఏదోయొకరీతిగా నూహించి సూత్రార్థమును నుదాహరణమును వ్రాసితిమి. ఉదాహరణమున కర్థమిది. ఏకాదశినాడు, ఓజనమా మూడుచేయవలసియున్నది యని కాని భోజనైకపరాయణులు దానికి తమకనుకూలముగ పైజెప్పిన వాస్తవ వికార్థమునకు విరుద్ధముగా తమ మాయాపాటవమున 'మూడుసారులు భోజనము చేయవలయున'ని యర్థము జెప్పుచున్నారు. ఇచట మాయాపాటవమేమనగా, పైదాని యుత్తరార్థమును తలప నైన తలపకుండుటయు నితరులుగూడ దానినిగురించి మాటలాడకుండునట్లు తమసిద్ధాంతమును మహాకోలాహలముతో నుపన్యసించుటయునని తెలియుచున్నది.

అథవా, ప్రధానమగు నర్థమును మొదట నుడువుట క్రమమే. అది లేకుండ నరము వాక్యమున జెప్పబడుచో నపక్రమ మన దగును.

ఉదా:- "అశ్వమునొ హస్తినొ యిమ్ము యాచకునకు"

దేశకాలస్వభావ విరుద్ధములగు నర్థములున్న లోకవిరుద్ధములు.
౨౩ సూ.

దేశమునకుగాని, కాలమునకుగాని, స్వభావమునకుగాని విరుద్ధములగునర్థములు వాక్యములందున్నచో నవి లోకవిరుద్ధములు. అర్థము మూలమున వాక్యములు లోకవిరుద్ధములగును.

దేశవిరుద్ధమున కుదాహరణము :-

"నారికేళము లక్షోట భూరుహములు
ఎచటిపర్యంతభూముల నెలమిమిగులు
నట్టినగరమ్ము సౌవీరమందు మధుర
యనుచు బేర్వడినట్టిది యలరునొకటి."

శూరసేనదేశములందు మధురయున్నదిగాని సౌవీరమునగాదు.

కాలవిరుద్ధమున కుదాహరణము :-

"మధుమాసంబున బూవుదోటలు కదంబప్రౌఢ పుష్పాఢ్యముల్".

వర్షర్తువున కదంబములు పూచునుగాని వసంతమునగాదు.

స్వభావవిరుద్ధమున కుదాహరణము :-

"మత్తమధుపంబులను వందిమాగధుల ర
వంబుల ముఖరితములు సప్తచ్ఛదముల
మంజరులయందు శరదృతు మందగమన
వదనలక్ష్మీవిలాసంబు వరుసజూడు."

సప్తచ్ఛదమన ఏడాకులయరటి. దీనికి మంజరులు ( పొడవుగానుండు పూలదొంతరులు ) ండవు. స్తబకములు = పొట్టిగుత్తులుండును.

మరియు,

"కలికకోశమ్ము నల్లభృంగములగుమలు
మిగుల పీడింపజెప్ప నేమిగలదింక
వానగల్గిన మధువు చందమ్మువినుము
గోష్పదము నిండునట్లుగా గురిసెనపుడు.

మొగ్గకంతకును మకరంద మింతవిస్తారముగానుండుట స్వభావ విరుద్ధము.

కళా, చతుర్వర్గ, శాస్త్రములకు విరుద్ధములగు నర్థములున్నచో

విద్యావిరుద్ధములు. ౨౪ సూ.

వాక్యములందు కళాశాస్త్రవిరుద్ధములగు నర్థములును, చతుర్వర్గ శాస్త్ర విరుద్ధములగునర్థములునున్నచో నావాక్యములు విద్యా విరుద్ధము లగును. వాక్యములవిరోధ మర్థమూలకము.

కళాశాస్త్రవిరోధమున కుదాహరణము :-

"పత్రరచనా ప్రవీణులపతితకోటి
కంటకాగ్రము కాలింగమంట పత్ర
మిదుగొ వ్రాసిరి చూడుమీ వెలమిమీర.

కాలింగము, పతితకోటి కంటకాగ్రమని పత్రవేత్తల సాంప్రదాయము. సాంప్రదాయవిరుద్ధము కావున నిది కళాశాస్త్ర విరుద్ధము. ఇట్లే కళాంతరములతోడి, విరోధములను నూహింపవలయును.

చతుర్వర్గశాస్త్రవిరుద్ధముల కుదాహరణము :-

"రాజులందరొానర్చు సర్వరజయమ్ము
నకు సకలకామభోగమే యిక ఫలమ్ము"

రాజుల భూవిజయమునకు ధర్మమో, లేక యశ్వమేధాదియజ్ఞము లో ఫలమని యాగమము నుడువుచున్నది. దానితో విరోధించును గావున నీవాక్యము ధర్మశాస్త్రవిరుద్ధము.

"నీతి నీతి యటంచును గోతపడుదు
రహామికయె జాలు గెలువగా నరులనెపుడు"

శత్రుజయము నీతిమూలకమని దండనీతిశాస్త్రమునమర్యాద. ఇది దానితోడి విరోధముకలదికావున నీవాక్యమర్థశాస్త్రవిరుద్ధము.

"ఉత్తరోష్ఠాన బలుగాటు లొప్పు సుదతి
సురతఖేదాలసాస్యంబు స్మరణజేతు."

పైపెదవి, నోటిలోపల, క్రేగన్నులును విడిచి మిగిలినచోట్ల చుంబనము, నఖక్షతము, దంతక్షతము, లౌనర్పదగునని కామ శాస్త్రమున నున్నది. ఇయ్యదికామశాస్త్రవిరుద్ధము.

"దేవతాభక్తి ముక్తి నొందించుగాన
దత్త్వవిజ్ఞానమింకను దడవనేల."

ఇది తత్త్వజ్ఞానమున ముక్తికలుగునను మోక్షశాస్త్రమునకు విరుద్ధము.

ఈనిరూపించిన వాక్యవాక్యార్థ దోషములను విడుచుటకై తెలిసి యుండవలయును. ఇంకను సూక్ష్మములగు శబ్దార్థ దోషము లను గుణవివేచనమున నిరూపింతుము. ఉపమాదోషముల నుపమా ప్రపంచ మున నిరూపింతుము.

ఇది
కావ్యాలంకార సూత్రవృత్తియందు దోషదర్శనమను
ద్వితీయాధికరణము ముగిసినది.

—: మూడవ యధికరణము :—

వేనివిపర్యయమే దోషములస్వరూపమో ఆగుణముల విచారించు టకు గుణవివేచనమను నధికరణ మారంభింప బడుచున్నది. ఇచట ఓజః ప్రసాదాదులు గుణములనియు, యమకోపమాదుల లంకారములనియు

కావ్యవేత్తల సాంప్రదాయము. 'వీని భేదమునకేమిమూలము' అను విషయమున సమాధానము జెప్పుచున్నాడు.

కావ్యమునకు సొగసును గల్గించు ధర్మములు గుణములు ౧ సూ.

శబ్దమునందును నర్థమునందును నుండి కావ్యమునకు సొగసును గల్గించునవి గుణములు. అవియేవనగా, ఓజః ప్రసాదాదులే. అంతేకాని యమకోపమాదులుకావు. ఓజఃప్రసాదాదులులేనిచో నవి తామొంటిగా గావ్యమునకు శోభను దేజాలవు. ఓజఃప్రసాదాదులన్ననో యమకోపమాదులు లేకున్నను అవి యొంటిగానైనను గావ్యమునకు సొగసును సమకూర్పజాలును.

అట్లయిన నలంకారముల కేమిగుర్తు ?

దానిగొప్పదనమునకు హేతువులో యలంకారములు. సూ. ౨.

దాని గొప్పదనమనగా, గావ్యముసొగసు గొప్పదనమని యర్థము. హేతువులోయనగా, హేతువులు మాత్రము, అలంకారములు. అనగా, ఈహేతువులు వెనుక సూత్రమున జెప్పిన గావ్య శోభాకర్తలకన్న వేరు అనిభావము. అలంకారములు యమకోప మాదులు;

ఈవిషయమున పద్యములు.

గీ॥ అమలినములగు గుణముల నలరి యువతి
రూపుబలెగావ్యమాస్వాద్య తాపదమ్ము
ఎల్లెడనలంకృతులు మంచివెడములేక
వివిధముల గూర్చుచో నింక మివులనించు ।

యౌవనములేనికాన్త దేహమ్మువోలె
బలుకు గుణరహితమ్మని బలువురకు
మనమ్మునకు బ్రీతిగొల్పియున్నను నిజమ్ము
దుర్భగత్వమ్మును నలంకృతులు శ్రయించు

మొదటివి నిత్యములు. ౩ సూ.

మొదటనుడివినగుణములు నిత్యములు. కావ్యమున దప్పకయుండ వలసినవి. అవిలేకున్నచో నసలు కావ్యమునసొగసేయుండదుగదా !

గుణాలంకారముల భేదనిరూపణమైనది. ఇక శబ్దగుణముల నిరూపించుట కుపక్రమించుచున్నాడు.

ఓజస్సు, ప్రసాదము, శ్లేషము, సమత, సమాధి, మాధుర్యము,
సౌకుమార్యము, ఉదారత, అర్థవ్యక్తి, కాంతియు
బంధగుణములు. ౪ సూ.

బంధమనగా పదములరచించుట (కూర్పు) దానిగుణములు. ఓజస్సు ప్రసాదము మొదలైనవి. వానిని వరుసగాజూపుచున్నాడు.

పదరచన * నిబిడముగానుండుట యోజస్సు. ౫ సూ.

పదరచన - పదములకూర్పు, నిబిడముగా - వీడిపోవకుండ, మిక్కిలి కలియకతో నుండెనేని యోజస్సు.

ఉదా :- దుర్వారోద్యమ బాహువిక్రమరసాస్తోక ప్రతాపస్ఫుర
త్గర్వాంధ ప్రతివీరనిర్మథనవిద్యా పారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతులేవురిప్డు నినుదోర్లీలన్ వెసన్గట్టి గం
ధర్వుల్ **మానము**ప్రాణమున్గొనుట తథ్యంబెమ్మెయిన్గాచకా॥

"విలసద్గాండివ చాలనోద్ధతి కనద్విద్యుల్లతాలీలగా" అనునది యుదాహరణముగాదు.

శిథిలముగానుండుట ప్రసాదము. ౬ సూ.

పదములకూర్పు వీడబారుచున్నట్లుండుట ప్రసాదము. "అయితే యిది పైజెప్పిన యోజస్సుయొక్క విపర్యయ స్వరూపము గావున దోషమగునా? విపర్యయాత్మలే దోషములనిగదా మీరిదివరకు నుడివినది. ఇకనిది గుణమగుటయెట్లు?" అను నాశంకకు సమాధానము నుడువుచున్నాడు.

---

* నిబిడముగా "సంయుక్తములగు నక్షరములుండుట, కచటాదివర్గములలో వలపలగిలకతో గూడిన మొదటి రెండక్షరములతోను, మూడవ నాల్గవ వానితోను, మొదటివానితోను, నాలవదానితోను కూడికయు, విసర్గలు (ః) జిహ్వామూలీయము (ᳵ క) ఉపధ్మానీయము (ᳶ ప)లు, గుర్వక్షరములు చివరనుండుట సమాసములు, ఈమొదలగునవి పదములకూర్పు నిబిడమగుటకు తరతమభావమున కారణములగును." అని తిప్పేంద్ర భూపాలునివ్యాఖ్య.

కలయికవలన గుణము. ౭ సూ.

ఓజోగుణముతోడ గలసియుండుటవలన నీప్రసాదము గుణమగును. కేవల ప్రసాదము మాత్రము దోషమే. ఓజః ప్రసాదములు పరస్పర విరుద్ధములుగదా; వీనికి కలయిక యెట్లనిన సమాధానము జెప్పుచున్నాడు.

అదియో, యనుభవసిద్ధము. ౮ సూ.

ఈసహభావమనుభవజ్ఞుల హృదయసాక్షికమే. రత్నాదుల విశేషములండట్టి యనుభవము గోచరముగదా. ఇటపద్యము

"కరుణరసప్రేక్షణీయాల కలనను సుఖ
దుఃఖముల సహభావము దూరులేని
యట్లుగా ననుభవమ్మున కందునుగద;
యట్లె యోజఃప్రసాదసహస్థితియును"

సామ్యోత్కర్షములును. ౯ సూ.

ఓజః ప్రసాదముల సామ్యము నుత్కర్షమునుగూడ ననుభవసిద్ధములే.

ఓజః ప్రసాద సామ్యమునకుదాహరణము :—

"కామోత్కంఠతగోపికల్ భయమునన్ గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాల ముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్
బ్రేమన్ మీరలు భక్తినేముని దెచక్రిన్ గంటిమెల్లైన ను
ద్దామధ్యాన గరిష్ఠుడైన హరిజెందన్ వచ్చు ధాత్రీశ్వరా."

ఒక్కెడ నోజస్సు ప్రసాదమునకన్న నెక్కుడుగ నుండును.

ఉదా :—"ధారుణిరాజ్యసంపద మదంబున గోమలిగృష్ణజూచి రం
భోరునిజోరు దేశముననుండగ బంచినయిద్ధురాత్ము దు
ర్వారమదీయ బాహుపరివర్తిత చండగదాభిఘాతభ
గ్నోరుతరోరుజేసెద సుయోధను నుగ్రరణాంతరంబునన్."

మరొక్కెడ నోజస్సుకన్న ప్రసాదమెక్కుడుగా నుండును.

ఉదా :- కురువృద్ధుల్ గురువృద్ధ బాంధవులనేకుల్ సూచుచుండఁగా మదో
ద్ధురుడై ద్రౌపదినిట్లుచేసిన ఖలుఁగా దుశ్శాసనుఁగా లోకభీ
కరలీలఁగా వధియించి తద్విపులవక్షశ్శైలరక్తౌఘని
ర్ఝరముర్వీపతి సూచుచుండఁగనని నాస్వాదింతునుగ్రాకృతిఁగా.

భారతము-సభాపర్వము.

మసృణత శ్లేషము. ౧౦ సూ.

అనేకపదములొకే పదముగా భాసించుటకు మూలమగు గుణము మసృణత. ఒకపదముతో నొకపదము చక్కఁగా నతుకుకొని పోవుటయని పర్యవసానము.

ఉదా :- ధారణనిల్పునా నిలువదాయను సందియమొందుదక్కఁగా
ధారచనావిశేషమున ధారకొకింతయులోటులేదు భూ
ధారిణి శ్రీవిదూషకవిదారిణి యస్మదుపాస్యయమ్మహో
దారచరిత్రి యీయెడల దారచియింపకపోదు సాయమున్.

బందరు శతావధానము-చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు.

ఇది యుదాహరణముకాదు:—"సత్పురాణాళిగావ్యముల్సరసరీతి".
ఇదియు నుదాహరణముగాదు:—

భీకర దానవుడొక్కఁడు
నాకొమరుండాడుకొనుచు నాశ్రిమముకడన్
భూకాంతాయుండంగని
గైకొనిపోయెఁగా వచింపగలదేయింకన్.

ఇందు మొదటిది సరసరీతిగాదు. విరసరీతియే. ఇదికవనరీతి కనుగుణముగాలేదు."కావ్యముల సత్పురాణాళి గవనరీతి"అనియుండినశ్లేషము స్ఫురించును. ఇక రెండవపదావినెట్లు సవరించిన బాగుండునోతెలియలేదు.

త్రోవవీడకుండుట *సమత. ౧౧ సూ.

మొదలనేత్రోవనారంభించెనో యాత్రోవనే విడువకుండ నిర్వహించుట సమతయననగును, ఇది యొకశ్లోకమునందును బ్రబంధమునందును గూడ నావశ్యకమే.

*సమత — అంత్యానుప్రాసవిషయమున బ్రథమోదాహరణమును, క్రియాగతి

ఉదా :— "శ్రీకంఠచాపఖండన
పాకారిప్రముఖవినుత భండనవిలసత్
కాకుత్స్థవంశమండన
రాకేందుయశోవిశాల రామనృపాలా"

---

సౌందర్య విషయమున ద్వితీయమును, విశేషణ నిరూపణ సౌభాగ్యవిషయమున మూడవ యుదాహరణము చేయబడినవి, దీర్ఘసమాసములు లేక విడివిడిగా మృదువుగా నుండుపదములతో నుపక్రమించి యట్లేనిర్వహించుటకు నాలవది యుదాహరింపబడినది. వామనుడు "అస్త్యుత్తరస్యాందిశి దేవతాత్మాహిమాలయో నామ నగాధిరాజః" అనునది యుదాహరణముగానిచ్చి వ్యతిరేకోదాహరణముగా "ప్రసీదచండిత్యజమన్యుమంజసాజనస్తవాయంప్రణతః కృతాంజలిః కిమర్థముత్కంపిత పీవరస్తనద్వయంత్వయాలుప్తవిలాస మాస్యతే" యనునది వ్రాసెను. ఇందులో ద్వితీయార్థమువరకును వ్యస్తములగు పదములతోడి నడక, తృతీయచరణమున ప్రౌఢిగాను, చతుర్థచరణమున కొంచెము గాను పాడుచేయబడినది. ఉపక్రాంతమగు విడివిడిపదములనడక నిర్వహింపబడలేదు. విషయమిట్లుండగా తిప్పేంద్రభూపాలుడు వ్రాసెనుగదా, "ప్రసీద, త్యజ" అని కర్తృవాచకముల నుపక్రమించి "ఆస్యతే" అని భావవాచకముతో నుపసంహారము సరిగానుండలేదు. కర్తృవాచకమార్గమునకు త్యాగము వచ్చినందువల్ల సమతలేదు అని. కానియిదియుక్తముగాలేదు. ఏమన, మొదలు ధాతువులచేత కర్తలు చెప్పబడుచున్నారు. చివరనట్టులేదు. అంతేయిది అర్థప్రసక్తిలో మాట్లాడవలసిన విషయముగాని శబ్దవిషయములోగాదు. అర్థగుణములలోని సమతోదాహరణములో నర్థవైషమ్యముకలిగినదని పాఠము మార్చవలయునని వామనాచార్యుడనెను. నిజమునకు, అర్థవిషయములోవచ్చిన వైషమ్యముకూడ శబ్దగుణవిపర్యయముక్రిందనే కట్టుట యతని యభిప్రాయమైనచో నర్థగుణములలోని సమతావ్యతిరేకోదాహరణముగా "చ్యుతసుమనసః కుందాః" యనుశ్లోకమును నతడివ్వకుండెడివాడు, కాబట్టి యతడు నిరూపించిన యుదాహరణముల స్వరూపమునుబట్టి చూచిన 'కర్తను బోధించుటఅను నుపక్రమించిన త్రోవవిడచినట్లున్నది. కనుక "ప్రసీదచండి" యనుశ్లోకములో సమత లేదుఅనుమాట సరిగాతోచదు. అంతేగాక వైదర్భీరీతికి నుదాహరణముగానిచ్చిన "గాహంతాంమహిషానిపానసలిలం శృంగైర్ముహుస్తాడితం। ఛాయాబద్ధకదంబకం మృగకులం రోమంథమభ్యస్యతు। విస్రబ్ధం క్రియతాం వరాహతతిభిర్ముస్తాక్షతిః పల్వలే। విశ్రాంతింలభతామిదం చశిథిలజ్యాబంధమస్మద్ధనుః" అను శ్లోకములో వీరియభిప్రాయప్రకారము మొదట కర్తరిప్రయోగములు ప్రారంభించి మూడవపాదములో గర్మణిప్రయోగము చేయుటవలన సమతాభంగమయినదిగదా, అదివైదర్భీరీతికెట్లుదాహరణమగును? అన్ని గుణములుండినగదా వైదర్భీరీతియగుట. అంతియకాక "అస్పృష్టాదోషమాత్రాభిః" యని కూడననెనుగదా, "లేశమైనను దోషములేక" యని కదా వైదర్భీవిషయములో ఒట్టువల. అందువలననే

ఉదా :- మీరింద్ర ప్రస్థముగని, నారా? పాండవులజూచి, నారా? సుఖులై
వారందరు నొకచోనున్నారా? వీరాగ్రగణ్యా. నరునెఱుగుదురా?

---

మేమచ్చట మూడవపాదము పాఠము మారవలయుననియు, "విస్రబ్ధంకురుతాంవరాహ వితతిర్ముస్తాక్షతిం పల్వలే" యని ప్రాచీనపాఠమని సాంప్రదాయవేత్తలనుచున్నట్లును వ్రాసితిమనెదరా! అదియింకను నయుక్తము ఏమనిన; ఈ పాఠ మసలు కాళిదాసు వ్రాసియుండుననుటకు వీలులేదు. ఈ పాఠములో "వితతిః" అనుచోట నిరర్థకముగా నుపసర్గను నాటకములో మహాకవి ప్రయోగింపడు. ఇక్కడ నాయుపసర్గకు నేస్వల్పమైనను ప్రయోజనము చూపింపబడునా? ప్రతిచోట నుపసర్గకు తప్పకుండ ప్రయోజనముండవలయునని నియమమున్నదాయన్నచో నొకమాట చెప్పెదము. ఇతరుల కవిత్వములలో నెట్లున్నను కాళిదాసు కవిత్వములో నందులోను, అతని నాటకపు కవిత్వములోను, అందులోగూడ నీశాకుంతల నాటకపు కవిత్వములోను నిరర్థకముగా నొక్క యుపసర్గకూడ నుండదనియు, నట్లామహాకవి వ్రాయడనియు గట్టిగా జెప్పగలము. అతని నాటకములోనుపసర్గలకు, చివరకు నిపాతలకుగూడ తప్పక సార్థక్యముగలదు. ఈ విషయముసహృదయ చక్రవర్తియు, రసికవిమర్శకసార్వభౌముడు నయిన యానందవర్ధనాచార్యుడే ధ్వన్యాలోకమున విశదపరచినాడు. అదియునుగాక "ముస్తాక్షతింపల్వలే" అనుచోట బంధశైథిల్య మగపడుటలేదా? ఆకూర్పులోనుండు సౌందర్యమేది? అక్కడ (ముస్తాక్షతిఃపల్వలే అనుచోట) ను పద్మాసీయమువలన నేర్పడిన గాంభీర్యము మసృణత్వము బాగుగ గనపడును. ఇక నీకూర్పులో గాంభీర్యము లేకపోవుటయేగాక పదములు రెండునుగూడ నక్కడ యతుకక మసృణత్వమనిన శ్లేషకూడ భ్రష్టమయినది. మరియు "వరాహతతిభిర్ముస్తాక్షతిః" అను కూర్పులో నుండు ఓజస్సు రెండవకూర్పులో తగ్గిపోయినది. ఏమన; అక్కడ "భిః" అను నాదవర్ణము కలియుటవలన ప్రతినాదసౌందర్య మెక్కువయున్నది. రెండవ పాఠములోన దేమియులేకపోగా శ్వాసవర్ణము కూర్చుటవలన దేలికగ కనబడుచున్నది. కాబట్టి ఇంత యడ్డదిడ్డముగా నర్థములోను, శబ్దములోను గూడ గుణసౌందర్యములేని పాఠము కాళిదాసు వ్రాసినాడని నమ్ముటకు వీలుగా నున్నదా? గుణసౌందర్యమున్న వెనుకటిపాఠము వామనుడుదహరించినది కాళిదాసు వ్రాయలేదనుటకు నేమైన వీలున్నదా?. సమతాభంగముండుటయే కాళిదాసీ పాఠము వ్రాయలేదనుటకు గారణమనిన నసలక్కడ సమతకు భంగమే లేదనెదము. ఏలయన; అసలు సమతయనిన నేమో మొదటాలోచించెదము. అది తెలిసినచో సమతాభంగము తెలియును. "మార్గాభేదస్సమతా" అని వామనుడు సూత్రించినాడు. అనగా త్రోవభేదించకుండ నుండుట సమతయని యభిప్రాయము. అయినచో నీత్రోవ యర్థములత్రోవయా? లేక శబ్దములత్రోవయా? ఇదిఅర్థములత్రోవయే యైనచో నది

మ. ఏము,

కతఁడే రాముఁడు బావ జన్మగవసింగారంబుఁ బోనాడి యీ
కడుపున్నేనుసువేఁబ్రమోదనిలువన్ గన్నయ్యకాపట్య మెం
చవె విన్నయ్యలు విశ్వసింపుమరె! యేసంబంధముం లేని యీ
సడి నావంటి లతాంగికిన్ విధిఘటించన్ జెల్లునే యక్కటా!"

ఉత్తర రామాయణము.

పోనుద్యోగము చేసిన ।
ప్రాణం బాయిం కనీకుబాధే యంటీ ।
మానిని మందస్మిత మధు ।
రానన చంద్రి కలుగ్రోల నరుగుము పిదపన్ ॥

విజయ సేనము.

---

ఖేదించకుండ నుండుటర్థగుణమైన సమతయగును. గాని శబ్దగుణమైన సమత యెట్లగును? కావునఁ జేకదా! వామనుఁడు "అవైషమ్యేనఘటనం సమతా" యని యర్థగుణములలో వ్రాసినదియు నట్టుండుటికిదానికి వ్యతిరేకోదాహరణ ముఖమున స్పష్టపరచినదియు సమకూరును. ఇక శబ్దములతోఁ బ్రయోగమైనచో నదియేమాత్రముకూడ పైపాదములలో తప్పనే లేదుగదా! ఇకసమతాభంగమేది? కర్తృవాచకములైన క్రియా పదములను ప్రారంభించి మధ్యలో కర్మవాచకములైన క్రియాపదములను వాడుటవలన సమతాభంగము రాలేదా? యనిన "మ్యాతసుమనసః" అను పద్యములో నాలస్యముగా క్రియ జరుగునని చెప్పెడి పదములు మొదట ప్రారంభించి తరువాత రెండవ పాదములో నపుడే పని జరుగుచున్నదని చెప్పెడి పదములు వాడుటవలన నీశబ్దగుణమైన సమతకు భంగము రాలేదా? దానిని అర్థగుణమైన సమత భంగమునకు దాహరించుట యెట్లు సరిపడును. అదియును గాక నిక నెక్కడ సమతాభంగమయినను మీరు చెప్పెడి రీతిగా దానిని పదములలోనికిమార్చి శబ్దగుణ సమతాభంగము క్రిందికి నీడ్చుకొని రావచ్చును. ఇక నర్థగుణమైన సమతకు భంగమెక్కడనైన జూపించగలరా? ఆలస్యముగా పని జరుగుచున్నదని మొదట ప్రారంభించి, మధ్యనప్పుడే పని జరుగుచున్నదని చెప్పుటవలన నర్థమార్గమునకు వైషమ్యము వచ్చినది. కాబట్టి యర్థగుణ సమతాభంగమేయనిన నిక్కడకూడ క్రియాపదములచేత మొదట కర్తలను జెప్పి తరువాత కర్మను చెప్పినాడు. గనుక అర్థగుణసమతాభంగమే యనవలసివచ్చును. అట్లే కానిండనినచో నప్రుడును జిక్కే, అదిమాత్రము దోషముకాదా? అట్లు సమతాభంగదోషమున్న పద్యమును వామనుడు వైదర్భీరీతి కెట్లుదాహరణముగానిచ్చును. అక్కడ దోషము లేమాత్రమునుండకూడదనికదా వారిపట్టుదల. ఇట్టిశ్లోకమునుదాహ

ఈ గుణమునకు విపర్యయమెట్లనగా;

"విలసత్కాకుత్స్థ వంశభూషణ........రామమహీపా"

"మీరింద్రప్రస్థము గనినారా? పాండవుల జూచినారా?
సుఖులై వారందరుండిరే యేమన్నారో వీరాగ్రగణ్యునరు
........నరుజూచితిరే?"

---

రణముగ నిచ్చుటచే మీరనుకొను సమత వామనుని యభిప్రాయములోనిది కాదని స్పష్టపడుటలేదా? పైగా విరుద్ధముగానున్నదని కూడ గ్రహింపవలసిచ్చును. మనము వామనాచార్యుని గ్రంథమునకు వ్యాఖ్యానము వ్రాయుచున్నామనియు, నతని యభిప్రాయమున కనుగుణముగ వ్యాఖ్యానించుట ధర్మముకాని మరియొకటి యుక్తము కాదనియు తెలిసికొనవలసియుండును. అదిగాక తిప్పేంద్ర భూపాలుడు జెప్పినది సమతయై వామనుడిచ్చిన పాఠములో సమతాభంగముండుటయే నిజమైనచో మహాకవుల కావ్యములన్నియు నీదోషమునకు గుఱియైపోవును. కాబట్టి యితడు వ్రాసినది సమతకాదు. అదిలేకుండుట సమతాభంగదోషమునుగాదు. ఆతీరుగానే వామనుడిచ్చిన పాఠములో సమతాభంగము లేనేలేదు. ఇతడిచ్చిన పాఠములో సమతాభంగము (ఇతడు వ్రాసిన ప్రకారముగా) తప్పనుకూడ తప్పదు. ఏమియన; మొదట "మహీపాః" అని సమూహమును జెప్పెడి పాఠములేకుండ ప్రారంభించి "వరాహవితతిః" అను సమూహ వాచక పదముతో కలిపి చెప్పుటచేతనికి ప్రక్రమభంగము కాదా? ఇతడిచ్చిన పాఠమును కాళిదాసు వ్రాయుట యెన్నటికిని సంభవింపనే సంభవింపదు. అదియునుగాక వామనుడిచ్చినపాఠము అప్రాచీనమగుటకుసబబున్నదా? ఇతడు వ్రాసిన పాఠమేప్రాచీనుల యాలంకారిక గ్రంథములలో నైన జూపగలరా? లేరు. అప్పుడు వామనుడు వ్రాసిన పాఠమే ప్రాచీనమని స్పష్ట సిద్ధాంతము. ఇచట జెప్పిన సమత. తద్భంగము, వామనాచార్యున కభిమతములేయైన నాదోషము వామనాచార్యుడిచ్చిన పాఠములో నుండుటయే నిజమైన నావామనాచార్యుడెన్నటికి గూడ నా శ్లోకమును వైదర్భికి నుదాహరణముగా నిచ్చుట కుదురదని మనము దృఢముగా నమ్మవచ్చును. అదియునుగాక, ఇటువంటిది (ఈవ్యాఖ్యాత చూపినటువంటిది) యొక దోషముగా లెక్కపెట్టుటకే వీలులేదు. ఏమనిన; ఇట్లాలోచించిన నెందఱి మహాకవుల గావ్యములు నిలుచును. ఇట్లెందఱి మహాకవుల కవిత్వమును దనకుపజీవ్యమైనది దోషదుష్టమే యగునట్లుండిన నిట్లు నిరూపించెడి వామనసూత్రమును సిద్ధాంతముగా నంగీకరించుట సంభవించునా? ఉపజీవ్యవిరోధమురాదా? న్యాయములక్ష్యానుసారియని గదా వామనాచార్యుడయిదవ యధికరణ మొకటవ యధ్యాయము చివర వ్రాసినాడు. అదిగాక ప్రాచీనప్రయోగములను సమర్థించవలయునుఅనిగదా? "తదిదంప్రయుక్తేషు" అని వ్రాసినాడితడు. అపట్లుండనిండు.

* ఆరోహావరోహముల క్రమము సమాధి. ౧౭,

ఆరోహము ప్రవర్తించినపు డిదివరకారంభించిన యవరోహమును విడుచుటయు నిట్లే యవరోహము ప్రవర్తించినపుడారోహమును విడుటయు పరిహారము. అనగా సమాధి (సమాధానము) అందు మొదట నారోహపూర్వకమగు నవరోహమున కుదాహరణము :—

తపస్స్వాధ్యాయాది క్షపితమలచిత్తప్రకలితా ।
విపజ్జాలజ్వాలా విరమణసుధావృష్టిలలితా ।
జపాపుష్పశ్రీరచ్ఛవికరణ సంసర్జనధురా ।
సపర్యానిర్వాహస్తవన కలనస్థైర్య మధురా ॥

భారతము-స్త్రీపర్వము.

ఇకనవరోహ పూర్వకమగు నారోహమున కుదాహరణము :-

"బలమత్తాకృతియైన భీముడను శుంభత్కుంభి సంరంభమున్ నిలిపెన్నాడునునేడు .........................."

ఉద్యోగపర్వము.

**ఆరోహక్రమమును నవరోహక్రమమును నారోహావరోహముల క్రమమగును. అనగా క్రమముగా నారోహమును గ్రమముగా నవరోహముమ నవియర్థము అదియును సమాధియేయనికొందఱి యభిప్రాయము.**

---

అసలు ప్రకృతమున సమతకు (అనగా శబ్దగుణమైన సమత) కుదాహరణముగా నిచ్చిన "అస్త్యుత్తరస్యాందిశి దేవతాత్మాహిమాలయోనామ నగాధిరాజః" అను చోట నావ్యాఖ్యాత చెప్పిన సమతయున్నదా? అర్థసంబంధియగు సమతకుదురుటకు రెండవ వాక్యముండినగదా! అప్పుడేగదా యొకచోటనుపక్రమము నొకచోట నుపసంహారమును వచ్చుట సంభవించును. కాబట్టి వారు చెప్పిన దంతయు మూలానురోధికాదనియు నపసిద్ధాంతమనియు దెలిసుకొనవలయును. మేము నిరూపించినట్లుగా నాయుదాహరణములో వ్యస్తసమాసోపక్రమమంతగా నిర్వహింప బడ్డది. కాబట్టి సమతకుదురును. వ్యతిరేకోదాహరణములో తృతీయ చరణము దగ్గఱ నుండియు నదిపోయినది గనుక సమతభంగమేర్పడి వ్యతిరేకోదాహరణ మగుట సరిపడును. ఈచోట గుణమర్థనిరపేక్ష మగుటను నర్థగుణములలో వ్యతిరేకోదాహరణ మర్థసాపేక్షము గనుకను భేదము కుదురును.

*దీర్ఘాదిగుర్వక్షరము లెక్కువగానుండిన నారోహము. లఘువులు మొదలగు శిథిలము లెక్కువగా నుండిన నవరోహము.

ఉదాహరణము :—

"కరుణించియిండు నాకుం ।
బురోహితునిగాగ మీసుపుత్రు బవిత్రున్ ।
పరమ తపోనైష్ఠికుభా ।
సురయమనియ మాభిరాము సోమశ్రవసున్ ।

ఆరోహావరోహములోజః ప్రసాదరూపములే కావున
సమాధి వేఱుగుణముకాదు. ౧౩

ఆరోహమోజోరూపము, అవరోహము ప్రసాదరూపము కావున నిక సమాధి వేఱుగుణమగు టెట్లు ?

**అదిసరికాదు. అదికూడియుండజాలదు (అసంపృక్తము)కదా ! ౧౪ సూ.**

ఓజః ప్రసాదములు సమాధియనుట సరికాదు. ఓజః ప్రసాదములు సంపృక్తములగునపుడు నదీ వేణికలవలె బ్రవర్తించును ప్రకృతమగు సమాధియో, కలసియుండజాలదు. కావున నోజః ప్రసాదములు సమాధియనుట యుక్తముకాదు.

* నియతికూడ లేదుకదా ! ౧౫

ఓజస్సునందారోహమును, ప్రసాదమునందవరోహమును నను నియమముకూడ లేదు.

ఓజఃప్రసాదముల తీవ్రావస్థ యారెండుననినచో
నంగీకారమే. ౧౬

ఒక్కొక్కచోట నోజః ప్రసాదములుత్కటస్థితిలో నుండును. ఆయుత్కటస్థితియే యారోహావరోహములనినచో నభ్యంతరము లేదు. ఏలయన :—

అవి విశేషమునపేక్షించునుగదా ? ౧౭

* నియతి—ఓజఃప్రసాదము లారోహావరోహములతో గూడియేయుండుననునియమముకూడ లేదు.

ఓజః ప్రసాదముల మిశ్రమగు నవస్థయే విశేషము. దాని నపేక్షించినప్పుడేకదా యారోహావరోహము లేర్పడగల్గును. కావున నీవిశేషము వేఱుగుణమేకాని వెనుకటివానిలో నంతర్భవింపదు.

ఆరోహావరోహముల నిమిత్తము సమాధియనబడును. ౧౮ సూ.

" ఆరోహావరోహముల క్రమము సమాధి " యను పన్నెండవ సూత్రమును గౌణవృత్తితో వివరింపవలెను. అపుడారోహావరోహముల క్రమమునకు నిమిత్తము సమాధియని యర్థము పర్యవసితమగును. కారణమున గార్యోపచారము "అన్నముప్రాణమే; నెయ్యిబలము" అనునిత్యాది స్థలములందుండలేదా ?

క్రమమును విధించుటకైనను. ౧౯ సూ.

క్రమముగా నారోహము, క్రమముగానవరోహము, అనుక్రమమును విధించుటకైనను సమాధివేఱుగుణముగా నంగీకరింపవలయును.

"క్రమారోహమును, క్రమావరోహమును జదువుటలోనే స్ఫురించు విశేషములు మాత్రమేకాని వాస్తవముగా పదబంధమునందుండునవికావు" అని కొందఱాశంకింతురు "పాఠధర్మములుకావు. అంతటను గన్పట్టవుకదా!" అనుముందు సూత్రమున దానిని నిరాకరింతుము.

పదములు విడిగానుండుట మాధుర్యము. ౨౦ సూ.

రచనయందు పదములు విడివిడిగా గూర్పబడుటయే మాధుర్యము. అతిదీర్ఘ సమాసములు లేకుండుటయే దీనిభావము. అంతేకాని సమాసగంధమేమియు నుండరాదని కాదు.

ఉదాహరణము :—

రసికతనోలిసోలి యనురాగరసంబున దేలితేలి యా ।
కసములు మెట్టిమెట్టి తమకంబున గాంతలబట్టిపట్టి యా ।

దొసకులజిక్కి జిక్కి కడుదూరముగాజని తక్కితక్కి పై।
కొసరె సగంజకోరికలు కోరికలీరికలెత్త మత్తిలున్॥

పారిబంధిరత్నాకర ౧౩౫ పుట,

లేక,

"పాటునకింతులోర్తురె? కృపారహితాత్మక నీవ్రోయ ని।
చ్చోట భవన్నఖాంకురముసోకె గనుంగొనుమంచుజూపి య।
ప్పాటలగంధివేదన నెపంబిడిమేడ్చె గలస్వనంబుతో।
మీటినవిచ్చుగుబ్బచనుమిట్టల నశ్రులు చిందువొందగన్"॥

మనుచరిత్రము.

విపర్యయమున కుదాహరణము:—

"ప్రణతాశేషవసుంధరాధిప శిరస్స్రగ్గంధలుబ్ధ భ్రమ।
త్క్వాణ దభ్రిభ్రిమకృద్ద్విరేఫగణ ఝంకారప్రిదాబద్ధ సం।
క్షణవత్యుత్ప్రధిత ప్రివర్ధితసమస్త క్షత్రసూయాధ్వర।
క్షణ సింహాసనభాసితున్ దృఢధనుశ్శ్లాఘానుజున్ ధర్మజున్॥

భారతము - అథర్వణాచార్యుడు.

అపారుష్యము సౌకుమార్యము. ౨౧ సూ.

పదబంధము చెవికి కటువుగా దోపకుండుట సౌకుమార్య మనబడును.

ఉదాహరణము:—

అమృతమువంటితల్లి కమలాసను పుట్టువుదేవి వేదశా।
స్త్రముల విహారభూమికల ప్రాణులకెల్లను బల్కుతోడు వి।
శ్వమున సమస్తవిద్యల విశారదశారదనాదువక్త్ర ప।
ద్మమున వసించి మత్కృతి జమత్కృతి పట్టుగజేయుగావుతన్॥

విష్ణుకథానిధానము - జైతరాజుముమ్మయ.

మఱియు,

"నవ్వులమాటలో నిజమొ నాకములోన ననేక కన్యకల్,
మవ్వపుదీగెలందెగడు మానిసులుండగ సంతనెన్నడో।

జన్నెగ నుస్సుకొన్న గడసాని ననుంగవయందలంచితే।
షప్పుగు వేడుకైన గడపోయిన వెన్నుడువంగవచ్చునే''॥

ఉత్తరహరివంశము_౧ ఆ.

విపర్యయమున కుదాహరణము:—

"భసితాలిప్తవపుత్త్రిపుండ్రవిటలప్రత్యగ్రరుద్రాక్ష దా।
మసముజ్జృంభితవేషులై వరధనుర్మాహేశ్వరాద్యస్త్ర శ।
స్త్రసమృద్ధిన్ రథముల్వెలుంగ మనుభూతద్వంద్వమేతేర రా।
జ సహస్రంబులతోడ హంసడిభకుల్ సంగ్రామసన్నద్ధులై''

ఉత్తరహరివంశము_౪ ఆ.

వికటత్వముదారత. ౨౨ సూ.

పదములబంధము వికటముగానుండుటయుదారత. వికటత్వ మున్నచో పలుకులు నృత్యమొనరించుచున్నట్లు తోచును. ఒయ్యారము లొలుకుటయనిభావము.

ఉదాహరణము:—

*అటజనికాంచె భూమిసురుడంబరచుంబి శిరస్సరిజ్ఝరీ।
పటలముహుర్ముహుర్లు ఠదభంగతరంగమృదంగ నిస్వన।

---

* అటజనికాంచె..."అంబరచుంబి" యనుచోట ముద్దుగొను తీరున కనుగుణముగా బిందుపూర్వక బకారపు పదముల కూర్పును. "అభంగతరంగమృదంగ"అనుచోట మృదంగధ్వనిని స్ఫురింపజేయు బిందుపూర్వక గకారపు పదముల సమావేశమును, నెమలిపురి విప్పుటయు నందులోని విస్తారమును స్ఫురించునట్లు "పరిఫుల్లకలాపకలాపి జాలమున్" అని లకారద్విత్వముతోడి పదమును, దీర్ఘాక్షరములైన పదములును, "స్ఫుటనటనానురూప" అనుచోట నిజముగా నటనానురూప్యము స్ఫుటమగునట్లు టవర్గసహితములగు పదముల యవ్యవహితసమావేశమును, వికటత్వమని గ్రహించునది. వికటత్వమనగా పదములాడునట్లు తోచుటకు మాత్రమే కారణమనుకొనరాదు. వాచ్యమగులీలను స్ఫురించునట్లు అవిగూఢ నొయ్యారము కల్గియుండుటయని భావము.శబ్దము వినబడినవెంటనే వాచ్యములలీల లర్థనిరపేక్షముగా స్ఫురించుటయని పర్యవసానము. ఇట్లుగాక "నృత్యలీలాస్ఫోరకత్వము మాత్రమే వికటత్వము" అనుచో "లీలాయమానత్వమిత్యర్థః" అని వామనుడు వికటత్వమునకు సామాన్యరూపమున నిష్కర్ష చేయుటకుదురదు. అదియును గాక నట్టివికటత్వము వామనుడు వైదర్భిరీతి కుదాహరించిన "గాహంతాం" అనుశ్లోకమున లేనేలేదు. కాగా మొదలు "పదములాడుచున్నట్లు

స్ఫుట నటనానురూప పరిఫుల్లకలాపకలాపి జాలముల్ ।
కటకచరత్కరేణు కరకంపితసాలము శీతశైలముల్ ॥

మనుచరిత్రము.

విపర్యయమున కుదాహరణము :—

"అటజనికాంచె భూమిసురుడాకసమంటు శిరస్సరిజ్ఝరీ ।
పటలముహుర్ముహుర్లుఠ దవారితవీచిమృదంగనిస్స్వన ।
స్ఫుటరమణానురూప పరిమూర్ఛిత బర్హిమయూరజాలముల్ ।
............................................................" ॥

అనినచో బైసొగసులు స్ఫురింపవుకావున నటవికటత్వము లేదని నిర్ణయింపదగును.

అర్థవ్యక్తికి హేతువగుట అర్థవ్యక్తి. ౨౩ సూ.

ఏకూర్పు విన్నవెంటనే యర్థము స్పష్టముగా దెలియవచ్చునో దాన నర్థవ్యక్తి గుణమున్నదని తెలియవలయును. ఆగుణము లేదేని యటనర్థమంత శీఘ్రముగా స్ఫురింపదు.

ఉదాహరణము :—

ఏరికి బుద్ధిబలమ్ములు ।
గారణములుగావు సూవెకలరె ధరిత్రిన్ ।
నేరిచి బ్రతికినవారలు ।
నేరక చెడ్డట్టివారు నీరజనేత్రా ॥

---

స్ఫురింపజేయుగుణము". అని చెప్పి ఆపిదప "లీలాయమానత్వము" అనగా నొయ్యారము గుబ్బుచుండుటయని యన్నితీరులకు సరిపడునట్లుగా జెప్పియుండుటవలననైన "అంబరచుంబి" త్యాదులు వికటత్వమున కుదాహరణములుగా నిరూపింపబడుట యుక్తమే యగును. "నృత్యలీలాయమానత్వమే వికటత్వము" అనే "ఇనుపకచ్చడాల" వారుంటే వారు చివరజూపించిన "స్ఫుటనటనానురూప" అనేదానితో "అస్ఖలిత బ్రహ్మచర్యమును" కాపాడుకొనవలసినదని మా ప్రార్థన.

శ్లిష్టపి వాలమెప్పుడగాను సులభముగాను దొరకును.

ఉజ్జ్వలత్వము కాంతి. ౨౪ సూ.

బంధముజ్జ్వలముగా స్ఫురించుట కాంతియుండిననే సంభవించును. అది లేవేని పురాణములవాయ తోచును.

ఉదాహరణము :—

* నరకాసుర ప్రాణనాశోత్తరణకేళి ।
రణకేళివలకేళి రమణజూపె ।

---

*నరకాసుర ప్రాణ... ఇచట ననుప్రాసాది కృతమగు నుజ్జ్వలత్వమీ పదబంధమున స్పష్టమగుచు నేయున్నది. రెండవపాదాన నిట్టి దేమియు లేక దీపయింటిదీపమువలె వెలవెలపోవుచుండుటయు ప్రముఖవేద్యమే.

ఇచట తిప్పేంద్రభూపాలుడు కాంతిహేతువులని కొన్నిటిని జూపియున్నాడు. 'పత్రము' అనవలసినచోట 'కిసలయము' అనుట, 'జలధియందు' అనుచోట 'అధిజలధి' యనుట 'రాజ్ఞి' యనుటకు బదులు 'రాజని' యనుట 'కమలమువలె' అన దలచినయెడ 'కమలాచరణము' అనుటయు నింకను నిటువంటివేయగు కొన్నింటిని కాంతిహేతువులుగా నిరూపించెను. కాని యిది సరిగాతోచలేదు. ఏమనగా; ఇందులో గొన్ని కాంతిహేతువులుకావు. కొన్ని ప్రకృతమగు (శబ్దగుణమగు) కాంతి హేతువులుకావు 'పత్రము' అనుచోట 'కిసలయము' అనుటవలన గాంతి గలుగునని కదా వ్యాఖ్యాతయాశము. అయితే 'నళినీపత్రశయనం' అనుచోట 'నళినీ కిసలయశయనం' అంటే అసలు కాంతిమాట యట్లుండనిచ్చి యసలర్థస్ఫూర్తియైనను యున్నదా? ఇట్లే 'వటపత్రశయనుడు' అనవలసినదానికి 'వట కిసలయశయనుడు' అనుటగూడ నెఱుగవలసినదని, మఱియు 'రాజ్ఞి' యనుచోట 'రాజని' యన్నంత మాత్రమున గాంతి యెట్లేర్పడునో మాకెఱుకరాలేదు. ఇట్లే 'నామ్ని' యనవలసిన చోట 'నామని' యనినను, వేమ్ని అనుటకు బదులు 'వేమని' యనినను గాంతి వచ్చునా? అట్లు కాంతియేర్పడుటకు గారణమేమైన నున్నదా? అదికాదు 'రాజని భోజనితాంతం యాజని సకలంకతాజనిగృహీతీ' అనుచోట 'రాజ్ఞి' అనుటకన్న 'రాజని' అనుటవలన నందము స్ఫురింపలేదా? అనియొక ప్రశ్నకిదిసమాధానము. అందము స్ఫురించుచున్న మాట నిజమేకాని యది యెందువల్ల? అని మాప్రశ్న.

గంసదానవశిరః కమలకర్తనమేలు
తనమేలుచేయి పెద్దలకు నొసగె
జాణూరముష్టి కిక్షతకీలాలంబు
నాలంబులోనెల్ల నలవు వఱపె

---

'రాజని, భోజని యాజని, తాజని,' అనే చోటులందొకటేమోస్తరు అక్షరములు చెవికి వినబడుటవలన గలిగెడు సౌందర్యమునకే పదములుండుట నిమిత్తముకదా? అవి యేవి శేషమందురా? 'రాజ్ఞియాజ్ఞికవిజ్ఞాతే సంప్రజ్ఞాయాజ్ఞికాజ్ఞయా' అనుచోట మాత్రము సమానాక్షర శ్రుతిలేదా? సౌందర్యములేదా? ఇపుడు 'రాజ్ఞి' యను దానికి మాత్రము కాంతిహేతుత్వము లేదనుట కవకాశమేది? అదియును గాక నీ విధముగా సౌందర్యము నంతయు ననుగమ మొనరించి యింతటను సరిపడునట్లు చెప్ప వలయును గాని యేపదమున కాపదమే చెప్పిన చెప్పవలసినయట్లు చెప్పుటయగునా? అది యెచ్చట నున్నదని యందురా? 'అధిజలధి' అను పదము వెంటనే చెప్పినారు కదా! అచట నిట్టిదేకదా కాంతిహేతుత్వము. అది పదప్రౌఢిమయ నెదరా? ఇకనది బంధగుణమగు టెట్లు? ఇట్లే 'కమలమువలె' అనుటకు 'కమలాచరణాం' అనుననదికూడ నర్థప్రౌఢిమ (అర్థగుణమగు నోజస్సు) యగునేకాని పదప్రౌఢిమ మెట్లగును? 'రావయ్యా' యనుటకు 'దయచేయండి' అని ఇక్కడ గూర్చోండి' అనుటకు 'దీన్ని అలంకరించండి, యనియనుట యర్థప్రౌఢిమలగునేకాని శబ్దప్రౌఢిమలగునా? కావను విషయము 'అప్పయదీక్షితులు' వ్రాసిన కువలయానందమున బర్యాయోక్త ప్రకరణ మున నెఱుగనగును. ఒక విశేషము. ఒక వాక్యార్థమట్లు ప్రౌఢముగా నున్నచో నలంకారమగును. పదార్థమట్లుండినచో గుణమగును. ఏమైనను నిదియంతయు నర్థ గత విశేషముకాని శబ్దగత విశేషము కాదుగదా! ఇది శబ్దగుణమైన కాంతినెట్లు సంపాదింపగలును. మఱియు నీనాలుగు పదములను కాంతిహేతువులుగా మన మంగీకరించినను నాహేతుత్వ మొక్కొక్క పదమున మాత్రమేయుండునుగాని పదబంధ నిష్ఠమగుటయెట్లు? అనేక పదములకూర్పులో రావలసిన యుజ్జ్వలత్వ మేయొక్క పదమువలననో యెట్లురాగలదు? ఇటువంటివి చాల పదములు కూర్చినచో నాకూర్పు న కుజ్జ్వలత్వము వచ్చునన్దురా? ఈపదములన్నియు నొక కూర్పులో గూర్చినను నుజ్జ్వలత్వము రాబోదు. 'కమలాయతేఽధిజలధిస్ఫురితే రాజనికిసలయరుచియుక్తే' ఇచట శ్లేషమస్పృణత్వములు కనబడుచున్నను బంధములో చమత్కారము లేనందున కాంతిమాత్రము కనుబడుటలేదు. ఇంక వామనుడు చూపిన కాంత్యుదాహరణము లో వ్యాఖ్యాత చెప్పిన కాంతిహేతువులలో నొక్కపదమైన నున్నదా? "కురంగీ నేత్రాలీస్తబకితవనాలీపరిసరః" అనికదా వామనుని యుదాహరణము. ఇచట 'పత్రము' అనుదానికి 'కిసలయము' అనుమోస్తరు పదమేమైనను న్నదా? 'కురంగీ

ముకుళిత [illegible] కాంత మాలి ఫేనావళి
నావలి [illegible] కావుపజుడై
[illegible] సారసాకార విహరణంబు
విష్ణుపదమునాపు నతనితో విగ్రహింప
పోకకానినమ్ము మనకు మద్దులు ముడింగి

---

[illegible] వృత్తబంధము ననుసరించి సరిపడవుగదా! [illegible] 'నేత్రాలీ' యను [illegible] 'సృష్ట్యాలీ' యనునది సరిపడినను ఆపదబంధమందు విసంధి, [illegible] భంగము, మస్పృష్టత్వనాశము, శ్లేషవిచ్ఛేదము, యివియన్నియు [illegible] కాని యుజ్జ్వలత్వము మాత్రముపోదు. ఇక 'స్తబకిత' అనుదానికి 'కుసుమిత' అనిన[illegible] కాంతిభంగము లేకపోయినను నర్థభంగముండును. కావున వామనుని యుదాహరణములో మీరు చెప్పినట్టివేవియు లేవనియు నవి యాచార్యున కభిమతము కావనియు స్పష్టమగును.

ఇక నతని కభిమతమైన వేవో విచారింతము. వాటిని కనుగొనుటకు 'ఇంగితేన నిమిషితేన' యని మహాభాష్యకారుడన్నట్లు ఆతని యుదాహరణ పద్యములవలననే గ్రహింపవలయును. అచట 'నేత్రాలీ' అనుదానికి వెంటనే 'వనాలీ' యను పదము ను గూర్చుటవలన మనకీ చరణ మెక్కుడుజ్జ్వలముగా గన్పడుచున్నది. కురంగీనేత్రాలిస్తబకిత మహారామనిచయః' అనిన వెనుకటి సొగసు గన్పట్టుచున్నదా? కావుననిచటి సొగసునకు కారణ మక్షరసామ్య శ్రుతియేయని స్పష్టము. "గాహంతాం..." అను వైదర్భీరీత్యుదాహరణములో గాంతి యెచటనున్నదో యెటులున్నదో కొంచెము విచారించిన నాయాయక్షరసామ్య శ్రుతియందే యని తోచును. ఇంకొకసంగతి యప్రస్తుతమైనను చెప్పబడుచున్నది. తిప్పేంద్రుడు వ్రాసిన కాంతికారణము లొక్కటైన పైయుదాహరణమునవున్న వేమో విచారింపడు. లేనందునే యితడాశ్లోక వ్యాఖ్యలో "పదానాముజ్జ్వలత్వాత్ కాంతిః" అని వ్రాసెను. ఇతడు తానన్న రక ముల పదములను నిరూపించి కాంతినిరూపించలేదు. లఘునిరూపణమభిమతమందురా? కదమగుణములప్రస్తావమందువాటివాటిప్రత్యేకస్వరూపమును వివరించెనే. ఇంక "పదము లుజ్జ్వలములుగాన కాంతి" యని యీతడువ్రాసెను. ఈకాంతి "బంధమునకు కాంతి సూత్రమున వామనుడు వివరించుటచే పదముల యుజ్జ్వలత్వము కాంతి యనక బంధపుటుజ్జ్వలత్వమే కాంతియనదగును. ఓజః కాంతులుండవని పాంచాలీరీతి కుదాహరణముగా నిచ్చిన "గ్రామేస్మిన్ పథికాయపాంథ వసతిర్నైవాధునాదీయతే రాత్రావత్ర విహారమండపతలేపాంథః ప్రసుప్తోయువా। తేనోత్థాయఖలేనగర్జతి ఘనే స్మృత్వాప్రియాంతత్కృతం। యేనాద్యాపికరంకదండపతనాశంకీజనస్తిష్ఠతి॥" అను పద్యములో పదములయందక్షరసామ్యమున్నను "గాహంతాం..." అను దానియందు

పారవె పళ్లు తమకెంత బంటియనుట ॥ ఉత్తరహరివంశము. 5-౭

విపర్యయమున కుదాహరణము :—

ఆహా కావ్యము మేలు మేలనమి యన్యాయంబు పో శారదా
ద్రోహం బేటికి గట్టుకోననుచు సంతోషించునట్లుండు న
య్యూహోదుల్ విని సత్కవీంద్రుడితరుం డొచ్చెంబ పేక్షించు సం
దేహించుందన సొమ్ము పోయినగతిం దీనత్వముం బొందుచున్ ॥
ప్రసం. శృం. త్వాన్ని.

ఇట్టి కాంతి శూన్యమగు పదబంధము వెదుకనక్కర లేకుండగనే యెక్కువగా దొరకును. మచ్చునకొకపద్యము నుదాహరింతుము.

* జ్యాఘోషం బతిభీషణం బయి దిశాచక్రంబునిండన్ శర
వ్యాఘాతంబున శాత్రవుండు వికలస్వాంతుండుగా నారద

---

వలె తగిన శ్రుతిలో మేళగింపక లేదు. "రాత్రావత్ర" అనుచోట లలగానున్నను "రాత్రా" అను దీర్ఘమువలన నదియు చెడినది. వారు కాంతి హేతువులని చెప్పిన వానిలో నొకటి యీపద్యమున తృతీయ పాదములోనున్నది. "యుకకుడాత్మహత్య యొనరించుకొనెను." అనుటకు "స్మృత్వాప్రియాం తత్కృతం యేనాద్యాపికరం కదండపతనాశంకీజనస్తిష్ఠతి" అనెను "కమలమువలె" యనుటకు "కమలాచరణము" అనుట కాంతికారణమనిగదా వారియాశయము. ఇపుడట్టి కాంతి హేతువు పైపద్యమున నున్నది కావున నది పాంచాలీరీతి కుదాహరణము కాక పోవలసివచ్చును. ఇట్లీ నిరూపణమంతయు గమనించినచో వామనుని యభిప్రాయమిట్లు స్పష్టమగును. "పద్యము చదువునప్పుడు కూర్పులో జక్కని ముక్తాయింపు స్ఫురించునట్లుండుట కాంతియని. అది యొక పదములో నుండునదికాదు. మొత్తపు కూర్పులో నాసొగసేర్పడును. స్త్రీ శరీరమున నవయవ సంస్థానములో నొకదాని కొకటి యవయవములు సరిపడిన గాని కాంతి యెట్లేర్పడదో యట్లే ప్రకృత కావ్య ప్రసంగమున గూడ బదముల కూర్పులో నొక పదమునకు మఱియొక పదము సరిపడియుండిననే యుజ్జ్వలత్వమేర్పడును." అని వామనుని అభిప్రాయము. దీని ననుసరించియే కాంత్యుదాహరణము లన్నియు నీగ్రంథమున సరిపెట్టుకొనవలయుట మనధర్మము. ఈకాంతి యనుప్రాసచే గతార్థముకాదు. రెండక్షరములు దగ్గరగానుండి యావృత్తి యేర్పడిన ననుప్రాసము, సమానములగు నచ్చులు తగినచోట శ్రుతములైన నేర్పడునది కాంతియనియు నెఱుంగుటచే గతార్థత లేదని తెలియును.

* ఇందు ఓజస్సు ప్రసాదము కొంత కొంత శ్లేషకూడ యున్నది కాని కాంతి మాత్రము కన్పడుటలేదు.

క్షమాపాత్రముగా నిర్దోషభుజాసంరంభతఁ గ్రౌద్రరే
ఖాకారాక్రాంతమైన మోమెడ గడంకం జూడుడీయేర్పడన్ ॥

భారతము-ఉద్యోగపర్వము.

తెలియదగియుండుటవలన నివి లేనివికావు ౨౫ సూ.

ఈగుణములు సహృదయుల కందఱికిని తెలియవచ్చుట వలన నివి లేవనుటకు వీలులేదు. "తెలియవచ్చుగాక; అది భ్రాంతి కాగూడదా?" అను నాశంకకు సమాధానము జెప్పుచున్నాడు.

నిష్కంపమగుటవలన నివిపొరబాటుకావు ౨౬ సూ.

♦ ఈగుణముల విషయమున ప్రయత్నమబాధితము కావున నీగుణములు పొరబాటున ననుకొనునని కావని తెలియవగును.

అంతటను కన్పట్టవుకావున బాఠధర్మములుకావు ౨౭ సూ.

ఇవి చదువుటవలననే నేర్పడునేని చదివెడు నన్నిచోట్లను గూడ నవిశేషముగా నివి కన్పడి తీరవలయును. అట్లు కన్పడుట లేదు కదా! ఆయా గ్రంథభాగముల జదువునపుడేవైన విశేషముల

♦ ఈగుణముల...—ఈగుణముల విపర్యయము లేదోషముల స్వరూపమో విచారించుట యిక చేయవలసినపని. ఈసందర్భమున తిప్పేంద్ర భూపాలుడు వ్రాసిన దేమో మొదట పరిశీలింతుము. అర్థవ్యక్తిసద్ధ వ్యాఖ్యానమున నిట్లువ్రాసెను. "అర్థవ్యక్తి విపర్యయము—అసాధువు, అప్రతీతము, అనర్థకము, అన్యార్థము, నేయార్థము గూఢార్థము, యతిభ్రష్టము, క్లిష్టము, సందిగ్ధము, అయుక్తము. శబ్దము అసాధువు కాగానే సామాన్యముగ నర్థము స్ఫురింపదు. ఎక్కడనైన నొకచోట నర్థస్ఫూర్తిఁ గలిగినను "అసాధురనుమానేన వాచకః కైశ్చిదిష్యతే" (అసాధుశబ్దము సాధుశబ్దమును స్మృతికి దెచ్చి దానిద్వారముననర్థము జెప్పును.) అని ప్రామాణికుల నెదురు గనుక నచటగూడ సాధుశబ్దమే వాచకంబుకాని యసాధుశబ్దంబుగాదు. ఒకప్పుడైనను వెంటనే యర్థప్రతీతిగలుగక కొంతయాలస్యము కలుగుటవలన వెంటనే యర్థప్రతీతికి గారణమగు నర్థవ్యక్తికిది విపర్యయము. ఇక పాదపూరణార్థమై యవ్యయముల ప్రయోగములుగూడ నిదియేల ప్రయోగింపబడెనని సంశయముగలిగి వెంటనే యర్థము స్ఫురింపకుండును గావున నదియు నర్థవ్యక్తికి విపర్యయమే. ఇట్లే యతిభ్రంశమున గూడ నర్థస్పష్టత బాడగును కావున నదియు నిట్టిదే. ఇట్లే యితర దోషముల విషయముగూడ గ్రహించునది." అని వ్రాసెను. కాని యిదియంతయు చాల విరుద్ధముగా నున్నది. ఏమనగా; శబ్దమసాధువైనంతమాత్రమున నర్థము స్ఫురింపదా?

ననుసరించి యందము స్ఫురించునందురా? అవిశేషములు గుణములే కావున విశేషములు గ్రంథభాగమున నంగీకరించుట యనగా నటగుణ ముల నంగీకరించుటయే.

---

స్ఫురింపదేని యసాధుత్వ మెట్లు చెప్పగలము. మనకు దెలియని భాషలోని యేదైననొక పదమునకర్థము మన మెఱుగకున్న నాపదమసాధువనెదమా? అర్థము తెలిసినచో నాయర్థమున నిది యిట్లుండవలయును. ఇట్లుగూడదు. అని వ్యాకరణప్రకారము సాధుత్వాసాధుత్వముల నిర్ణయింతుము. అంతియకాని యర్థము తెలియక యేపదమును అసాధువనజాలము. వామనాచార్యునిదృష్టాంతము జూచిననుమనకీవిషయముతప్పని తెలియును. "అన్యకారక వైయర్థ్యం" అనియాతని యుదాహరణము. అచట అన్య కారక పదమునకు అర్థము తెలియకుండినచో ఈయన్యపదము అషష్ఠ్యతృతీయాస్థమని నిర్ణయించుటెట్లు? అదియుండినగదా దుష్కరా లేదని యసాధువనుటకవకాశము. కావున నసాధులైనంత మాత్రమున నర్థవ్యక్తికలుగదనుట యుక్తముగాదు. ఇక పాదపూరణార్థమై ప్రయోగించిన దాని విషయములోగూడ నర్థము తెలిసిననే ప్రకృత ములో దాని యానర్థక్యము స్పష్టపడును. ఇచట నర్థసంశయమేది? మొదట నన్ని పదముల యర్థమును తెలిసికొని నప్పుడు అనర్థకము నర్థముగూడ తెలియునుగదా. మఱియు నర్థము తెలిసిననే దీనినిటనేల ప్రయోగించెను? దీనివలని యుపయోగమే మైన నున్నదా? లేదా? అను సంశయముగలుగును. పైజెప్పినసంశయ హేతుత్వమే యిచటి దోషత్వమునకు గారణమనియెదరా? ఏశ్లోకమునైనను విశేషములు, వాక్యార్థము, అంతయు పునః పునర్విచారణమైన పిదపనే సాధారణముగ నిర్ణీతమగు చుండును. అచట గూడ మొదట సంశయము తప్పనే తప్పదు. "ఇచట నీపదమున కేమి ప్రయోజనము? ఏదైన విశేషమున్నదా? ఇది యెట్లు సమన్వితమగున"ని యీ తీరుగ సంశయము లచటగూడతప్పవు. ఇట్లు వాక్యములన్ని యునర్థవ్యక్తి విపర్యయ ములై దోషములగుట తటస్థించును.

"మాయభిప్రాయమదికాదు. మొదట సంశయము గల్గినను చివరకన్నియు దీర్పబడి విశేషము వాక్యార్థము నిర్ణీతమగును కావున నావాక్యములు దోషములు కావు. ప్రకృతమున పాద పూరణార్థకమగు పదము విషయములో జివరకుగూడ నే విధమగు సార్థక్యమును రాక వెనుకటి సంశయము సరిగా తీరదు కావున నది దోషమే యగును" అని సమాధానము సరికాదు. ఏమనగా; అప్పుడు మీ మొదటి సిద్ధాంతమే పోవును. "అర్థసంశాయకము గనుక నర్థవ్యక్తికి విపర్యయము" అని మొదటి సిద్ధాం తము. ఇప్పుడర్థనిశ్చాయకము కాదు కావున నర్థవ్యక్తికి విపర్యయము అని చెప్పు చున్నారు. ఇట్లు చెప్పుట ప్రథమసిద్ధాంతమును త్యజించుటలేగదా! అర్థనిశ్చాయ కముకాలేదనగా నర్థసంశాయకమనియే పర్యవసన్నార్థమనుచో నప్పుడిది సందిగ్ధమను దోషములోనంతర్భవించునుగావునవేఱుదోషముగాదీనిని నిరూపించుటయుక్తియుక్తము

కాబోదు. పాదపూరణమునకై రచించినను విధేయమతము నెరవేరదు. ఈపాదపూరణార్థములలోఁగూడ చివరకునిశ్చయము చెప్పఁదగును. 'ఇవి పాదపూరణమునకే యేర్పడినవి. వేఱే ప్రయోజనము వీనికి లేదు' అని యెటులైనఁగూడ చివరకునిశ్చితమగును. కావున నేగదా వీని ననర్థకములనుట. ఇట్టిచోట్లలో నిచట అర్థసంశయము లేదుకావున నివికూడ మీరనుడివినట్టి యర్థవ్యక్తి ప్రతిబంధకత్వము (అర్థసంశాయకత్వ రూపమైనది) కలవి కాబోవు. అట్టి వీనికి దోషత్వమును రాబోదు. కావున ననర్థకములు కూడ నర్థవ్యక్తి విపర్యయ స్వరూపములు కావని స్పష్టము.

ఇక యతిభ్రంశవిషయము విచారింతము "ఏతస్యాం రాజతిసుమనసాం దామ కంఠావలంబి" అను యతిభ్రష్టోదాహరణములో నర్థస్ఫూర్తికేమైన బ్రతిబంధక మున్నదా? 'రాజతి' యనునది యతిభ్రంశము కలదైనను నర్థము స్ఫురించకపోవుట లేదు. యతిభ్రంశ దోషమున్నచో నసలు యతి నెందుకు స్వీకరించిరో యాప్రయోజనము పోవును. అంతేకాని యర్థవ్యక్తికి ప్రతిబంధము రాబోదు. పద్యమునడక కుంటుపడకుండ జక్కఁగా సాగుటకై యతి ప్రారంభింపఁబడినది. అట్లు సాగుటవలన సౌకుమార్య ప్రసాదమాధుర్యము (శబ్దగుణములు) లుండుట కవకాశ మేర్పడును. ఇంతియగాక పద్యము సాఫీగా సాగుటలో శ్రుతిపేయమైన యొక యందముగూడ స్ఫురించును. అందుకై యీయతి ప్రారంభమైనది. ఈయతిచెడిన నట్టి సౌందర్యము పోవును. సౌకుమార్యమాధుర్య ప్రసాదముల కవకాశము తొలఁగును. కాని అర్థవ్యక్తికేమాత్రమును నడ్డురాదు. కావున సౌకుమార్యాది విపర్యయమే యించుమించుగా యతిభ్రంశమగుట కవకాశమున్నది. ఇంచు మించుగా ననుట యేలనన; సౌకుమార్యమాధుర్య ప్రసాదముల భంగము సర్వత్ర యతిభ్రంశము గాదు. అనగా; యతిభ్రంశమగునపుడు సౌకుమార్యాదుల భంగముండునని భావము.

ఇక నసాధువు విషయము:—ఇది అర్థవైమల్యమను ప్రసాదము విపర్యయము. అసాధుపదములవలన నర్థము తెలియును; కాని యది విమలముగానుండదు. ఆపదమా యర్థమునకు ప్రయోజకము కాకపోవుటయే యందుకు గారణము. కావున బ్రయోజకమాత్ర పరిగ్రహణమను నర్థవైమల్యమునకు భంగమేర్పడును. అనర్థకముకూడ యీగుణమునకు విపర్యయమే. ఏమనగా ననర్థములుండినచో బ్రయోజకమాత్ర పరిగ్రహము సంభవింపదుగదా; అప్రయోజకములగు పాదపూరకములుఁగూడ నుండును. కావున బ్రయోజకమాత్ర పరిగ్రహమను నర్థవైమల్య గుణమునకు విపర్యయమేర్పడును.

ఇక మిగిలినవి—అప్రతీతము, అన్యార్థము, నేయార్థము, గూఢార్థము, క్లిష్టము, సందిగ్ధము, ఇవి యన్నియు నర్థవ్యక్తి విపర్యయములే. విసంధిలో మూడవరకము కష్టము శ్రుతి విరసమైన కష్టము, ఒక్కొక్కప్పుడు యతిభ్రష్టమున్ను సౌకుమార్య గుణమునకు విపర్యయములగును. కష్టత్వాభిన్నవృత్తములుఁగూడ సౌకుమార్యవిపర్యయస్వరూపములే. ఇప్పటికి నిరూపణవలన మిగిలినవాని విషయము సుజ్ఞేయమని మాతలంపు.

తృతీయాధికరణమున ప్రథమాధ్యాయము ముగిసినది.

మూడవ యధికరణము

రెండవ యధ్యాయము

ఇదివరకధ్యాయములో శబ్దగుణములను వివేచించుటయైనది. ఈయధ్యాయమున నర్థగుణముల వివేచించుచున్నాడు.

అవియే యర్థగుణములు. ౧ సూ.

వెనుకటి యధ్యాయములో నిరూపించిన యోజస్సు మొదలుకొని కాంతివరకున్నవే యర్థగుణములున్ను "మరి శబ్దగుణములే యర్థగుణములగుచో నిట్లు విభజించుట యేల?" యని యా శంకరాగా వాచ్యవాచకముల (అర్థములు, శబ్దములు) మూలమున వానికి భేదమును జూపుచున్నాడు.

అర్థము ప్రౌఢి యోజస్సు ౨ సూ.

వాచ్యమగు నర్థము ప్రౌఢముగానుండుట యోజస్సు.

పదము నర్థానవాక్యము పలుకుటయును
వాక్య మర్థానపదమును పలుకుటయును
వ్యాసమును సమాసమ్మనునట్టి సాభి
ప్రాయతయు నని ప్రౌఢిమ పంచవిధము॥

పదార్థమున వాక్యమునుడువుట యెట్లనగా;

అత్రిమునికంటి పసిబిడ్డడాకసమున
నుడుగణము లాడకాడకు నొడ్డగిలిన
బాలభానుండు నలుగడ బర్వమేటి
వెండిగుండన నుదయించె వేగుజుక్క॥

ప్రద్యుమ్న విజయము—ఘణిధమమాధవుడు

ఇచట "చంద్రుడు" అను నొకపదమున జెప్పదగునర్థము గీతి ప్రథమచరణమున గల వాక్యముచే జెప్పబడినది. ఇచట వాక్యమనగా

పదసమూహమని మాయభిప్రాయము. ఈ తీరుననే యితరమునుగూడ గ్రహించునది. ఎట్లనగా:

మునుసౌరభ్యము నివ్వటిల్లగ మనోమోదంబునందేటు ల
ల్లనమోలిన్ వెసలంగరేకులు సముల్లాసంబునంబింక మె
క్కనయంబెక్కుచు గ్రద్దెహొంచెకలివీకంగేసరంబుల్ గడల్
కొనజొత్తోమఘవద్ది పేరెలమిబొల్పుంజెందెనంభోజముల్ ॥

పద్మవికాసమను పదార్థమీ పద్యరూపము నొందినది.

* ఈపద్ధతియే "శతపత్రంబుల మిత్రుని" యను చోట నున్నది గదా!. అది దుష్టమనుట యుపపన్నమగునా? యని యాశంకింపవలదు. కావ్యమునకు సొగసు కల్గించుటకదా గుణముల సామాన్యలక్షణము. అది యచటలేదు కావున నీపద్ధతినే యచట దోషమనవలసివచ్చినది.

వాక్యము నర్థమున బదమును నుడువుట యెట్లనగా:—

"దివ్యకాదీమె మనుజుల తెలవకాని" అని చెప్పవలయుచోట "నిద్రించుచున్నది" అనుట లేక "తెప్పవాల్చుచున్నది" అనుట.

వ్యాసమున కుదాహరణము:—

♦ అరయగదుఃఖమంచు సుఖమంచును నేర్పడియున్నదేది? యు
ర్వరసుఖదుఃఖపున్వ్యతికరంబు ఘటిల్లు వివేకహీనతన్
బరమమగుఁ మహాపురుషభావ మనిర్వచనీయమేది మే
దురసుఖముఁ సుఖంబుగను దుఃఖముదుఃఖముగాగణింపదో॥

చండకౌశికము-౪ అంకము.

---

* ఈపద్ధతియే—అనగా 'ఓకుక్కా' యని యొకపదమున జెప్పవలసిన యర్థమే 'శతపత్రంబుల మిత్రుని' యను నొక కందపద్యమున ననగా వాక్యమున విస్తరింపబడినది గదా! ఇట్టి యెడ నిది ప్రౌఢియను గుణము కానలయునుగాని క్లిష్టమును దోషమెట్లయినది అనిప్రశ్న.

♦ అరయగ:—"తెలివితక్కువ సుఖదుఃఖముల నేర్పరుచునుగాని యవి వ్యవస్థితములు గావు. మహానుభావులు వానిని గణింపరు" అను వ్యాకార్థమిట్లువిస్తరింపబడినది.

* నాదిభ్రాంతి నివ్యక్తమౌ నడుమయవ్యక్తంబయాదిందుదిన్
బ్రాదుర్భూతము పంచధాజగము తత్పంచత్వమబ్రంబొకో
యాదోరాశితరంగ భంగవలన వ్యాపారమౌ సంస్మృతిన్
భేదంబేమి వియోగయోగములకుఁ భేదంబుమోహోత్తమే.

చండకౌశికము_౫ అంకము.

సంకోచవిధియెట్లనిన :-

♦ శంతనుపిమ్మట సత్యవతీదేవి
యనుమతితోడ చిత్రాంగదునకు
సామ్రాజ్యపట్టంబు సమ్మతిగట్టితి
నల్పకాలంబున నతడుదీఱె
దత్పరోక్షావస్థదదనుసంభవుని వి
చిత్ర వీర్యుని రాజుసేసి పెండ్లి
సేయంగదివిరి కాశీపతికూతులు
కన్యలుమువ్వురు గలుగుటయును
నాతదర్థిదదీయ స్వయంవరమున
కఖిలనృపతుల బిలిపించెననియునెఱిగి
తల్లికెఱిగించి యొంటిమై తత్పురమున
కాయితంబయిపోయితి నరదమెక్కి.

ఉద్యోగ పర్వము_౫ అశ్వాసము ౨౬౩ ప॥

సాభిప్రాయత్వ మెట్లనగా:

* "యువక శ్రేష్ఠుడు చంద్రగుప్తుఁడు చంద్రోద్యోతుఁడీరాజు భా
గ్యవిధిఁశ్రీయుతులాశ్రయింపదగియెఁసార్థక్యమొందెఁశ్రమల్"

* నాదిభ్రాంతిని:_నాదిభ్రాంతి= అనాదియైన మాయచేత, "మాయావశమైన పంచభూతాత్మకజగత్తున సంయోగవియోగములసత్యములు" (అశాశ్వతములు) నను నొకవాక్యము నర్థమిట్లు విస్తరింపబడినవి:

♦ శంతనుపిమ్మట:_ఇందుప్రథమ చరణము మొదలుకొని పద్యాంతమువఱకు సంకోచవిధిని గ్రహింపవలయును.

* సాభిప్రాయత్వము:_దీనికి విపర్యయము, వ్యర్థము, అపుష్టార్థమును.

ఇచట "భీమసుతుఁ డాత్రేయుఁ బడగిమెన్" అనునది వసుబంధుని సామర్థ్యమునుపక్షేపించును గావున సాభిప్రాయము. ఈన్యాయముచే

బకవిధ్వంసి జటాసురాంతకు హిడింబప్రాణహారిఁ గీ
చకనిర్మూలన కేళిలోలు సమరోత్సాహైకశీల ప్రవ
ర్తకు నాగాయుత సామ్యకీర్తిత బలోదగ్రుం బ్రతివ్యూహదా
హకు భీముంగొనివచ్చు ధర్మజుఁడు బాహాటోపముఁ జూపఁగన్.

ఉద్యోగపర్వము - ౨ ఆ. ౧౪౨ ప॥

ఇందు "బకవిధ్వంసి" మొదలగు పదములును,

"అతులసభాంతర స్థితబుధావళికెల్ల జొహారువీరరా
హుతులకు మేల్జొహారు సతతోజ్జ్వల విక్రమసార్వభౌమ సం
తతికిజొహారు వైభవపితాన పురందరుడైనయట్టి భూ
పతికిజొహారు మానపరిపాల జొహారు ప్రధానశేఖరా."

భృంగపంకము.

ఇందు ♦"మానపరిపాల" యను పదమును వివరించినట్లయినది.

* అర్థవైమల్యము ప్రసాదము ౩ సూ.

అర్థవైమల్యమనగా నర్థమునుబోధించుట కుపయోగించునట్టి వేయగు పదములను గ్రహించుట.

ఉదాహరణము :—

"వలదు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర
జాతులాత్మకులోచితాచార పథము
నడపనాహంసడిభకులే నాటనేది
నడపిరదిచెల్లుగాక వర్ణములకెల్ల."

ఉత్తరహరివంశము ౪ అ॥ ౧౦౩ ప॥

విపర్యయమున కుదాహరణము:—

"విమలమణికాంచి పదమును రమణి నాదు
కరము కరముపచరించును గాకయిపుడు."

---

* ప్రసాదము :_ దీనికి విపర్యయము, అపుష్టార్థము, అనర్థకమును.

♦నీతోరాత్రి గలసిన రాణిమర్యాద గాపాడుట నీచేతిలోనున్నదని యిటనభిప్రాయము ఇట విశేషమెరుగ గోరువారుమా "ఆంధ్రధ్వన్యాలోకమును" చూడవలెను.

ఇచట "కాంచీపదము" అనుటవలననే నితంబము గుర్తింపబడును గదా? ఇక "విమలమణి" యను విశేషణము ప్రయోజక మగు టెట్లు?

లేక

"యాదోరాశి తరంగభంగవలన వ్యాపారమా సంస్మృతిః—"

చంద్రశేకరము_౫౮ అం॥

"యాదోరాశి తరంగభంగ వ్యాపారము" అనినంతనే కావల సినయర్థము లభించుచుండగా" "వలన" యనునది యప్రయోజకము.

ఘటన* శ్లేషము ౪ సూ.

ఘటనయనగా క్రమమును, కౌటిల్యమును, అనుల్బణముగా యుక్తితోగూర్చుట. ఇది శ్లేషము.

ఉదాహరణము:—

"ఒకచెలినొక్కచే వెనకనుంచి కనుంగవమూసిపట్టి వే
ఱొకకరమెత్తి కొమ్మనుచు నొక్కతెకుం గనుసన్న చేసి న
న్నొకపరి ముద్దువెట్టుకొన నొక్కతె వెంటనెవచ్చి మెచ్చె దా
నికి జికదేవరాయలొక నేర్పున వంచనసేయకుండునే.

మైసూరు చిక్కదేవరాయలమీది చాటుధార

అవైషమ్యము ♦సమత ౫ సూ.

ప్రారంభించిన యర్థముపద్ధతి మార్పులేకుండుట సమత. ఒక్కొక చోట నాపద్ధతి మారుటయుగలదు.

ఉదాహరణము:—

"ఆడగ గెంజడల్ దొలకియాడగ జాహ్నవిదిక్కులెల్ల న
ల్లాడగ భూతధాత్రియసియాడగ నాకము నాకసంబునూ

---

*శ్లేషము:—దీనికి విరుద్ధము లోకదేశకాల విరుద్ధము.

♦సమత:—దీనికి విపర్యయము అవైషమ్యపదమునకు మొదటి యర్థమునుసరించి యుపక్రమమును, రెండవ యర్థమునను సరించి వాక్యగత దోషమగు క్లిష్టమును.

చూపగ ముక్తగంబు గొనియాడగ నిప్పుడీవు తాండవం
పాడగ గౌరిసిగ్గ సరసమాడగ జేరునటా మహానటా'',

మఱియు,

తళతళమను పతాకలతోడ రవికాంతి
దళతలమనెడు రత్నములతోడ
గనగనసొబగధికంబైన పొడవుతో,
గనకనమను హేమకాంతితోడ
గలకలబల్కు చిల్కలతోడ, గృహదీర్ఘి
కలగలహంస సంఘములతోడ
______
బరిపరిగతినాడు బర్హులతోనిజో
పరిపరిగతమేఘ పంక్తితోడ
______
దములవిహరించు పారావతములతోడ
భ్రమదళివ్రాత సుమవితానములతోడ
భ్రమదవనవాసనలచేత భ్రమదిమెసగి
మెనయునీమేడతో బ్రతియెనయగలదె.

మదనసేనము_నంది మల్లయ్య.

ఇందు సీసము మూడవపాదము చివర సగమునను, నాలవ పాదము చివర సగమునను మొదట నెత్తుకొనిన పద్ధతి మార్పొందినది. ఇట్లుండిన సరిపడును.

''గృహవాపి గొలకొలమను పుల్గుగములతోడ
బైనమదిమదినున్న యంబుదముతోడ.'' అని.

ఇదివరకు ''తళతళ'' యనునది మొదలుకొని సీసము పాదములలో మొదటి సగము చివరసగముల మొదట అనుప్రాసమంతయునొకే యర్థము గలుగునట్లుగా గూర్పబడినది. ఈ రెండుచోటుల మాత్ర మాపద్ధతి మారుపొందుట బాగుండలేదు. ఈపాదములలోగూడ పూర్వార్థముల మొదట వెనుకటి పద్ధతి మారలేదు.

లేక,

అర్థము సుగమమగుట యవైషమ్యము.

ఉదాహరణము :—

"ఎవ్వతెవీవు భీతహరిణేక్షణ యొంటిజరించెదోటలే
కివ్వనభూమి బ్రాహ్మణుడనే బ్రవరాఖ్యుడ......".

అర్థమున జూపు *సమాధి ౬ సూ.

"మనసు సావధానముగా నుండినచో నర్థమునందు జక్కగా చూపుకల్గును". అనువిషయ మిదివరలో జెప్పియుంటిమి. ఆ మనస్సావధానతయే సమాధి. ఆ యర్థదర్శనమునకే సమాధి కారణము కావున నిది సమాధియనబడును.

అర్థము స్వాభావికమనియు నితరుల పోలికల నేర్పడినదనియు రెండువిధములు ౭ సూ.

పైసూత్రమున దెల్పబడిన యర్థము రెండు విధములు. మొదటిది స్వాభావికము; అనగా నితరుల కావ్యముల పోలికల నేమియు గ్రహింపకొక యవధాన స్వభావమాత్రముననే యేర్పడునది. ఇతరుల పోలికల గ్రహించి దాని ననుసరించి రచింపబడినది రెండవది.

మొదటియర్థమునకు ఉదాహరణము :—

దైతేయమదవతీ ధమ్మిల్లములతోడ
విరులనెత్తావికి వీడుకోలు
దనుజశుద్ధాంత కాంతాకటాక్షములతో
కలికికాటుకలకు గానివావి
దానవమానినీస్తన కుంభములతోడ
పసపుపయ్యెదలకు బాయుతెరవు
దైత్యావరోధన దయితాధరములతో
సొబగువీడెములకు జుక్కయెదురు

*సమాధి :—దీనికి విపర్యయము గ్రామ్యత్వము.

పేసెసురసుందరీ కరాళీకరా
వ్యంతపలితాంత కుంతలవిలసదింద్ర
కులవధూటీలలాటికాకుంకుమంబు
పదిలపరుప శక్రుండసిధరము కాదె. ఉత్తరహరివంశము—౩ ఆ॥ ౧౮౪ ప॥

రెండవయర్థమునకుదాహరణము :—

దైతేయకాంతల తిలకముల హెమ్మేవుల
పీటికాక్రీలకు పీడుకోలు
వేల్పుటిల్లాండ్రకు క్రొవ్విడవుజన్నులమీది
యలవుఱయ్యెదలకు నిలువునీడ
విశ్వజగత్ప్రియా విజయలక్ష్మీనాథ
బిరుదోత్సవములకు బెండ్లివిందు
పరిపంథివాహినీ పరిచితపరిభవ
ప్రాప్తిసంకటముల పాయుత్రోవ
నేసియెయ్యది విలసిల్లు జిత్రమహిమ
నదిప్రయోగింపనెత్తె యయ్యచ్యుతుండు
విలయసమయ సముద్భూత విపులదహన
దారుణస్ఫుర్శనంబు సుదర్శనంబు.

వీరమాహేశ్వరము—నిశ్శంకుని కొమ్మయ.

మరియు,

మొదటియర్థమునకుదాహరణము :—

"ఈసునబుట్టి డెందమున హెచ్చిన కోపదవానలంబుచే
గాసిలియేడ్చె బ్రాణవిభుకట్టెదుర౯ లలితాంగిపంకజ
శ్రీసఖమైన మోముపయి జేలచెరంగిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠకలకంఠ వధూకలకాకలీధ్వని౯."

పారిజాతాపహరణము—ముక్కుతిమ్మన.

రెండవయర్థమునకుదాహరణము :—

"ఆజాబిల్లివెలుంగు వెల్లికలడాయన్ లేక రాకానిశా
రాజశ్రీసఖమైన మోమున బటాగ్రంబొత్తి యెగ్గెత్తియా

రాజీవాననయేడ్చె గిన్నరవధూరాజిత్క రాంభోజ కాం
భోజీమేళవిపంచికారవసుధాపూరంబు ఘోరంబుగాన్''.

వసుచరిత్రము-భట్టుమూర్తి.

వ్యక్తమును సూక్ష్మమును ౭ సూ.

పై రెండు విధములగు నర్థములను వ్యక్తమును సూక్ష్మమును నని రెండు తెఱగులు. అందువ్యక్తమిదివర కుదాహరింపబడినది. ఇక సూక్ష్మమును వివరించు చున్నాడు.

భావ్యమును వాసనీయమునని సూక్ష్మము ౮ సూ.

సూక్ష్మము భావ్యము వాసనీయమని రెండు విధములు. శీఘ్రి నిరూపణమే భావన. దానివలన గ్రహింపనగునది భావ్యము. అధికమగు నేకాగ్రతవాసన. అవి బాగుగానున్నగాని గ్రహింపరానిది వాసనీయము.

భావ్యమున కుదాహరణము :—

మొగమును మొగమును ముచ్చటలాడంగ
నగవును నగవును నవ్వియాడ
మోవియు మోవియు ముద్దులుగురియంగ
జూపును జూపును దీపులాడ
నొడలును నొడలును నొక్కటియైయుండ
బులకలు బులకలు గలయబడగ
దొడలును దొడలును దొనరిపెనంగగ
నడుగులు నడుగులు నదిమికొన॥

వరుసదలయంపిజేతులు సరసమాడ
నితరకరములుపైనొప్ప రతులయెడల
సరసశయనించి పరిరంభ సంభ్రమముల
బ్రేతలును దానుసుఖియించె విశ్వవిభుడు.

వాసనీయమున కుదాహరణము :—

"హౌకుగారన్ విషకుండి వేడ్కలలరన్ బుత్తెంచునాభూషణో
త్కరముఁ జెచ్చెలితెచ్చియిచ్చుటకు గాంతారత్నమీక్షించియ
బ్బురమందెన్ గొనియాడెదిట్టైవగచెఁ బోద్రోచెదీవించె నా
భరణంబుల్ వివరింపుడాసరసుడై భావోదయస్థానముల్."

ఉక్తివైచిత్ర్యము *మాధుర్యము ౧౦ సూ.

ఉదాహరణము:—

"చిత్తజుడల్గితూపుమొనజేసిన జేయగనిమ్ముపైధ్వజం
బెత్తినసెత్తనిమ్ము వచియించెద గల్గినమాటగట్టిగా
నత్తరళాయతేక్షణ కటాక్షవిలాస రసప్రవాహముల్
కుత్తుకబంటితామరలకున్ దలమున్కలుగందుమీలకుఁ."

విజయవిలాసము.

పరుషతలేమి ♦సౌకుమార్యము ౧౧ సూ.

కఠినమగువిషయమును జెప్పవలయునపుడు కాఠిన్యము స్ఫురింప కుండుటయే పరుషతలేమి. అదియేకదా సౌకుమార్యము. ఎట్లనగా:

మృతుని గీర్తిశేషుడనుటయు, ఒంటరిగానినిదేవతాద్వితీయుడను టయు, వివస్త్రుని దిగంబరుడనుటయు, సంస్కృతభాషకు సంబంధించిన సౌకుమార్యము. ఇక నాంధ్రమున,

"చచ్చెను" అనవలయునపుడు "కాలముచేసెను, వెళ్లిపోయెను" అని యనుటయు "వంటచేయుటను" "ఆధ్వర్యవమనుటయు". ఇట్లే యింకను నూహించునది.

---

*మాధుర్యము:—దీనివిపర్యయము ఏకార్థత్వము. ఏకార్థశ్రుతివలని కష్టత్వము కూడ దీనివిపర్యయమని వ్యాఖ్యాత వ్రాసినాడుకాని యదిసరికాదు. ఏలయన; కష్ట మనకు లక్షణమును వివరించుచు వామనుడు « విరసం శ్రుతికటుపదంకష్టం» అనెను. కావున ఏకార్థము శ్రుతిగోచరమైనను పదత్వము లేదు కావున గష్టము కాజాలదు. అదియుంగాక కష్టదోషము పదదోషము. ఈమాధుర్య మర్థగుణము. దీని విపర్యయ మర్థదోషమగుట యుక్తము గాని శబ్దదోషమగుట యుక్తముగాదు.

♦ సౌకుమార్యము:—దీనికి విపర్యయము అర్థగతమగు నశ్లీలము.

అగ్రామ్యత్వముదారత ౧౨ సూ.

గ్రామ్యత్వము ప్రసక్తించునపుడగ్రామ్యత్వముదారత యన బడును.

ఉదాహరణము :—

నీపాదకమలంబు నెమ్మి డగ్గరగాని
తలిరిపోవంగ బాదములురావు
నీకరాబ్జంబుల నెఱినంటితివగాని
తక్కినపనికి హస్తములుసారవు
నీవాగమృతధార నిండగ్రోలగగాని
చెవులన్యభాషలు సేరివినవు
నీసుందరాకృతినియతిజూడగగాని
చూడవన్యంబుల జూడ్కికవలు
విన్నగాని పలుకనేరవు మాజిహ్వ
లొల్లననుచు బలుకనోడవీవు
మామనంబులెల్ల మఱపిదొంగిలితివి
యేమిసేయువార మింకగృష్ణ.

భాగవతము ౧౦ స్కం. పూ. భా. ౭౭౨ ప॥

* విపర్యయమున కుదాహరణము :—

సొగసుకీల్జడదాన సోగకన్నులదాన
వజ్రాలవంటి పల్వరుసదాన
బంగారుజిగిదాన పటువుగుబ్బలదాన
నయమైన యొయ్యారి నడలదాన
తోరంపుకటిదాన తొడలనిగ్గులదాన
పిడికిటనడగు నెన్నడుముదాన
తళుకుజెక్కులదాన బెళుకుముంగరదాన
సింగాణికనుబొమ చెలువుదాన

*విపర్యయము.—ఉదారతా విపర్యయము గ్రామ్యత్వము.

మేలిమిపసిండి రవ కడియాలదాన
మించిపోనేల రత్నాల మించుదాన
తిరిగిచూడవె ముత్యాల సరులదాన
చేరిమాటాడు చెంగావి చీరదాన.

చాటుధార - శ్రీనాథుడు.

వస్తువుల స్వభావపు స్ఫుటత్వము ♦ అర్థవ్యక్తి ౧౩ సూ.

ఉదాహరణము:—

తొడవుబొడ్చినదైన దొయ్యలిరూపులో
చిన్నవోయినపట్లు చెన్నుమీఱు
సిరులువుచ్చినదైన చెలియపెన్నెఱితావి
బాయనిజవ్వాది బయలుమెఱయు
బూతరాల్చినదైన బొలతుకమైచాయ
గవుసెనవుచ్చిన క్రమముదెలుపు
మడుగుమాసినదైన మగువపిఱుందు సో
యగముచూపఱ చిత్తమాకగొలుపు
మురిపెముల నుజ్జగించిన ముగుదతనము
కలికిజూపుల వీడ్కొన్న కన్నుగవయు
చిరునగవునోసరించిన చిగురుమోవి
నింతిమదిభీతి వెలివీడు టెఱుకసేయు.

ఉత్తరహరివంశము-౧ ఆ॥ ౫౪ ప॥

"ఎత్తినవేడ్కఁగంధరములెత్తి మొగంబులుసాచి చూడ్కులుఁ జిత్తములుఁ నిగుడ్చి తమచెందెడు నిక్కలురోసి యింపు ద క్కొత్తగనొక్కచోనొకటి నొక్కటిగాంచి యెలర్చుగాయ్వులం జిత్తజుకేళిదేలె విలసిల్లుచు జక్కవదోయివేకువన్." తిక్కన.

రసముల విజృంభణముకాంతి ౧౪ సూ.

శృంగారాదిరసములు చక్కఁగాస్ఫురించుట కాంతియనబడును.

♦ అర్థవ్యక్తి:—దీనికి విపర్యయము సందిగ్ధము, క్లిష్టమునని వ్యాఖ్యాతవ్రాసెను.

## తృతీయాధికరణమున ద్వితీయాధ్యాయము

ఉదాహరణము :—

"అరిజూచుఁ హరిజూచుజూచుకములందుండ మందారకే
సరమాలామకరందబిందుసలిలస్యందమ్ము లందముగాఁ
దొరగఁ బయ్యెద కొంగొకింతతొలగఁ దోడ్తోశరాసారముఁ
దరహాసామృత పూరమున్ గురియగఁ దన్వంగి హేలాగతిఁ".

ఉత్తరహరివంశము.

ఇంకొకటి

"ఆయెంబోయెనికేల నావలన దప్పేమాటకై రింపవా
రాయో కానమునీమనంబు దయమీరంబల్కవింతైన నీ
ప్రియంబేటికి నిన్నుబాసిన తృణప్రాయంబయో కొక్కరో
కోయంచుఁ దొలికోడికూయుదనుకఁ గోపంబె బింబాధరా".

స్ఫుటముగా గుణములన్నియు బూర్ణమగుట
కావ్యపాకంబటందురు కవులుచూత
ఫలము పరిణామమునకు బోల్పబడుచుండు
పాకతత్వజ్ఞులైన భావకులచేత.
వస్తుగుణములు స్ఫుటముగా వరలవాక్క
సుప్రతిజ్ఞుల సంస్కృతి గొప్పసార
మైనవృంతాకపాకమే యగుటనట్టి
కావ్యమునునేవగింత్రు లోకమ్మువారు.
గుణముల పదింటనొకటియు గొననియర్థ
మైనగావ్యమపార్థక మంద్రుదాడి
మములుపది,యారపూపములుమరియనెన్ను
పలుకుయుక్తవిచారమై పరుగునెట్లు.

ఇది ఆంధ్రకావ్యాలంకార సూత్రవృత్తియందు గుణవివేచనమను

ద్వితీయాధ్యాయము

గుణవివేచనాధికరణము ముగిసినది.

## శా బ్ద వ య ధి క ర ణ ము

గుణములు కావ్యమునకు సొగసును సమకూర్చును. ఆసొగస లంకారములచే నతిశయించును. కావున నాయలంకారములను నిరూపించుటకై యాలంకారికమను నాలవ యధికరణ మారంభింపబడుచున్నది. అయలంకారములలో శబ్దాలంకారములు రెండు. అవి యమకము నమప్రాసమును. వానిని క్రమముగా నిరూపించుచున్నాడు.

అనేకార్థకమగు పదము నక్షరమును నావృత్తమై
స్థాననియమమున్నచో యమకము ౧ సూ.

అనేకార్థకము:—వేఱువేఱర్థములు కలది. అట్టిపదమొకటి కాని యింకనెక్కువగాని అట్లేఅక్షరములుకూడ నేకముగానియంత కెక్కువగాని యావృత్తమగునపుడు స్థాననియమముండవలయును. అపుడు యమకమగును. స్థాననియమమనగా పదముగాని యక్షరముగాని తన స్వరూపమంతటితోగాని కొంతభాగముతోగాని తానే యుండిగాని లేక తనవంటిదేదైన నుండిగాని పద్యపాదముల నన్నింట వ్యాపించుట. ఇది యుదాహరణములందు సుజ్ఞేయమగును. "అయితే కొన్ని పద్యములందొక్కొక పాదమునందే యమకమగు పడుచున్నది. వానికి పైజెప్పిన స్థాన నియమ మెట్లుకుదురును. ఈయమకమాపద్యముల నన్నిపాదములను వ్యాపించలేదుగదా!" యని యాశంక కలుగవచ్చును. కాని వానికిగూడ బెరుగుపద్యములందుగల యమకపు టేర్పాటుల ననుసరించి స్థాననియమము కుదురును. ఇక స్థానములను జెప్పుచున్నాడు.

పాదములు, ఒకపాదమునకుగాని యంతకెక్కువకుగాని
మొదలు, నడుమ, చివర, స్థానములు ౨ సూ.

పాదములును స్థానములు. ఒకపాదమునకు మొదలు, నడుమ, చివరలును స్థానములు. అనేకపాదములకును నవియేస్థానములు.

పాద యమకమున కుదాహరణము:—

"రాజసంబున గక్ష్యాంతరముల గడచి
యరిగెనపుడు జగన్మోహనాంగ విజిత
రాజరాజకుమార సారంగధరుడు
రాజరాజకుమార సారంగధరుడు."

లేక,

"తగినమగవాని కౌగిట దవిలినట్టి
యలిచికుర యౌవనంబది యౌవనంబు
తగనిమగవాని కౌగిట దవిలినట్టి
యలిచికుర యౌవనమ్మది యౌవనమ్మె."

ఒకపాదములోని మొదల యమకమున కుదాహరణము:—

"హరినిలయంబును హరినిలయంబును
విషధరాఢ్యంబును విషధరాఢ్యము
అప్సరోమయమును నప్సరోమయమును
వనవిలాసమును బావనవిలాసము
ఉన్నతకరిశృంగ మున్నతకరిశృంగ
మిందుకాంతస్రవ మిందుకాంతము
ఉరుకలనకులంబు నురుకలనకులంబు
నంశుకాంతద్యోతి తాంశుకాంతము
ఒనరనవశత సాహస్రియోజనోన్న
తమును బదివేలు యోజనాలమరువలము
గలిగి కనకాద్రికిన్నూటగలిగితనరి
ప్రథితమైయొప్పు మందర పర్వతంబు."

జినేంద్రపురాణము—పద్మకవి.

పాదమునడుమ యమకమున కుదాహరణము :—

"మునిసంభావన భావనర్తిత సమిన్మోదాత్మ యోధావళీ
పునరుజ్జీవన జీవనాల్పకణికాభూతాతి మాత్రప్రభీ

త నదీపావన పావనస్వపదము ద్రాఘన్యసద్వృత్తసూ
తనవాక్సేవన సేవనప్రవణ సుత్రామాదివైమానికా."

హరిశ్చంద్రనలోపాఖ్యానము—౨ ఆ॥

పాదము చివరి యమకమున కుదాహరణము:—

"హరినిలయంబును .........

* *

...........మందరపర్వతంబు." (చూ. ౬౫ పే)

రెండుపాదముల మొదల యమకమున కుదాహరణము :—

"ఈనుబుద్ధిమాట లెంతలేయనిపోయె
దీనుబుద్ధి నిడుజూమీ లతాంగి
నిలుపరాకుమాని తలపోసిచూడుమా
నిలుపరాకు మనుచు నలుగనేల."

నడుమ యమకమున కుదాహరణము :—

"ఆరభటుల్ విలసిల్లగ
వీరభటుల్ గెడపిరపుడు విభుకట్టెదుటన్
సైరిభముల మదవదనీ
చైరిభముల సింహ శరభ శార్దూలములన్."

సారంగధరచరిత్ర—౧ ఆ॥ ౭౦ ప॥

చివరి యమకమున కుదాహరణము :—

"బలారాతి రూపంబె భావించెగానన్
బలారాతి రూపంబె ప్రాపించెగానన్
శిలాహారినారిన్ని షేధింపుమింకన్
శిలాహారిరూపంబు శేషాఘమింకన్."

శ్రీరామావతారము. దశావతారచరిత్రము.

సమస్తపాదాది యమకమున కుదాహరణము :—

సారంగనయన తనమన
సారంగను గౌగలించి యలరగనపుడా

సారంగధరుని గూర్పడె
సారంగధరుండటంచు సారెంగలగున్."

సారంగధరచరిత్రము—౨ ఆ॥ ౩౭ ప॥

సమస్తపాద మధ్యయమకమున కుదాహరణము :—

"గారుతమాహాత్మ్యశన
ధీరుతమామలయనేల భృతమధుకరవా
మారుతమా మలయాచల
మారుతమానీదుకాని మదిమారుతమా."

బహుళాశ్వచరిత్రము—౩ ఆ॥ దామెరల వెంగళభూపాలుడు.

సమస్త పాదాంత్య యమకమున కుదాహరణము :—

"పరగధర్మాధర్మపద్ధతుల్ దిగనాడు
దుండగీడగుకమ్మ గుండ్లకమ్మ
అగణితవిఖ్యాతి నెగడనేర్చినయర్థి
మనసెరుంగని కమ్మ మాచకమ్మ
కడగివైరుల మదమడచిపుచ్చగలేక
యడిగి యుండెడు కమ్మ యాకుకమ్మ
పూజనీయులజూచి పూజింపజాలక
తంపిపెట్టెడుకమ్మ తాటికమ్మ
కమ్మలందరు కమ్మలా! కమ్మలరయ
గమ్మలకు గీర్తి దెచ్చిన కమ్మవీవె
ప్రథితగుణహార నారమాంబాకుమార
విక్రమోపేంద్ర అట్లూరి వేంగళేంద్ర".

ఏకాంతరపాదాది యమకమున కుదాహరణము:—

"నందనసంతానము మది
యందుంగోరుచు భజింప నాశ్రితపటలీ

నందన సంతానంబగు
నిందుకళాధరుడు పార్వతీశ్వరుడంతన్."

సారంగధరచరిత్రము—౧ ఆ॥ ౨౫ ప॥

లేక,

"పుష్కర హితవృత్తిని బర
పుష్కరపత్రాక్షిబట్టి భోగింపంగా
ముష్కరహితుడవు గమ్మని
నిష్కరణ శపించిమౌని నిలయము జేరన్."

శ్రీరామావతారము—దశావతారచరిత్రము

ఏకాంతర పాదమధ్య యమకమున కుదాహరణము.

"జనవరసూనుడందులకు జాలబ్రియంబు దొలంకనన్నెలం
తనుగని నీకుమారుడగదా యిటు తక్కినవారికిన్బలెన్
జననిరొ నాకునింత యుపచారము సేయగ నేటికమ్మనే
డనవుడు నాకుమారుడవెయాటను జేయుదునంచు నేర్పునన్."

సారంగధర చరిత్రము—౨ అ॥ ౫౮ ప॥

ఏకాంతర పాదాంత్య యమకము:—

"కలయకలయకలంక కేతకి
కళికకళికచపరచెపిల్లమె
యళికియళికి వడంకెనీ
యిభయాన యాననవిల్తు గొల్లమె".

వసుచరిత్రము—3 ఆ॥ ౧౮౬ ప॥

అక్షరయమకము, ఏకాక్షరయమకమనియు, రెండక్షరముల యమకమనియు రెండు రకములు.

ఏకాక్షరమున కుదాహరణము:—

రారాపు లేలనేసెదు
రారా నను జలువకలువ రారా మేడన్

రారాయని తలిరాకుజి
రారాయని కేళిదేల రారాకొమరా."

సారంగధరచరిత్రము—౨ ఆ॥ ౧౨౪ ప॥

మిగిలినవి స్వయముగా నూహింపనగును.

సజాతీయములతోడి నైరంతర్యమున్నచో నీయమక మెక్కువ శోభిల్లును. ఇది హరిప్రబోధమునుండి యుదాహరింతుము.

"వివిధధవవనానా నాగగర్ధర్ధనానా
వివితతగగనానా నామమజ్జజ్జనానా
రురుశశలలనానా నావవంఘంఘనానా
మమహిహితతనానా నాననస్వస్వనానా."

ఈవర్ణయమకమాలచే పదయమకమాల విషయము నిరూపించి నట్లైనది.

భంగముననుత్కర్షము ౩ సూ.

వర్ణములవిచ్ఛేదము భంగము. దానినవలంబించు యమకమెక్కువది యనదగును.

శృంఖల, పరివర్తకము, చూర్ణము, నని భంగపుత్రోవలు ౪ సూ.

యమకములోని భంగములు మూడుత్రోవల నుండును. వానిని క్రమముగా వ్యాఖ్యానించు చున్నాడు.

వర్ణవిచ్ఛేదచలనము శృంఖల ౫ సూ.

అక్షరములవిభజించుటకు సంబంధించిన చలనము శృంఖల యనబడును. ఎట్లన, "యౌవనము" అనుచోట దానిని విభజించిన తోడనే యాపదమునకు చలనమేర్పడును. * దివర్ణమునకు విచ్ఛేదము వచ్చుటలేదా!

*దివర్ణమునకు విచ్ఛేదము:—అనగా, అది యౌవనంబు అని మొదలుండునది. 'యౌ' అనునది విభజింపబడినతోడనే 'ది' వర్ణము 'యౌ' అనుదానితో కలియును. అట్లు కలియుటయే విచ్ఛేదమనబడును. ఇట్లు కలియగనే 'అదియౌ' అనుపదమునకు చలన మేర్పడును. అనగా 'అదియౌ' అనునొక పదముగాను, 'వనమ్ము' అనునొక

శ్లో క

• అల్లన గాధిరాజసుతుదర్తిలిమేనక ముద్దొనర్పరా
గిల్లికుచంబులాన గమకించుటగంటివె రాకుమారయా
నల్లనగాధిరాజసుతుదర్తిలిమేనక ముద్దొనర్పరా
గిల్లికుచంబులాన గమకించుట భాగ్యముకాదెమానినీ.

సారంగధర చరిత్రము

**సంగముపోగా స్వరూపమేర్పడుట పరివర్తకము ౬ సూ.**

సంగమనగా నితరాక్షరములతోడి సంబంధము. **అదిపోయిన తోడనే** యిదివరకితర వర్ణముచే దిరోహితమగు స్వరూపము **ఇపుడు** స్పష్టపడుట పరివర్తమనబడును.

ఉదా:—"మనసారంగను" అనుచోట "ఆరంగను" **అనుపదము** "సు" **అనునక్షరము** కలియకవలన "సారంగను" అను మరియొక **పదము** రూపొందినది. "సు" కారముతోడి కలియక తొలగుటతోడనే **"ఆరంగను"** అనుపదము స్వరూపమునొందినది. "వేఱువర్ణముల కలియకవలన రూపు మాఱినపదమునకు స్వస్వరూపము ప్రాప్తించుట యిట విధింపబడును" అని తాత్పర్యము. ఈ నిరూపణమువలన "నానా విచ్ఛేదములుగల పదముల కలియకవలన స్వరూపప్రాప్తియు వేఱువేఱు హల్లుల కలయికవలన స్వరూపప్రాప్తియునను రెండువిషయములు వివరించినట్లయినది.

**పిండాక్షరము విభజించునపుడు స్వరూపము లోపించుట చూర్ణము ౭ సూ.**

---

పదముగాను పైపదము చలించుననుట. ఇట్లు గొలుసులోని యదుకులవలె పదముల యదుకులతోడి చలనముండును గావున నిరిశ్శృంఖలయనబడెను.

•ఇందు 'నగా' యను పదమును విభజించినతోడనే వెనుకనున్న 'ల్ల' యను నదియు, ముందున్న 'ధి' యను నదియు విచ్ఛేదమొందును. అపుడు 'అల్లన' గాధి రాజసుతుడు, అని యేర్పడును. కావున 'అల్లనగాధిరాజసుతుడు' అనునది అతుకులు గల శృంఖలవలె కదలుట స్ఫురించును.

పిండాక్షరమనగా నొకటిరెండు హల్లులచే ముద్దగానైన సంయుక్షరము. దానిని విభజించుట యనగానేహల్లున కాహల్లు వేఱుచేయుట. అపుడసలు పదముస్వరూపము లోపించుట చూర్ణమనబడును.

ఎట్లనగా; " అజ్ఞారి బంధునయనకకుజ్జాత " ఇచట ద్వితీయ పాదాదియందలి "కుజ్జా" యను పదములో "జ్జా" యనునది పిండాక్షరము. దీనిని "ప్" "-జా"యని విభజించుచో నచట "గుజ్జా"యను పదము స్వరూపము లోపించును. ఏలనన; ఇచటనున్నపకారము వెనుక భాగముతోను "జా"యనునది ముందుభాగముతోను కలసిపోవును. అపుడు "కకుప్" "జాత"యనుపదములేర్పడును. ఈ విషయమున బద్యములు.

వానివానికి దగినట్టి స్థానములను
నుండిననుజూర్ణభంగము నొందకున్న
వనితయలకలవలెనె యీపలుకులును
విశేషముగ సొగసు మీఱుప్రసిద్ధమింత.

అలవిభక్తుల పరిణామములను భంగ
మెచటనేని యొక్కెడగగ్గెనేని యచట
నతిశయములేమి నద్దాని యమకమనుచు
స్వీకరింపరు యమక విశేషపరులు.

ఏపదము యమకభూమిక నెక్కవగను
నధివసించుట దుష్టత నందుచుండు
నట్టిదాని ననుప్రాసమనుచు గల్ప
నంబొనర్చుట యంత యుక్తంబుకాదు.

తగునటువిభక్తులు విభక్తమగుట వచన
మునకు గారకమునకును మునుపుతీరు
సుప్తిజంతమ్ములావృత్తి చొఱవగనుట
యిదియు యమకాన నాశ్చర్యమెక్కజేయు.

శేషము సరూపమగునది యనుప్రాసము ౭ సూ.

ఏకార్థము కానిండనేకార్థము కానిండు. స్థాన నియమములేకున్న పదమును నట్టివేయగు నక్షరమును శేషశబ్దార్థము. సరూపము—ప్రయోగింపబడిన యితరముతోడ సమానమగు రూపము కలది. అనుప్రాసము.

అయితే " శేషము అనుప్రాసము " అను సూత్రమొనర్చిన చాలదా? అపుడు మొదటి సూత్రమునుండి "ఆవృత్తమై" యను పదము ఇచటికాకృష్టమై యావృత్తిశేష మనుప్రాసమను నర్థమేర్పడును. అపుడును పైజెప్పిన యర్థమే యనగా "ఏకార్థము కానిండనే కార్థము కానిండు స్థాననియమములేకున్న పదమును నట్టిదేయగు నక్షరమును ననుప్రాసమగును" అనునర్థము సిద్ధించును గదా! ఇక "సరూపమగు నది"యను పదమెందుకు?

నిజమేయగును; కాని మీరునుడివిన తీరునగూడ సారూప్యము ఆవృత్తిశేషమునందు సిద్ధింపకపోదు; కాని సారూప్యమంతటను సిద్ధింపకపోవును. కావున నీవిశేషముకొఱకై యిచట సరూప పదము స్వీకరింపబడినది. ఈవిశేషమేమనగా "ఆవృత్తి సంపూర్ణస్వరూపముతోడనేకాని సారూప్యము మాత్రము సంపూర్ణ స్వరూపముననను, ఏకదేశముననుగూడ నుండవచ్చును".

తీవ్రముకాని వర్ణానుప్రాసము మంచిది ౮ సూ.

అక్షరముల యనుప్రాసము తీవ్రముగాకున్నచో బాగుగానుండును. తీవ్రముగానున్నచో మాత్రము చెవికింపు గొల్పదు.

తీవ్రత కుదాహరణము:—

*సురసరిద్ధరిణ రుగ్వీరదభిద్దరకు భృ
ద్ధరశరచ్చరదర స్ఫురితకీర్తి

*సుర:—ఈపద్యమునువిని వాసిరెడ్డి వెంకటాద్రినాయుడుగారు "రాలదెబ్బ

హరిసఖస్వరుహరిద్ధరి కరోద్ధురభయం
కరశరోత్కర ముఖక్షరదరాతి
సురభికిన్నర కులేశ్వర సుతస్మరమరు
ద్వరజనుస్స్వరుచి సుందరతనుండు
తరణిభూశరదనిర్జర కురుట్సురగవీ
హరసఖామరమణీ వరవితీర్ణి
నృపతిమాత్రుండె యాశ్రిత నివహపద్మ
భానుడై భూరిధీరతా నూనరత్న
సానుడగు వాసిరెడ్డి వంశప్రసిద్ధ
వేంకటాద్రిప్రభుండు రవిప్రభుండు.

ములుగు పాపయారాధ్యుని చాటుధార.

పాదానుప్రాసములు పాదయమకములవలెనే ౧౦ సూ.

పాదయమకములోని ప్రకారములన్నియు బాదానుప్రాసము నందు గూడ నేర్పడును.

ఉదాహరణములు:—

అల్లన గాధిరాజసుతుడర్మిలి మేనక ముద్దొనర్పరా
గిల్లి...........................................
అబ్జముఖీ మనోజనరసాధిప నందన కృష్ణనీయశం
బబ్జకరాబ్జజాబ్జ నయనాబ్జ విలాసము నీపరాక్రమం
బబ్జకరాబ్జజాబ్జనయనాబ్జ విలాసము నీవితీర్ణిమం
బబ్జకరాబ్జజాబ్జనయనాబ్జ విలాసము చిత్రమిద్ధరన్.

భట్టుమూర్తి చాటుధార.

కందుగదయ్య నీమురువు కన్నులపండువుగాగ నంటినా
గందుగదయ్య నీతనువు కౌతుక మొప్పగనీదుప్రాపునే

లను దినవలసివచ్చెగదా! మీచేత కవిగారూ!" యనిపల్కెనట—చాటుపద్యమణి మంజరి.

గందుగదయ్యాయంచు నినుగన్నసవత్నిసహింపవందుబో
కందుగదయ్యాయేల వినవైతివి నావచనంబు పుత్రకా.

సారంగధర చరిత్రము–3 ఆ॥ ౯౯ ప॥

కంజభవాభవచేతో
రంజన భరభంజనాని– రంజనజన జీ
వంజీవకాజవంజవ
సంజీవకచరణనఖర చంద్రమయూఖా.

హరిశ్చంద్ర నలోపాఖ్యానము–౫ ఆ॥ ౭౩ ప॥

త్రిభువన హితమహితకుల
ప్రభవభవార్యాభి నవవిభావిభవభవా
న్యభిమతచారిత్ర సుధా
నుభవభవవారి స్వనామనుతినిరతభవా.

హరిశ్చంద్ర నలోపాఖ్యానము–౨ ఆ॥ ౧౧౬ ప॥

ఉద్ధతహరిణా శరశర
విద్ధఖరఖరత్నకుల–వివృద్ధికరకరా
శ్ర్యద్ధతిహరహర మానస
పద్ధతిచరచరణభజన–భాగ్జనసుకరా.

హరిశ్చంద్ర నలోపాఖ్యానము–౪ ఆ॥ ౭౯ ప॥

నరసింహ కృష్ణరాయల
కరమరుదగు కీర్తియొప్పెకరిభిద్గిరిభిత్
కరికరిభిద్గిరి గిరిభిత్
కరిభిద్గిరిభిత్తురంగ కమనీయంబై.

చాటువు.

న్యాయంబుదప్పని నరపతినరపతి
నరపతిపాలించు నాడునాడు
నాడెతింగినదొర పోడిమి పోడిమి
పోడిమినొబగైన బుధులుబుధులు

బుధులుసంభావించు పురుషుండుపురుషుండు
పురుషోత్తమునిమీది బుద్ధిబుద్ధి
బుద్ధిమంతునకైన పుణ్యంబుపుణ్యంబు
పుణ్యలక్షణమైన పొలతిపొలతి
పొలతియట్టిదకలవాని కలిమికలిమి
కలిమిచలమని తెలసిన తెలివితెలివి
భానునిభతేజ లక్కమాంబాతనూజ
మనుజమందార సింగన మంత్రిమాచ.

చాటుధార.

రెండక్షరముల యనుప్రాసమున కుదాహరణము:—

తళతళమను పతాకలతోడ రవికాంతి
దలతలమనెడు రత్నములతోడ

* * *

(చూ. ౫౭. పే)

మానినీమన్మథు మాధవుగానరే
సలలితోదార వత్సకములార
సలలితోదార వత్సకవైరిగానరే
సురభిపాదప లతార్జునము
లార। సురభిపాదపలతార్జున
భంజుగానరే ఘనతరల సదశో
కంబులార। ఘనతరల సదశోక
స్ఫూర్తిగానరే నవ్యరుచిరకాంచనం
బులార। నవ్యరుచిరకాంచనకిరీటు
గానరే గహన పదవికురవకంబు
లార। గహన పదవికురవకనివాసి
గానరే గణికలార చారుగణికలార.

* * *

ఇట్టిముక్త పదగ్రస్త యమకమువలెనే ముక్తపదగ్రస్తాను ప్రాసముకూడ గలదు.

ఉదాహరణము :—

కలితధర్మజ్ఞాన ఘనిధర్మజుడుగాని
పరభయంకర భుజాబలములేదు
పరభయంకర భుజాబలుడు భీముడుగాని
వివిధాస్త్రశస్త్ర కోవిదతలేదు
వివిధాస్త్రశస్త్ర కోవిదుడర్జునుడుగాని
సతతదానకళాభి రతియులేదు
సతతదానకళాభి రతుడుకర్ణుడుగాని
వరవంశ సంగతత్వంబులేదు
అనుచుధర్మజభీమార్జు నార్కసుతుల
బరిహసింతువు ఘనధర్మ బాహుసత్వ
శస్త్రపటిమవితీర్ణి భాస్వత్కులముల
గురుతరాటోపజూపల్లి గోపభూప.

ఇంకొకటి

గర్వితద్విట్క్రౌంచ గాంగేయ గాంగేయ
ఘనవైరి భేకదృక్కర్ణగర్ణ
నిష్ఠురశాత్రవానీక నిష్కృపకృప
దుర్గిటీతారితనుకృత ద్రోణుద్రోణు
భయరహితారాతి భయదత్తుభగదత్తు
జండపరామిష శకునిశకుని
లక్ష్యజితేంద్రజిల్లక్ష్మణులక్ష్మణు
సకుటిలరిపు మనశ్శల్యుశ్శల్యు
అహితధూమకేతు నహి కేతునాత్మీయ
విశిఖవృష్టిచేత బెగడుపఱచి

పసులగ్రగమ్మరించె బ్రతిభసహస్రబా
హార్జునుండు నైన యర్జునుండు.

భారత చాటువు.

ఇట్లే యితరప్రకారముల గ్రహించునది.

ఇది ఆంధ్రకావ్యాలంకార సూత్రవృత్తియందు
ఆలంకారికమను నాలవ యధికరణమున
మొదటియధ్యాయము ముగిసినది.



•

ఆలంకారికాధికరణమున
రెండవ యధ్యాయము.

ఇపుడర్థాలంకారముల ప్రసంగము. వానికి మూలముపమయే కావున నదియే మొదట విచారింపబడుచున్నది.

ఉపమానముతో నుపమేయమునకు గుణలేశమున
సామ్యముపమ ౧ సూ.

గుణాధికమగు దేనితోడిసాదృశ్య మొకదానికి గొని రాబడునో యది ఉపమానము. హీనగుణమగు దేనికి సాదృశ్యము సంపాదింపబడునో యది ఉపమేయము, ఈ నిరూపింపబడిన యుపమానోపమేయములకు గుణైకదేశమున సామ్యమేయుపమ. "అయితే ఉపమానము నుపమేయము నను నివిరెండును నొకదాని కొకటి నియత సంబంధములగు శబ్దములుకదా; వానిలో నేయొకదానిని చెప్పినను రెండవది సిద్ధించును. చూడుడు *"ఉపమితం వ్యాఘ్రాదిభిస్సామాన్యా ప్రయోగే" అను పాణిని సూత్రము. ఇచట "ఉపమితం" అని యొకదానిని మాత్రమే చెప్పెనుగాని ఉపమాన పదమును స్వీకరింపలేదు. అట్లే యిచటగూడ నుభయ గ్రహణము కూడదు." అనిన;

నిజమే; కాని లోకప్రసిద్ధిని స్వీకరించుదలంపుతో నిచట నుభయ గ్రహణ మొనర్పబడినది. అనగా దీనిభావమిది. లోకముననేవి ఉపమానముగను నుపమేయముగను ప్రసిద్ధములో వాటినే యుపమాలం

---

* ఉపమితం...'సామాన్యధర్మము ప్రయోగింపబడనపుడు వ్యాఘ్రాది పదములతో బోల్పబడిన వస్తువును చెప్పు పదము సమాసము చేయనగు'నని యీసూత్రమున కర్థము. ఇచట నొక్క యుపమేయమునే'ఉపమితం' అనిపాణిని చెప్పెను. కాని ఉపమానమును చెప్పలేదు. ఎందువలననగా; ఉపమేయమును చెప్పుటవల్లనే యుపమానముకూడ స్ఫురించును.

కారమున గ్రహింపదగును. తదితరములను గ్రహింపదగదు. "మొగము * కమలమును బోలును" అనునట్లు "కలువను బోలు"నని యనరాదు.

ఎక్కువగుణములవలన గల్పితయును ౨ సూ.

ఎక్కువ గుణములనగా చాలగుణములు. వాని మూలమున నుపమానోపమేయములకు బోలిక యొదవినచో నచట గల్పితోపమ. దీనిని కవులు కల్పించిరి కావున కల్పితోపమ. వెనుకటిది లౌకికి యగునుపమ.

"కల్పితమగు సామ్యమునకు లోకప్రసిద్ధి లేనందున నిదియే యుపమానము నిదియే యుపమేయమను నియమమేర్పడు" ననిన గుణ బాహుళ్యపు ♦ టెక్కువతక్కువల ననుసరించి నియమమేర్పడును.

ఎట్లనగా;

హూణయువతి జూలాల్రిబియుండు
గాటముగ గవుంగిట బొదవినభుగ్న
మున్నతస్తనంపు నివేశముదారి
నిందుబింబము కఠోర బిసకాండ పింగ
గౌరకరములను వెలువరచెను హరిపదమ్ము.
అపుడు నున్నగ గొరిగిన యట్టిమత్త
హూణచిబుకమ్మునారంగ మొగిహసించు.
నవకుశసూచి నవ్వశ్రవణంపుశిరీషము........

* కమలమునుబోలును_ఇచట వామనుడు మొగమునకు కలువ నుపమానముగా జెప్పదగదనెను. కాని ధ్వన్యాలోక వ్యాఖ్యానమున నభినవ గుప్తపాదుడు 'ఉపోఢ రాగేణ విలోలతారకం' అను శ్లోకవ్యాఖ్యానావసరమున 'వదన కోకనదంచ' అని వ్రాసెను. రక్తోత్పలంకోకనదం అనియమరుడు.

♦ ఎక్కువతక్కువల ననుసరించి...అనగా ఎక్కువగుణములున్నది యుపమానము, తక్కువగుణములు గలది యుపమేయము అని నియమమేర్పడునని భావము.

అరవిందురు డెందములో
జారజారివెలుంగు తోకచుక్కయపోలెన్
నరకుండేసిన బాణము
హరినిటలతటంబు నాటియల్లలనాడెన్.

ఉత్తరహరివంశము.

ఉమ్మెత్తపువ్వంటి యురపైన కుచ్చెళ్ల
చెరగుమట్టెలమీద జిందుత్రొక్క
.... .... .... .... .... .... .... ....

సారంగధరచరిత్రము.

పదార్థవాక్యార్థముల నుండుటవలన నది రెండువిధములు ౩ సూ.

**పదార్థమునసుండు నుపమకు నుదాహరణము :—**

* ఉమ్మెత్తపువ్వంటి యురపైనకుచ్చెళ్ల
చెరగుమట్టెలమీద జిందుత్రొక్క
మెలపైనవలరాజు మేడపై బంగారు
కుండలోయనగుల్కు గుబ్బలారయ
నెమ్మోముఱేరాజు సమ్ముఖమ్మునగ్రమ్మ
కమ్మపంజుల మెరుంగెమ్మెనెరప
భోగినీమణిగాన బొందుసేయగవచ్చు
నీలాహియనవేణి నీటుసూప
సైకతనితంబ మొకవింత చలనమొంద
నలతిలేనడు మల్లల నాడుచుండ
నవనినిదిగాక యొయ్యారమద్దిరయని
యెంచనటనాతివచ్చె రాయంచనటన.

సారంగధరచరిత్రము.

* ఉమ్మెత్తపువ్వంటి...ఈపద్యము మొదటిపాదమున మాత్రము కల్పితోపమ యున్నను, మిగిలిన యంతట నుపమలును లోకసిద్ధములే.

* క్రేగంటిచూపున గెరగొన్న సన్నగే
దంగిరేకుల కన్నదమ్ములగుచు
జడకొప్పులోను నచ్చపు సజ్జికములైన
విరవాదులకు వింతవిందులగుచు
బిగువుజన్నులమీద బెనుపడంబైన చెం
గలువ కావిరుల సంగడములగుచు
గేలికిహారివైవ గేలదాలిచిన సంపగి
బంతికొనల జోహాపలగుచు
వేగ నరకాసురుండేయు వేగిరంపు
బాణముల బ్రాణములు సత్యభామమేన
గుసుమశృంగారములకెల్ల గ్రొత్తసేయ
నెనిమిది తెరంగులై సొబగినుమడించె.

ఉత్తరహరివంశము_౧ ఆ. ౧౫౧ ప.

వాక్యార్థమునందుండు నుపమకుదాహరణములు :—

మాగుబారిన చంద్రమండలంబునుబోలె
వదనారవిందంబు వన్నెదరుగ
మకరందముననిండు మధుకరంబులఁబోలె
నేత్రోత్పలంబులు నీరుదేర
నెఱిదప్పివ్రాలిన నీలమేఘమువోలె
గచభారబర్హామగ్గలమువీడ
దొడగిజాలజలించు దొండంపు కవవోలె
నూరు రంభాస్తంభయుగము వడక

* ఈపద్యమున నుపమలు చాలవరకు కల్పితములు. ఇట్లేవాక్యార్థవృత్త్యుపమల యుదాహరణములనుగూడ గ్రహించునది. మరియు నాయుదాహరణములలో రెండవ దానియందు పదార్థవృత్తియగు నుపమ విశేష్యముగాను, రెండవ యుపమ విధేయముగాను కలసియుండి చమత్కార విశేషమును కల్పించును.

గడకలేనితనూవల్లి ఘర్మజలము
దళముగా జిందజెందని తాల్మితోడ
వగపుచిత్తరువో కళవళపు గరువొ
యనగనొకకాంత గానంగనయ్యెనంత.

ఉత్తరహరివంశము—౧ ఆ. ౧౭౮ ప.

అరచందురు డెందములో
జొరబారివణంకు తోకచుక్కయపోలెన్
నరకుండేసిన బాణము
హరినిటలతటంబు నాటి యల్లలనాడెన్.

ఉత్తరహరివంశము—౧ ఆ. ౧౫౩.

అదిపూర్ణయు లుప్తయును ౪ సూ.

ఆయుపమ పూర్ణయు లుప్తయు నగును.

గుణము, ద్యోతకము, ఉపమానము, నుపమేయములదెలుపు

శబ్దములు సమగ్రముగానున్న బూర్ణ ౫ సూ.

గుణము—ఉపమానోపమేయములకు సాధారణమగు ధర్మము. ద్యోతకము—పోలికను దెలుపు (వలె, పోలె) విత్యాదులు. ఉదాహరణము:—

"ఈమొగముజలజమువలె నింపుమిగులు"

లోపించిన లుప్త ౬ సూ.

పైజెప్పిన శబ్దములు (గుణాదివాచక పదములు) తగ్గినచోలుప్త యగును.

గుణవాచకశబ్దము తగ్గుట కుదాహరణము—"చందమామ వంటి బిడ్డ".

ద్యోతకశబ్దము తగ్గుటకుదాహరణము:—"గరికపచ్చనిదీమె" లేక, "చివురుమెత్తనయొడలు మీచెలియకొప్పు".
పైరెండు పదములు తగ్గుటకుదాహరణము:—"చివురుబోడి"

ఉపమానోపమేయలోపముపమాప్రపంచమున * జూడనగును.
స్తుతిని, నిందను, స్వరూపమును తెలుపుటను ౭ సూ.
పైయుపమకే జెప్పిన విషయముల నుపయోగము.

స్తుతినిందల కుదాహరణము:—

ముసలాపె వ్రేలు జన్నుల
పసవంటిది లోభివాని బ్రతుకు ధరిత్రిన్
పసిబాల వయసువంటిది
రసికునిజీవనము మంత్రిరాయనిబాచా.

స్వరూపమును దెలుపుటకుదాహరణము:—

ఆకసమ్మున జిక్కుల యంతరమున
శకటమై ఖరియున్న నక్షత్రసమితి
సన్నివేశమ్ముగురితించు మన్నయదియె
రోహిణీనక్షత్రమన్ రూఢినొందు.

తక్కువ, ఎక్కువ, లింగవచనములు వేరగుట, పోలిక కుదురకుండుట
అసలే లేకపోవుటయు దానిదోషములు ౮ సూ.

ఇవి యారు నుపమాదోషములు. వీనిని గ్రమముగా వివరించుచున్నాడు.

* జూడనగును — విభావన, రెండవరకమగు నాక్షేపము, అనన్వయము, యీ మూడింటియందు నుపమానలోపము. సమాసోక్తి, వక్రోక్తి, వ్యాజోక్తి, వీనియందుపమేయలోపము. అప్రస్తుత ప్రశంసయందుగూడ నుపమేయలోపమున్నదికాని లింగ మాత్రమున గొంచెము జెప్పబడును కావున సమాసోక్త్యాదులలో జేర్పలేదు. ఉపమాప్రపంచము నందంతటను 'వలె' శబ్దమునకు లోపముండును. ఒకయుత్ప్రేక్షయందు మాత్రమెొకప్పుడది యుండినను అధ్యవసాయమును బోధించునుకాని సామ్యమును బోధింపదు. ఇకసమాహితమునందన్ననో నిజముగానది ముమ్మూర్తులనుపమయే. కాని యొకవిశేషము (చివరకుపమేయ ముపమానరూపమున నేర్పడుటయనునది) న్నది గావున వేరుపేరు పెట్టబడినది.

జాతిప్రమాణధర్మములలో నుపమానము
తక్కువగుట తక్కువ ౯ సూ.

జాతిలోను ప్రమాణములోను ధర్మములోను దక్కువయగు దానితో నెక్కువ యగు దానిని బోల్చుటవలన నుపమకు తక్కువ దనమేర్పడును. ఇట్లే మిగిలిన విషయముల గ్రహింపవలయును.

జాతిలో తక్కువ కుదాహరణము:—

"మీరుచండాలులంబోలి మిగుల సాహస మ్మొనర్చిరి."

ప్రమాణములో తక్కువ కుదాహరణము:—

"....భానుండుజ్వలనకణముబోలె
వెలుగొందుచున్నాడు పొలతిచూడు."

ధర్మములో తక్కువ కుదాహరణము:—

లేడితోలును వస్త్రంబు లీలగట్టి
మౌంజి మొలతాడుగా నమర్చియిదెమౌని
నీలజీమూత మొకయెడనిలచి యంటి
కొన్నభానుని పోలిక కొమరుమిగులు.

ఇచ్చట మౌంజికి బ్రతివస్తువు మెరుపు చెప్పబడలేదు గావున నుపమకు ధర్మములలో దక్కువ దనమేర్పడినది. లేడితోలునకు మాత్రమే పోలిక చెప్పిరనుకొందమనిన వర్ణితమగు మౌంజికి ప్రయోజనములేక వ్యర్థము కావలసివచ్చును. నీలజీమూతమనుటలోనే మెరుపునుగూడజెప్పినట్లయిననదనిన నది నియతముగాదు. నియతమగుచో నది తప్పక చెప్పినట్లే యగును. స్ఫురించునపుడది యెవ్వరు కాదన గలరు? అదియే చెప్పుచున్నాడు,

రెండు ధర్మములలో నొకటి జెప్పినపుడు రెండవది సాహచర్యము
ననుసరించి స్ఫురించును ౧౦ సూ.

ఎప్పుడును గూడనుండునట్లు ప్రసిద్ధములగు రెండుధర్మములోనే యొక్క ధర్మమును జెప్పినను రెండవ ధర్మము తప్పక ప్రతీతి పన్నమగును. రెండును కూడనుండుటయే యిచట హేతువు.

**ఉదాహరణము:—**

వెన్నెలవలె గర్పూరపు
దిన్నెలవలె నీదుకీర్తి దిగ్దేశములం
దౌన్నత్యంబున వెలసెను
విన్నావా వాసిరెడ్డి వెంకటనృపతీ,

ఇచట వెన్నెలకును, గర్పూరపు దిన్నెలకు నున్నత స్థితితోబాటు శైత్యసముజ్జృంభణముగూడ నుండునుగావున నౌన్నత్యమును జెప్పినతో డనేశైత్యసముజ్జృంభణముకూడ దెలియవచ్చును. ఇందువలన "కనక ఫలక చతురశ్రము శ్రోణిబింబము." అనునది వివరించినట్లయినది. కనకఫలకమున చదరమును గౌరవర్ణమును సహవృత్తులగుట చదరమును జెప్పిన వెంటనే గౌరవర్ణ మెఱుకవడును.

**ఉపమానములకు ధర్మము తగ్గుట దోషమగుచో,**

సూర్యాంశు సమ్మీలితలోచనేషు దీనేషుపద్మానిలనిర్మదేషు సాధ్వ్యఃస్వగేహేష్వివభర్తృహీనాః కేకావినేశుఃశిఖినాంముఖేషు"

అనుప్రయోగ మెట్లు కుదురును? ఇచట నుపమానముకన్న నుపమేయమునకు ధర్మబాహుళ్యమున్నది గదా?" యనిన నిచట * విశిష్టములగు ముఖములే యుపమేయములు. వానియందే కదా

* విశిష్టములగు:—ఇచట ముఖవిశేషణములగు లోచనసమ్మీలన, పద్మానిల నిర్మదత్వములు సాధారణధర్మమగు దీనత్వమును స్ఫుటముగా తెలియ జేయుటకై ప్రయోగింపబడినవే గాని యుపమేయ మందాధిక్యమును తెలియజేయుటకుగాదని తాత్పర్యము.

కేకలు నటించుచు సంభ్రమించుచు; కాన నుపమేయమునందు ధర్మ బాహుళ్యము లేదని ప్రైస్రయోగమునకు సాధుత్వముపపన్న మగును.

దానిచే నెక్కువ నిరసింపబడినది ౧౧ సూ.

అనగా; జాతిలోను, ప్రమాణములోను, ధర్మములలోను, నుపమానము నధికముగా జెప్పునపుడెక్కువ యనుదోష మేర్పడునని భావము.

జాతిలో నెక్కువ కుదాహరణము :— రుద్రులుమహారాజులన భృత్యులు చౌరదగును.

ప్రమాణములోనెక్కువ కుదాహరణము :—

చెలియ పొక్కిలి పాతాల తులనకుచము
లల్లక్షితిధరముల పోల్కినందుచుండ
యలకళింద సుతాపాత మట్లువేణి
భరము నీలంపుకాంతుల బర్వజేసె.

ధర్మములలో నెక్కువ కుదాహరణము :—

రశ్మిచంచలమైన చక్రంబుదాల్చి
దేవుడు మురాసురారాతి తేజరిల్లు
బాడబాగ్నియు సుడియు నొప్పార వాహి
నీ మహానాయకుడు తేజు నెగడునట్లు

ఇచట బాడబాగ్నికి బ్రతివస్తువుపమేయమగు మురాసురారాతి యందు వేరొకటి చెప్పలేదు. కావున నెక్కువ యనుదోషము. ఈ రెండు దోషములలోనే విపర్యయమనుదోషమంతర్భవించును గావున నది వేరుగా స్వీకరింపలేదు. ఇట్లు మామతమున నాఱే దోషములు.

ఉపమానోపమేయముల లింగవ్యత్యాసము లింగభేదము ౧౨ సూ.

ఉపమానపు లింగమును నుపమేయపు లింగమును వేఱగుట లింగభేదమను దోషము.

ఉదాహరణములు :—

"సైన్యములు నదుల పోలిక జనిమె సరగ"

పున్నపుంసక లింగములకు దఱచుగా నభిమతము ౧౩ సూ.

పున్నపుంసకములగు నుపమానోపమేయములకు లింగభేదమభిమతమే. లింగభేదమున్నను దఱచుగా బున్నపుంసకలింగముల కుపమానోపమేయ భావమభిమతమే. దోషముకాదని భావము.

ఉదాహరణము :—

"మొగము గన్గొంద్రు జంద్రుని పోల్కినెపుడు"
"చంద్రుడుంబోలె వదనమ్మెసంగుచుండు"

లౌకికియందును, సమాసోక్తియందును,
నుపమాప్రపంచమందును ౧౪ సూ.

లౌకికియగు నుపమయందును, సమాసమున నుడువబడు నుపమయందును, నుపమా ప్రపంచమునందును బ్రాయికముగా లింగభేదమభిమతమే.

లౌకికియందు లింగభేదమున కుదాహరణము :—

"అతడామెకు దోడునీడై చరించు"
"ఈమెమొగవానిపోలిక నెపుడునుండు"

సమాసోక్తియందు లింగభేదమున కుదాహరణము :—

"భుజలతవినీల కువలయ విజయినియగు"

ఉపమాప్రపంచమున లింగభేదమున కుదాహరణము:—

వరబింబాధరమున్ పయోధరములున్ వక్రాలకంబుల్ మనో
హరలోలాక్షులు చూపకవ్వలి మొగంబైనంత నేమాయె నీ
గురుభాస్వజ్జఘనంబు క్రొమ్ముడియు మాకుంజాలవో గంగకి
ద్దరికేడద్దరి మేలనంగలదె యుద్యద్రాజ బింబాననా.

రామలింగని చాటుధార.

ఈతీరుగా నితర ప్రయోగ సమూహమునుగూడ గ్రహించునది.

దానిచే వచనము వేఱగుట వివరింపబడినది ౧౫ సూ.

దానిచే-లింగము వేఱగుటచేత.

ఉదాహరణము:—

*మధుపమలరునుబోలె నామంజులాస్య
లోచనమ్ముల దమినిగ్రోలుదును నేను॥

ఇంకొకటి

సరసుల్ కాంతల గుబ్బచంటికవతో సాటింగుబాళింప న
బ్బురపుంజాయల నిమ్మపండుచెలగున్ మోదానుసంధాయియై.

తిరుపతి వేంకటకవులు.

ప్రతీతములుకాని గుణములతోపోలిక,
పోలికకుదురకుండుట ౧౬ సూ.

ప్రతీతములు కానివనగా సహృదయుల మనసున కెక్కనివి.

---

* మధుపము:—ఈయుదాహరణమున 'గ్రోలుదును' అను నేకవచనముండుట వలన వచనభేదదోషము ప్రసక్తించినదనియు 'గ్రోలుదుము' అని యుండవలయునని దిప్పేంద్రభూపాలుడు వ్రాసెను. కాని యది సరికాదు. ఉపమానోపమేయములగు మధుపవక్తలకు ఏకత్వము విరుద్ధముకాదు కావున 'గ్రోలుదును' అను నేకవచనమున దోషము లేశమేనియు సంభవింపబోదు. ఇందలి తత్త్వమిది. "లోచనములు" అను నుపమేయమునద్వివచనమున్నది. ఇకనుపమానమగు 'అలరు' నందేకవచనమున్నది. కావున వచనభేదము ప్రాప్తించును. రెండవచోట 'గుబ్బచంటికవతో' అనగా స్తనములు రెండింటితో నొక నిమ్మపండు పోల్పబడినది. అచటను వచనభేద మను దోషమే.

అట్టి గుణములతోడి పోలిక నిరూపించినను నదిపోలిక లేనట్లేపర్య వసించును.

ఉదాహరణము:—

"అరుదగుకావ్యచంద్రువితతార్థమయూఖునిగూర్పకూర్చెదన్"

కావ్యమునకిట జంద్రునితోడి పోలిక ప్రతీతములు కాని గుణములతో నేర్పడవలసినదే. "అర్థములకు మయూఖములతోడి పోలిక యేర్పడగనే కావ్యమునకును జంద్రునకును పోలిక యేర్పడును గనుక నిచట పైదోష మెట్లుపపన్నమగును" అనిన అర్థములకును మయూఖములకును సాదృశ్య సాధకముగా ప్రతీతమగు గుణమేమియు లేనందున కావ్యమునకు జంద్రుని పోలిక యేర్పడిననే యర్థములకు మయూఖముల తోడి యుపమ కుదురును. గాననీతీరున నిచట నన్యోన్యాశ్రయ దోషము దాటరాకుండ నున్నది.

పోలిక కుదురమి నుపమయు దన్నిష్ఠలగు కవులును
బాడగుదురు ౧౭ సూ.

తన్నిష్ఠలు అట్టి యుపమ నవలంబించువారు.

ఉపమానముల *యాధిక్యమున నదితొలగునని కొందరు ౧౮ సూ.

---

* ఆధిక్యము:—ఈయాధిక్యమొక్క యుపమస్థలముననేకాదు. రూపకాదులందుగూడ గలదు. అదియొక్కొక్కపుడుల్లేఖాలంకారముగా బరిణమించి విశేషాధాయకమగును. ఒక్కొక్కపుడట్లుపయోగింపకముందు సూత్రమున జెప్పినట్లు అపుష్టార్థమగును. క్రమముగా నుదాహరింతుము.

ఆకులవ్రాలువ్రాయ సచివాగ్రణి బాచనకేఘటిల్లు బ
ల్గాకి కుమంత్రినందనులు గంటము ముట్టిలిఖించినట్టి వ్రా
లాకులు రాటపాకులు చెవాకులు బ్రాహ్మణవీధిలోని పు
ల్లాకులు లంజెలిండ్ల బలుగాకులు గాక నిజానికాకులే.

కాసరకూసరై మిగుల గందరగోళపు మూలమై రసా
భాసపు హేతువై వికటపద్ధతియై శిగపట్లగోత్రమై
దాసరిపాటయై జెహరదారనచేసిన యగ్రహార మా
కాశముముట్టితోకతెగి గాడిదవాలకమయ్యె జూడగాన్.

అది=పోలిక కుదురకుండుట. తొలగునని కొందరనుకొందురు; ఎట్లన:

"కాండాపిర్షవఖండ ఘూపరివృఢగ్రైవేయ హైలేయ సూ
కాండాటాధిప కేతుమాతుల బలాకాక్షప్రసంతీమరు
త్కాండా ఖండలతుండి పాండురయశఃకర్పూరపేటీభవ
త్కాండా! రాయనిమంత్రిభాస్కరునికొండా! దండధారాగ్రణీ.

ఇటననేకములగు నుపమానములచే బోలికబాగుగా స్థాపితమగును. అనియన్నియు నెక్కువతెల్లనేకదా:

అపుష్టార్థము కావున నది సరికాదు ౧౫ సూ.

అపుష్టార్థము కావున నుపమానముల యాధిక్యము పైదోషమును దొలగించునదికాదు. ఒక యుపమానమును బ్రయోగించినపిమ్మట మతొకదానిని బ్రయోగించుటలో నర్థవిశేషమేమియు బోధింపబడదు. దీనిచే "*బలసింధువు సింధువువలె బలమతి కలగెన్" అనునది నిరాకృతమైనది. ఇచట "సింధు" శబ్దము రెండు సారులు బ్రయోగింపబడినను నర్థవిశేషమున్నందున బౌనరుక్త్య దోషము సంభవింపదు. ఆయర్థము నందలి విశేషమేమన:—వైపుల్యమువలన బలము సింధువు వంటిది. కలగుటవలన బలసింధువునకు సింధుసామ్యము కుదురుననుట. కాని యర్థమునకుమాత్రము పుష్టిలేదు. ఎట్లనగా; "సింధువువలె కలగెన్" అనుటలోనేబలము విపులమని దెలియవచ్చును. ఇదివరకు చెప్పబడినది

* బలసింధువు:—ఈన్యాయముచే "మాసుపాటిన చంద్రమండలంబును బోలె వదనారవిందంబు వన్నెదఱుగ" అను వాక్యార్థవృత్త్యుపమోదాహరణమున 'వదనారవిందమ్ము' అనుచోట నుపమానముకూడ 'అపుష్టార్థము' అను నాశంక చాలమందికి పొడగట్టవచ్చును. కాని నిజమున కచట నపుష్టార్థము లేదు. ఏమనగా; అచట వాక్యార్థవృత్త్యుపమకును పదార్థవృత్త్యుపమకును విరోధమును స్ఫురింప జేయుటకై రెండుపమలను కవి ప్రయోగించెను. చంద్రుడువచ్చినపు డరవిందమెట్లు కళాహీనముగా నుండునో యట్టితీరు ప్రకృతమున దోచుట కవ్యభిమతము. ఇదేతీరు నాల్గవ వరణమున గూడ నున్నది. "తొడగిచాలజలించు తొండంపుగవబోలె నూరురంభాస్తంభయుగమువడక" యనుచోట "ఏనుగులతొండములజూచి యరటిచెట్లు వడకునట్లు భూమిదేవి యూరుయుగము వడకుచున్నది." యను విశేషద్యోతనము నభిలషించి రెండుపమానములు ప్రయోగింపబడినవి. ఇట్లు రెండు పాదములందుండుటవలన

గదా; "రెండు ధర్మములలో నొకటి చెప్పినపుడు రెండవది సాహచర్యము ననుసరించి స్ఫురించును" అని.

అనుపపత్తి యసలే లేకపోవుట ౨౦ సూ.

అనుపపత్తి = అసలుపమానవస్తువే పొసగకపోవుట.

ఉదాహరణము :—

హర్షవికసితమైన యాయతివ వదన
మందు జిరునవ్వు చాయదానలరుచుండు
బాగుగా వికసించిన పద్మమధ్య
మందు జిక్కనివెన్నెల యలరునట్లు.

పైపద్యమున వెన్నెలలో పద్మము వికసించుట యనునదియసలే పొసగదు. అయిన నిది అర్థవిరోధముకానిండు ఉపమా దోషమును గాగణింపనేల? యనిన నిచట నుపమ యందతిశయమభిలషితముగదా? అట్లయిన నికనది దోషమగుటెట్లనిన చెప్పుచున్నాడు.

విరుద్ధమగు నతిశయము కూడదు. ౨౦ సూ.

విరుద్ధమగు నతిశయమును గూర్చుట యయుక్తమని సూత్రము యొక్కభావము.

పై నిరూపించిన యుపమాదోషముల నారింటినెఱిగి చేరకుండ విడువవలెను.

ఇయ్యది ఆంధ్రి కావ్యాలంకార సూత్రవృత్తియందు
నాలవ యధికరణమున రెండవ
యధ్యాయము ముగిసినది.

---

పైనవ్రాసిన యభిప్రాయము కవికి కలదనియు మేము మాయంతట గవియెఱుగ కుండ నతనికి లేని యభిప్రాయమును కల్పింపలేదనియు సహృదయుల మనసునకు తోచవచ్చును. ఇక రెండు మూడు పాదములలో కలువలలో దుమ్మెదలున్నట్లు గాను, నీల మేఘదర్శనమున నెమిలి పురి విప్పియాడడమును, ఆనుగుణ్యముచేత దోచుటకై పదార్థవృత్త్యుపములు రెండు ప్రయోగింపబడినవి. ఈతీరున నర్థవిశేషము సంపాదించి. పరిష్కృతార్థమునకు బోషకములు గావున నీయుపమానము లేవియు నపుష్టార్థదోషగ్రస్తములు కావు.

## సాదృశ్యాధికరణమున
## మూడవ యధ్యాయము.

ఇపుడుపమాప్రపంచము విచారింపబడును. సరియే, అసలుపమా ప్రపంచమననేది? యనగా జెప్పుచున్నాడు.

ప్రతివస్తుప్రభృతి మొదలగునది యుపమాప్రపంచము ౧ సూ.

ప్రతివస్తువు మొదలుకొని యికముందు నిరూపింపబోవు నలంకారములన్నియు నుపమాప్రపంచమనబడును.

ఇపుడు వాక్యార్థోపమకును బ్రతివస్తూపమకును భేదమును జూపుచున్నాడు.

ఉపమేయమునుడివి సమానవస్తువు నిడుట ప్రతివస్తువు ౨ సూ.

సమానవస్తువనగా దుల్యమగు వాక్యార్థము, ఉపమేయమనగా నిపు *డర్థవశమున వాక్యార్థమే, అది నుడువబడగా దానితో దుల్యమగు వాక్యార్థమును జెప్పుట ప్రతివస్తువు, ఈ యలంకారమున రెండు వాక్యార్థములుండును. వాక్యార్థోపమయందొకటియే యుండునుఇదియే యీ రెంటికిని భేదము.

ఉదాహరణము:—

రంజనచేడి పాండవులరి
భంజనులై విరటుగొల్వ బాల్పడిరకటా

---

* అర్థవశమున:— ఉపమానము వాక్యార్థముగా నంగీకరించుటవలన నిక యుపమేయముకూడ వాక్యార్థమే కావలయునుగాని పదార్థముమాత్రము కాజాలదని యర్థతస్సిద్ధము.

♦ ఒకటియే:— ఉపమను సిద్ధింపజేయు వాక్యార్థమొక్కటియే యని తెలియవలయును తేనిచో. వాక్యార్థోపమాస్థలములయందుగూడ (మాగుపాటిన చంద్రమండలంబు... వన్నెదఱుగ నిత్యాదులు) వాక్యార్థద్వయ మున్నది. కావున బ్రతివస్తువు కావలసివచ్చును.

సంజయ! వినిపేమందును
కుంజరయూథంబు దోమ కుత్తుకఁజొచ్చెన్.

సమస్యాపూరణము—తెనాలి రామలింగకవి.

ప్రతివస్తూపమకు వ్యతిరేకమునకుదాహరణము:—

వేయిచేతులిచ్చి వెట్టిఁజేసినకాలి
బాణుజెఱుపదలచి ఖండనంబు
గలుగఁజేసెనింక వెలుగు చేన్మోసిన
గాచువారలెందు గలరెజగతి.

ఉత్తరహరివంశము—౫ అ. ౮ ౨ ప.

ప్రతివస్తువునకన్న సమాసోక్తి వేరగుటను జూపుచున్నాడు.

నుడువకున్న సమాసోక్తి ౩ సూ.

ఉపమేయము నుడువక సమానవస్తువునిడుట సమాసోక్తి. సమాసమనగా సంక్షేపము, అట్లు చెప్పుట గావున సమాసోక్తి.

ఉదాహరణము:—

వారకయాశ్వరుండు తలపై ధరియించిన యంతమాత్రన
వ్వారిజవైరితోడ సరివత్తువె యుమ్మెతపూవ నీపసన్!
వారిధులుబ్బునోదెసలు వన్నెలుదేఱునొ చంద్రకాంతముల్
నీరవునో చకోరముల నెవ్వగదీరునొ తాపమాఱునో.

సమాసోక్తికన్న నప్రస్తుతప్రశంసవేఱని చూపుచున్నాడు.

కొంచెము నుడివిన నప్రస్తుతప్రశంస ౪ సూ.

ఉపమేయమును లింగమాత్రముచే జెప్పుట కొంచెము నుడువుట. అట్లునుడువుచు సమానవాక్యార్థమును జెప్పినచో నప్రస్తుత ప్రశంస యగును.

మెఱుగుశృంగములందు మెదలకయున్నవి
నీలమేఘంబులు నీరజాస్య
వెన్నెలవులుగులువేకువ చంద్రుపై
తేలుచున్నవిచూడు తియ్యబోడి

మించునాగడపలు మెల్లమెల్లనవిచ్చి
కానరావయ్యె శోకలువ కంటి
పారిజాతప్రసిగ బహువర్ణ పుష్ప భా
రంబు వోయగరేదు కంబుకంఠి
యనుచు దమలోన గర్వోక్తులాడుకొనుచు
దనకు నుపచారములు సేయు ననుగుచెలుల
జూచినవ్వుచు సహజన్యచూతనొప్పు
జారుసౌహార్దలక్షణ సహితయగుచు.

మదనసేనము-నంది మల్లయ.

"మెఱుగుశృంగములందు నీలమేఘంబులు, వెన్నెల పులుగులు వేకువచంద్రుపై" అనియునిట్లే కదమ రెండు చరణములందు గూడ నప్రస్తుతమగు నర్థమును బ్రశంసించుట యప్రస్తుతప్రశంస.

అపహ్నుతి దానికన్న వేరనుచున్నాడు.

సమమగువస్తువుచే నితరమునపలపించుట యపహ్నుతి ౫ సూ.

తుల్యమగు వాక్యారముచే మరియొక వాక్యార్థమును దిరస్కరించుట యపహ్నుతి.

విషమాస్త్రునకువేరు విండులుగలవెట్టు ?
బొలతుక నెలవంక బొమలకాక
యంగజునకువేఱ యమ్ములుగలవెట్టు ?
తనుమధ్యలోల నేత్రములకాక
శంబరారికివేఱ చక్రంబుగలదెట్టు ?
బింబోష్ఠిపృథుజఘనంబకాక
చిత్తజునకువేఱ చిగురెల్లికలదెట్టు
ధవళాక్షియధర పల్లవముగాక
కాయజునకువేఱ కవదొనల్ గలవెట్టు ?
తోయజాస్య పిన్నతొడలకాక

భావజునకువేఱ పాపమ్ముగలదెట్టు ?
తరుణికేలగాక ధరణినాథ.

అథవా;

చంద్రమండలములే జలజాతములుకాక
కాకున్న నలుతేల కాపులుండు ?
నెలదమ్మితూడులే యలరుతీగెలుగాక
కాకున్న నీకోరకములు గలవె ?
క్రొక్కారుమెఱుగులే గుసుమాస్త్రములుగాక
కాకున్న నీవిండ్లు గలుగవచట
గనకకుంభంబులే ఘనచక్రములుగాక
కాకున్న దరగల గదియనేల ?
ననుచువదనాలకములు బాహాశిఖములు
బొలయుచూపులు బొమలుచన్నులును వళులు
జూచిజనములుదమ్మ సంస్తుతులుసేయ
వఱలుదురు తత్పురంబున వారసతులు

అనిరుద్ధచరిత్రము-భావన పెమ్మన.

ఈరెండు పద్యములందును వాక్యార్థములకు తాత్పర్యము నను సరించి తాద్రూప్యప్రతిపత్తి యేర్పడునుగావున రూపకముగాదు. అసలు రూపకమననెట్టిదనిన జెప్పుచున్నాడు.

ఉపమానముతో నుపమేయమునకున్న గుణసామ్యమువలన
దత్త్వాధ్యారోపము రూపకము ౭ సూ.

గుణసామ్యమువలన ఉపమానమునందుగల గుణములుపమే యమున నుండుట ననుసరించి తత్త్వాధ్యారోపము - ఉపమానముతో * నభేదమునారోపించుటరూపకము. లౌకికోపమయు గల్పితోపమయు

*అభేదము నారోపించుట :—"ముఖముచంద్రుడు" అని వేరువేరుగా దెలియ వచ్చు నర్థములు, సమానవిభక్తికములగు పదముల జెప్పబడినవి. కావున నభేద సంబంధముతో నన్వయింపవలసివచ్చినవి. "ఇవి రెండు వేరు" అనుబాధకజ్ఞానము మనకిది

గూడ నీరూపకమునకు మూలముగానుండును. ఈవిషయమును దెలియ జేయుటకే సూత్రమున నుపమానోపమేయముల రెండిటిని జేర్చినది.

ఉదాహరణము:—

కందర్పాస్త్రములంచు నంచిత తటిత్కాండంబులంచుఁ సుధా
మందస్యందములంచు గాంచనలతామత్తల్లిలంచున్ సుధీ
బృందంబుల్ ధ్వనినిందలందెగడు నీబింబోష్ఠలందెల్ల నా
నందాభాసమెకాక భాసితచిదానందంబు పెంపొందునే.

పాండురంగమాహాత్మ్యము-౪ ఆ.

అథవా,

ఎలదోటల్ వనముల్ వధూకుచములద్రిందర్పింబులాకంటికిఁ
ఫలముల్వ్రాతెఱలంగజాగమకళాబంధంబు లిచ్చాసనం
బులు కోపంబున బాయుటల్ తపముసంభోగంబు కైవల్యమం
దుల లీలారతినుండు మానవులకెందుఁ గానమీచిత్రముల్.

కాళహస్తిమాహాత్మ్యము-౧ ఆ. ౨౧ ప.

ముఖచంద్రుడు మొదలగునవి యుపమా సమాసములు కావున రూపకమనుట యుక్తముకాదు. రూపకమునకును శ్లేషకును భేదమును జూపుచున్నాడు.

---

వరకే కల్గియున్నది. మఱియు నిచట గూడ వేఱువేఱు రూపములతో (ముఖత్వము, చంద్రత్వము అనునట్టివి) తెలియబడు చుండును. కావున నింతకుమునుపు జెప్పిన యభేదాన్వయమువలన నేర్పడిన యభేదబుద్ధి తెచ్చికోలు తెలివియే (ఆహార్యజ్ఞాన)మే కాని వేఱుకాదు. బాధకబుద్ధి యున్నపుడు కలుగునట్టి బుద్ధియంతయు నాహార్య బుద్ధియేకదా! ఆహార్యమనగా నదియే. కావున నీరూపకమున నభేదారోపమేర్పడుట తప్పనిసరి. ఈరూపకమునందుపమానోపమేయములకు అసమానవిభక్తికములగు పదము లుండవచ్చును. లేక వేరు విధముగాగూడ నుండవచ్చును.

ఉదాహరణము:—"వికసితావనమున నొప్పువెలదియీమె కమలమొప్పెడు సరసియే గదవయస్య" ఇచట నుపమానము మేయమును వేరువేరు విభక్తితోను నున్నది.

***అది ధర్మములయందు దంత్ర ప్రయోగమున నగుచో శ్లేష ౭ సూ.**

గుణక్రియా శబ్దరూపములగు ధర్మము లందభేదారోపము శ్లేష యగును. ఈయభేదారోపముమాత్రము తంత్రోచ్చారణము వలన నేర్పడవలయును. తంత్రమనగా నొకసారి యుచ్చరింపబడి

---

*అది:—తత్త్వాధ్యారోపము: ధర్మములు—గుణక్రియాశబ్దరూపములు తంత్రప్రయోగమున, తంత్రోచ్చారణమున. తంత్రమనగా నొకసారి యుచ్చరింపబడి యనేకమై యుపకరించునది. తత్త్వాధ్యారోపము-ఇచటి తత్త్వమిది. ఒకపదమునొకమారు పల్కినను రెండు మూడు పదములవలె నర్థమునకుపయోగించుట తంత్రము. ఈస్థితిలో "కనులాకరస్ఫూర్తి" అనునొక పదమును రెండుపర్యాయము లుచ్చరించినపుడు ఎట్లర్థస్ఫూర్తికాగలదో యట్టి సామర్థ్యమున్నదనుట. అపుడు విభిన్నమగు రెండర్థములకును-పద్మాకరముల యతిశయమునకును, లక్ష్మీదేవికి నెలవైన యతిశయమునకును నభేదారోపమేర్పడును. ముఖముచంద్రుడు అను పదద్వయము వినబడిన తరువాత వాని యర్థములకభేదారోప మొనర్పబడుట లేదా? అట్లే యిచటగూడ నెఱుగదగును. కావుననే తత్త్వాధ్యారోపము శ్లేషయనబడినది. కాని రూపకమునకును దీనికిని నొక్క భేదముకలదు. రూపకమున వేరువేరుపదములుండి తదర్థములకభేదాన్వయ మొనర్చుట వలన నభేదారోపమేర్పడును. ఇచట నొకపదమేయుండి యదియే తంత్రశక్తిచే బోధించిన రెండర్థములకును నభేదారోపమేర్పడును. ఇట్లుండ తరువాతవారు ఆలంకారికులు శ్లేషలో నభేదాధ్యవసాయ మేర్పడుననియు, నది రెండర్థములొక పదమున జెప్పుటవలన వచ్చుననియు వ్రాసిరి. ఇది విచారణీయము. విభిన్నమగు రెండర్థములొకపదమున జెప్పబడినను వానికి దత్త్వారోపము కలుగునేకాని యధ్యవసాయము కలుగదు. ఎందువలననగా; ఈరెండర్థములును వేరగుట యెప్పుడును మనకెరుకగును గదా? భేదజ్ఞానముతోడి యభేదజ్ఞానము తెచ్చికోలు తెలివియై (ఆహార్యజ్ఞానము) అది యారోపమేయగునుకాని భేదజ్ఞాన ప్రసక్తిలేని యధ్యవసాయ మెట్లగును? ఆరోపమును నధ్యవసాయమును పూర్ణముగ భిన్నములని యుత్ప్రేక్షాలక్షణవృత్తిలో వామనాచార్యుడు వ్రాసినాడు. రెండర్థములును వేరువేరుగా పదములవలన నుపస్థితములై ఒకదానికొకటి యత్యంత విభిన్నములుగా రూపకాది స్థలములందు తెలియబడునట్లులే శ్లేషస్థలమున నొకపదమున నట్లుభాసించుట యుండఱకును దెలిసిన విషయమే. కావున నిట నభేదారోపమేయుండుట సమంజసము గాని యభేదాధ్యవసాయముండుట

యనేకోపకారకమగునది. గుణక్రియా శబ్దరూపముతైన ధర్మములం దొకే యుచ్చారణమువలన నేర్పడు నభేదారోపము రూపకము.

ఉదాహరణము:—

వలమాన చంపకోత్పలమాలికాది సం
  గ్రథనచాతురి నెఱకవులఁబోలి
ధళము గెలిచిన సూత్రమునమూల్ కొల్పు నే
  ర్పునయోధవీరుల పొలుపుదెలిపి
ఖండితత్వమునరాగముగల పల్లవా
  వళిగోయుటలవేశ్య వలపుఁదెలిపి
పలుతావుల రసియెత్తులుపచరించు పెం
  పున జూదఱుల తేపపొడమఁజేసి
తమనిజాంగమరీచులు తత్తదన్య
పుష్పములుసావి నిక్కంపు బువ్వులమరు
పేరబేర్కొను పౌరుల గేరికేరి
నవ్వుదురు పుష్పలావికానళినముఖులు.

హరలీలావిలాసము — తెనాలి రామలింగకవి.

---

కేమాత్రమవకాశమును లేదు. ఒకపదమున జెప్పబడుట యట్టియవకాశము నీయ జాలదా? యని యాశంకింపవలదు. నిజమున కిచట రెండుపదము లేయున్నవి. అవి వర్ణసామ్యమువలన నేక శ్రుతిగోచరములగును. ఈవిషయమును భట్టోద్భటుని కావ్యాలంకార సంగ్రహమునను దానివృత్తియందును నున్నది. పోనిండు; ఒకపదమునుకొన్నను వర్ధములు పూర్తిగ విభిన్నములని స్పష్టమైనవుడు వానికిఅభేదమును చెల్పు ప్రయోజకము లెన్నియున్నను నీకల్గిన యభేదజ్ఞాన మాహార్యము. మఱియొక టెట్లగును? బాధకజ్ఞానమచట సిద్ధముగనుండలేదా? అదియున్నపుడు కల్గు జ్ఞానమాహార్యమేకదా? అదియే కదా యారోపము. రూపకమున నభేదమును బోధించు ప్రయోజకము. సమానవిభక్తియున్నను నచటనారోపమే యేర్పడు ననుటకు కారణమేమి? పైజెప్పినబాధకజ్ఞానముండుటయేకదా! కావున శ్లేషయందును నభేదారోపమేకాని యభేదాధ్యవసాయమే మాత్రము నేర్పడదను వామనాచార్యుని యభిప్రాయమే యుక్తియుక్తముగు సిద్ధాంతము.

అథవా,

కమలాకరస్ఫూర్తి కాసారములయందు
దమయందు గలుగంగ దనరుచుండు
గంభీరజీవన క్రమమగర్తలయందు
దమయందు గలుగంగ దనరుచుండు
ధారావిహారముత్తమతురంగములందు
దమయందు గలుగంగ దనరుచుండు
సుమనోవికాసంబు ప్రమదావనములందు
దమయందు గలుగంగ దనరుచుండు
దానమహిమ సముత్తుంగ దంతులందు
దమకరంబుల గలుగంగ దనరుచుండు
సిరులసంతోషమున ముఖ్యశీలవృత్తి
రణజయౌదార్యముల బురిరాజకులము.

పద్మినీవల్లభము-బొడ్డపాటి పేరయ.

(రూపకాదులందు) గౌణార్థ మలంకారమైనట్లు లాక్షణి కార్థము గూడ నలంకారము కాగలదని చూపుచున్నాడు.

సాదృశ్యమున లక్షణ వక్రోక్తి ౯ సూ.

లక్షణకు హేతువులు చాలయున్నవి, అందు సాదృశ్యమూలమున నేర్పడు లక్షణ వక్రోక్తి.

ఉదాహరణము:—

కలువలు కిలకిలనవ్వెన్
దొలిమల నెలయేటియవలి తుహినాంశుకరం
బులుగని,యపుడేటావలి
గిలిగింతలటంట వానికిఁ సరిదాకెఁ.

సారంగధరచరిత్రము-౨ ఆ. ౧౬౧ ప.

ఇంకను

గొజ్జంగివిరులపై గుప్పించు గుప్పించి
కన్నెగేదగులపై గంతుగొనును
వకుళగుచ్ఛములపై వర్తించు వర్తించి
పున్నాగతతులపై బూన్కినెఱపు
గురువిందపొదలపై గ్రుమ్మరు గ్రుమ్మరి
విరవాది లతలపై విశ్రమించు
మల్లికావలులపై మసలాడు మసలాడి
సురపొన్న తరులపై బొరలువెట్టు

ననుదినమునిట్లు పుష్పవాసనలదేలి
యంగజాభంగ రతులందు ననగిపెనగి
యలసిపడియున్న జనముల యలతమాన్చు
మలసియప్పురి ప్రాభాతమారుతములు.

మరియు

కిసలయంబులతోడ గెంగేలుదడవెట్టి
విరులపై నఖకాంతి విజ్జరాల్చి
లేదీగలకు దనూలీలగానుకయిచ్చి
గుత్తులు బాలిండ్లు గొలిచిచూచి
చలిగాలి నిశ్వాస సౌరభంబులనాగి
యళిపంక్తిగురులతో నలుకదీర్చి
పుప్పొళ్లనెలగందములు వియ్యమందించి
పూదేనె జెమటల బుజ్జగించి

తొడలు నరటికంబములును మెడలుబోక
బోదెలు నెలుంగులును బరపుష్టరుచులు
మాటలును గీరభాషలు మక్కళించి
చిగురుబోడులు వన కేళి చేయజేయ

ఇంకొకటి

చన్నులను జేతికలశంబు సరసమాడ
నవ్వునమృతంబు దమలోన నవ్వులాడ.
సిగ్గుతమకంబు వినయంబు జెంగలింప
వెలదియమృతంబు వడ్డించె విబుధతతికి.

ఈనిరూపితస్థలములందు లక్ష్యమగు నర్థము గ్రహింపబడు చుండును. కావున లక్షణయే యిచట నతిశీఘ్రముగా వివక్షితమగు నర్థమును బోధింపగలుగునని రహస్యమును విజ్ఞులు చెప్పుదురు. సాదృశ్యమూలకముగానిచో లక్షణవక్రోక్తి కాదు. "జరఠకమలకంద చ్ఛేద గౌరములు కిరణములు" ఇచట ఛేదము సామీప్యముచే ఛిన్నమగు ద్రవ్యమును లక్షించును. దానికిగదా గౌరత్వముండునది.

రూపకము, వక్రోక్తి వీనికన్న నుత్ప్రేక్ష వేరగుట చెప్పు చున్నాడు.

అతద్రూపము నతిశయము నపేక్షించి తద్రూపముగా
నధ్యవసించుట యుత్ప్రేక్ష – సూ.

ఇచట రూపమనగా స్వభావము. వర్ణింపబోవు వస్తువునదాను సంభావించు స్వభావములేకున్నను నున్నట్లు సంభావించుట యుత్ప్రేక్ష. ఇది సంభావించుటయే కాని యధ్యారోపము గాని లక్షణగాని కాదు. ఉత్కర్షమునకై యట్లు సంభావించిననే యుత్ప్రేక్ష యగునుగాని లేనిచో నది భ్రాంతియే. కావుననే యతిశయము నపేక్షించి యనబడినది. ఈ యధ్యవసాయముకూడ సాదృశ్యమూలకమైననే యుత్ప్రేక్షయగును, కాని కారణాంతరముల నేర్పడుచోగాదు. ఇట్లిచట సాదృశ్యమునకుగూడ ప్రసక్తి యున్నది. కావుననే "పోలెన్, వలెన్, నాన్ "మొదలగునవి యుపమను చెప్పునట్లు దీనిని గూడ బోధించును.

ఉదాహరణము:—

ఒక రామాతిలకంబు రత్నరుచితో నొప్పారు మందార కో
రకమున్ గర్ణవతంసతన్ నిలుపుచున్ రాగాలతాసక్త చూ

చక చేలాంచలమైమలంగి విడుమంచుఁ గేలుసాచెఁ బసా
యకపౌర్విన్ దెగనొన్నమన్మథుని ప్రత్యాలీఢపాదంబునాఁ.

ఉత్తరహరివంశము-౫ ఆ. ౫౩ ప.

కొంతమంది యుత్ప్రేక్షనే యతిశయోక్తియనెదరు. వారిని వారించుచున్నాఁడు.

సంభావ్యమగు ధర్మమును, తదుత్కర్షమునుగూడ గల్పించుట

యతిశయోక్తి ౧౦ సూ.

రెండును గల్పితములగుచోటనే యతిశయోక్తి.

ఉదాహరణము:—

గబ్బిబేడిసమీలు కన్నుల కెనవచ్చు
బలుమారునవిమిట్టి పడకయున్న
దొగలనెచ్చెలికాడు మొగమునకెనవచ్చు
నొకయంత మేనగందుండకున్న
గొర్వునజక్కవల్ గుచముల కెనవచ్చు
బ్రొద్దుపోయిన బాసి పోకయున్న
మెఱుగులు మెత్తని మేనుల కెనవచ్చు
దళతళ బొడకట్టి తలగకున్న
ననుచు సరసులు వర్ణింప నవయవాతి
విభ్రమ విలాసవిస్ఫూర్తి వినుతికెక్కి
గణనమీరిన మానినీ మణులుగలరు

.... .... .... .... .... .... .... ....

వలిపముగట్టి హారములువైచి పటీరముమైనలంది జా
దులు నెఱి కొప్పునందుఱిమి త్రోవనెపోయితి మేనితాకియుం
దలచెడువారు లేరని మనంబు కలంకలుదేర్చి జారకాం
తల సమయస్థలంబులకు దార్చిరి దూతికలట్టి వెన్నెలన్.

పారిజాతాపహరణము-౨ అ. ౫౯ ప.

భ్రాంతిజ్ఞానాత్మకముత్ప్రేక్ష యగునట్లే సంశయజ్ఞానాత్మకము సందేహాలంకారమగునని చూపుచున్నాఁడు.

ఉపమానోపమేయముల సంశయము సందేహము ౧౧ సూ.

ఉపమానోపమేయముల విషయమున నుత్కర్ష మపేక్షించి సంశయించుచో నది సందేహము.

ఉదాహరణము :—

చిన్నిమిటారులో చికిలిచేసిన మారుని చిక్కటూరులో
వెన్నెలగుమ్మలో మెఱుగువెట్టినకెంపు కడాని బొమ్మలో
పొన్నలబంతులో మగుడబోవని మిన్నుమెఱుంగు కాంతులో
యెన్నగనంచునప్రచరులిచ్చకు మెచ్చగవచ్చిరచ్చరల్.

అహల్యా సంక్రందనము-౨ ఆ.

సందేహమువలె విరోధముకూడ నవసరప్రాప్తమని నిరూపించుచున్నాడు,

విరుద్ధమువలె భాసించుట విరోధము సూ.

"అర్థము" అని యిట వాక్యశేషము.

ఉదాహరణము :—

చెంచెతగుబ్బచన్నుగవ శీఘ్రతరంబుగ నంతనంత వ
ర్ధించిన యౌవనోపగమజృంభణ మెక్కెననంతకంత శో
షించెను దానినెన్నడుము జీవితనాథుడు వానివిల్లునుఁ
జెంచులరాజులున్ సవతిచేడియపిండును బక్కణంబులఁ.

ప్రద్యుమ్నవిజయము-ఘణిభవుమాధవుడు.

విరోధముకన్న విభావనవేఱని చూపుచున్నాడు.

క్రియను నిషేధించి ప్రసిద్ధమగు దానిఫలమును
వ్యక్తీకరించుట విభావన ౧౩ సూ.

ఉదాహరణము:—

ముసుగువెట్టిననేమి ముత్యాలకమ్మల
కొమ్మిమ్మంచు లీలల గులకరించె
మోమువంచిననేమి మొలకనవ్వులకాంతి
చెక్కుటద్దములపై జీఱువారె
జూడకుండిననేమి సొబగురెప్పలమించి
తేటవాల్మెఱుఁగులు దిచ్చరించె
జాటుచేసిననేమి చక్రవాకలబోలు
పాలిండ్లమెఱుఁగులు బయలుపడియె
సిగ్గునటియించి మావేడ్క చిన్నబుచ్చి
యేలయిటులపిసాళించె దేమిబుద్ధి
కాము సామ్రాజ్యపట్టమ్ము గట్టినన్ను
కౌగలింపగదగదె యోకరణకాంత.

క్రీడాభిరామము.

విరోధ ప్రసంగమున ననన్వయమును జెప్పుచున్నాడు.
ఉపమానము నుపమేయము నొకటియే యగుట
యనన్వయము ౧౪ సూ.

ఉదాహరణము:—

వారిధికిని వారిధియే
మేరునగంబునకుసాటి మేరునగంబే
నారాయణదేవుకు సరి
నారాయణదేవుగాక నరపతులెదురే.

చాటుధార — అడిదము సూరకవి.

ఇతరులతో బోలిక లేకపోవుటయే అనగా ననుపమత్వమే దీని ఫలితాంశము.

క్రిమముగానగుచో నుపమేయోపమ ౧౫ సూ.

ఉదాహరణము:—

బాలముఖేందుబింబరుచి పద్మనిభాననయానలీల నీ
లాలకచన్నుదోయిరుచిరాంగి మనోజ్ఞవిలాసహాసముల్
లోలకురంగలోచనవిలోకన సంపదనెట్లువోల్చినన్
బోలినబోలునారతము బోలగనీ(త్రయి నొండుగల్గునే.

ఇదియే పరివృత్తియని కొందరందురు. వారిని త్రోసివేయుటకు చెప్పుచున్నాడు.

సమవిసదృశములతో మార్చుట పరివృత్తి ౧౬ సూ.
విసదృశము-సమముగాని యర్థము.

ఉదాహరణము:—

పనివడిపాకశాసను నెపంబున బంకజసంభవుండు నీ
తనువుదొఅంగజేసె నతిదారుణశాంభవరోష వహ్నిచే
మనముననాటియాగ్రహముమానక నీవునుసంఘటించితా
ఘనునిశిరంబుద్రుంచు తమకంబితరుల్ తెలియంగనేర్తురే.

సావిత్రీకథ_తులసి బసవయ్య.

ఏ నిన్నుమామయనియెడు
దీనికిదగనిమ్ము భారతీకన్యక నా
కీన ర్హుడవగుదని-నను
భూనాయకుపలుకు చిత్తమున కింపగుడున్.

నిర్వచనోత్తర రామాయణము_తిక్కన.

ఉపమేయోపమకన్న గ్రమము వేఱనుచున్నాడు.
ఉపమేయములకును నుపమానములకును
గ్రిమ సంబంధముక్రమము ౧౭ సూ.

ఉపమానోపమేయములకు మొదట జెప్పినవానికిని వానిననుసరించి పిదప జెప్పినవానికిని గ్రిమముగా సంబంధమున్నచో గ్రమము.

ఉదాహరణము :—

అరుణారవిందమ్ములని మ్రొక్కెనో కాని
చిగురుటాకులనింత చేరరావు
పులినంబులనిచాల బుజ్జగించెనో కాని
మరుచక్రములనింత మరగిరావు
చక్రవాకములని సవరించెనో కాని
కరికుంభములనింత గదియరావు
గండమీలనిచాల గౌరవించెనో కాని
పూవుదూపులనింత పొందిరావు
తరగ లాత్మీయధనముల దాయలైన
చరణములు నితంబములును జన్నుగవలు
గన్నుగవలుదోతేర శృంగారజలధి
తరగలింతలుపై కొన్న దలకినట్లు.

ఉత్తరహరివంశము—౫ ఆ. ౬౬ ప.

మఱియు,

వలపులబొమలమై నిలుకడగన్నుల
బుష్పచాపధ్వజ స్ఫూర్తిగలిగి
కాంతిగందంబునగరముల దనువల్లి
గనకపంకజదామ గరిమదాల్చి
కురులనుబొడ్డున బిఱుదున గుచముల
ఘనసరసీ చక్రగతివహించి
నేర్పున నగవున నిగ్గున మొగమున
శారదామృతభాను సమతనొంది
కౌనునఖముల సొబగున గల్కిచూపు
హరిమణిశ్రీసమానత నతిశయిల్లి
రూపశుభలక్షణమ్ముల నేపుమిగిలి
వెలదులమరుదురవ్వీట వేడ్కతోడ.

విష్ణుకథానిధానము—జైతరాజముమ్మయ.

మానుషదానమాన బలమానితధర్మరమా మనోజ్ఞరే
ఖానతభూతివిత్తముల గాటయవేమనజోత్తు వాసవిఁ
వానివిరోధివానివిభు వానివిపక్షుని వానియగ్రజుఁ
వానిమఱంది వానిసుతు వానియమిత్రుని వానిమిత్రునిఁ.

కాటవేయసుబిమిాది చాటుధార.

ఉపమానోపమేయ వాక్యములందొక్క క్రియదీపకము ౧౮ సూ.

ఉపమానబోధక వాక్యములందును నుపమేయ బోధక వాక్యము లందునుగూడ నొక్కే క్రియప్రసంగవశమున సంబంధించుచో దీపక మగును.

ఆదిమధ్యాంత వాక్యములందుండుట వలన నది
మూడు విధములు ౧౯ సూ.

ఆదిదీపకమున కుదాహరణము :—

ఏమితపంబుచేసి పరమేశ్వరు నేమిటబూజచేసిరో
రామునితల్లియుం బరశురామునితల్లియు భీముతల్లియుఁ
గాముని కన్నతల్లియును గంజదళాక్షుననుంగుతల్లియుఁ
శ్రీమహితప్రతాపుడగు సిద్ధన తిక్కన గన్నతల్లియుఁ.

మధ్యదీపకమున కుదాహరణము :—

అద్దములోనదోచు ముడుపందనిమ్రానిఫలంబు కోపపుం
గ్రద్దఱిచిల్వచేబడిన గందపుదీవె మహావిషంబులో
నద్దినపణ్యరంబు మగనాలు; అదికొంచెమునన్ లభించునే
సుద్దులువేయునేల బలసూదనుతో దెలియంగబల్కవే.

అహల్యా సంక్రందనము.

అంత్యదీపకమున కుదాహరణము :—

మిరియములేనికూరయును మెచ్చునెఱుంగనివారి యీవియుఁ
గరగరగాని భోజనము కన్నులపండువగాని రూపముఁ
మురిపములేని యౌవనము మోహములేని లతాంగి కూటముఁ
సరసుల కింపుగావు సుగుణాకర! పెమ్మయసింగధీమణీ

దీపకముపిదప నిదర్శనమును సంక్షిప్తమనుచున్నాడు.

తనకును స్వఫలకమునకును సంబంధమును క్రియచేతనే
స్పష్టపఱచుట నిదర్శనము ౨౦ సూ.

తనకును, స్వఫలకమునకును = తాను దేనికిఫలమో యట్టిదానికిని గల సంబంధమును క్రియవ్యక్తపఱచునెడల నిదర్శనము.

ఉదాహరణము :—

మిగుల నున్నతపదవిని నెగడుటదియ
ధః పతనమునకే యనుదారి నర్ధ
శాలులకు దెల్పుచును గ్రిందరాలుచెట్టు
పండుటాకులు తొడిమల పట్టువీడి.

తనకును-అనగా క్రియయగు పతనమునకును స్వఫలకమునకును అనగా నాపతనమే ఫలముగాగల "ఉన్నతపదవి నెగడు టకును" సంబంధమును గ్రియచేతనే స్పష్టపఱుచుట. అనగా ఫలసాధనత్వరూపకమగు సంబంధమును "మిగుల నున్నతపదవిని నెగడుటది యధః పతనమునకే" యని పండుటాకులుక్రింద రాలుటచే నర్ధశాలులకుదెల్పుట. ఇది యర్థాంతరన్యాసముకాదు. అది యెట్టిదనిన నిరూపించుచున్నాడు.

ఉక్తసిద్ధికై మఱియొకటియేయగు వాక్యార్ధమునుంచు
టర్ధాంతరన్యాసము ౨౧ సూ.

ఉక్తసిద్ధికై-చెప్పినది రుజువుచేయుటకై, మఱియొకటియేయగు వాక్యార్ధము నుంచుటర్ధాంతరన్యాసము. వాక్యార్థమునుంచుటయని చెప్పుట వలన నొక పదమునర్ధమును హేతువుగా గైకొనినచోటు లర్ధాంతరన్యాసము కాదని తెలియునది. ఎట్లన; "జలజసౌగంధ్యమియ్యది తెలియ బరచు నాతిదూరానసరసొకడలరుననుచు" "మఱియొకటియే" యనుటలో గల యభిప్రాయుమిది. హేతువు వ్యాప్తిలో నిమిడి యించించుక గన్పట్టుచోటు లర్ధాంతరన్యాసము కావలయుననియు నట్లుగాక" "ఎచట

కావలయుననియు నట్లుగాక" 'ఎచట బొగయున్న నచట నిప్పు ఉండును' అను నిట్టి ప్రకటహేతుస్వభావముగల చోట్లుఅర్థాంతరన్యాసములు కాకుండ వలయు ననియు,

ఉదాహరణము :—

ఆకుమఱుంగుపిందె యయి యంతిపురంబునబోలె నున్నరా
కాకుముదప్రియాస్య భయగాఢతరత్వరనేగుగాని లో
నాకలిదప్పియుజ్ఞ రవికరాత్తియునెన్నదు మన్మధాస్త్రకీ
లాకులతప్తచిత్తులకు లక్ష్యమె తక్కిన నొప్పులెవ్వియున్.

పాండురంగమాహాత్మ్యము-3 అ. 72 ప.

ఈయర్థాంతరన్యాసము హేతురూపముగదా; హేతువన నన్వయ వ్యతిరేకముల రూపమేకావున నర్థాంతరన్యాసమునకన్న వ్యతిరేకము వేరుకాదని కొందరనుకొనుచున్నారు. వారిని నిరసించుటకు చెప్పు చున్నాడు.

ఉపమేయమున గుణాతిరేకము వ్యతిరేకము 22 సూ.

గుణాతిరేకము - గుణాధిక్యము. "ఉపమానమునకన్న" నని యర్థసిద్ధము. ఈగుణాధిక్య మొకచోట స్పష్టముగా జెప్పబడును. మరొక్కెడ నట్లు జెప్పబడక తోచును. క్రమముగా నుదాహరింతుము.

హుంకారములులేవె యుపపురందరహతో
త్పాటనమునకు బాల్పడవుగాక
భ్రూభంగములులేవె యాభీలవింధ్య గ
ర్వస్తంభనమునకు రావుగాక
చులుకాకృతులులేవె జలరాశినిశ్శేష
శోషణక్రీడకు జొరవుగాక
జఠరాగ్నులులేవె జటితాపివాతాపి
తనుదాహమున నెదుర్కొనవుగాక

శిష్టపరిమాడ్కి తేనె ప్రతిష్ఠగురిచి,
దుష్టనిగ్రహాశిష్ట సంతుష్టిహేతు
రోషభీషణ రేఖా నిరూఢగాఢ
లీలగ్రిడించు ప్రోడలు లేరుగాక.

పాండురంగమాహాత్మ్యము-౫ ఆ. ౧౭౬ ప.

గంగాసంగమిచ్ఛగించునె మదింగావేరిదేవేరిగా
నంగీకారమొనర్చునే యమునతో నానందముంజెందునే
రంగత్తుంగతరంగ హస్తములు నారత్నాకరేంద్రుండునీ
యుంగమ్మంటి సుఖించెనేని గుణభద్రా తుంగభద్రానదీ.

పాండురంగమాహాత్మ్యము-౧ ఆ. ౧౩౮ ప.

వ్యతిరేకముకన్న విశేషోక్తి వేఱనుచున్నాడు.

ఒకగుణమునకు హాని కల్పించునపుడు పోలికను
దృఢపరచుట విశేషోక్తి ౭౩ సూ.

ఒకగుణములేదని చెప్పునపుడు మిగిలిన గుణములతో సామ్యమును దృఢపరచుటయే విశేషోక్తి. ఇది యించుమించుగ రూపకమే.

ఉదాహరణము :-

అవ్యాయామపురారులక్షుభిత పారావారులక్షీణ పు
ణ్య వ్యాపారసురేంద్రులగ్రహణ చంద్రాదిత్యులస్థావర
ప్రవ్యక్తామర భూరుహంబుల చతుర్భావాననబ్రహ్మలా
దివ్యద్వారవతీ పురింగలుగు ధాత్రీపాలు రెల్లప్పుడున్.

ప్రద్యుమ్నచరిత్ర-పొన్నాడ పెద్దిరాజు.

"జూదమనగా బురుషునకు సింహాసనము మాత్రము లేని రాజ్యము కాదా" "ఈమె కమలమువీడినలక్ష్మి" "ఏనుగనగా నడచెడు దుర్గముగదా" "నడచెడు" అను పదము కదలకుండుటను

నిరసించుటకే నుడువబడినది కావున నొకగుణమునకు హాని కల్పించు టయే యిచటగూడ నున్నది. ఈతీరుననే "వెలయాలనగా రూపొందిన టక్కరితనము" "కష్టమననూపిరియున్న చావే" "ఈవిప్రుడు భూలోక బృహస్పతి" అనుచోట్లగూడ నొకగుణమునకు హానిని కల్పించుటను తెలియవలయును.

వ్యతిరేకము, విశేషోక్తి, వీనికన్న వ్యాజస్తుతివేరని చూపుచున్నాడు.

సంభావ్యమగు విశిష్ట కృత్యము నొనర్ప లేదని నిందించుట
స్తుత్యర్థమగుచో వ్యాజస్తుతి ౨౪ సూ.

విశిష్టకృత్యము-గుణములచేనధికుడు విశిష్టుడు. అతడొనర్చిన పని. సంభావ్యమగు - చేయుటకువీలగు. చేయలేదని నిందించుట గొప్పవానితోడి సామ్యసంపాదకమై స్తుతిపర్యవసానము నొందెనేని వ్యాజస్తుతి.

ఉదాహరణము :—

"కావుకావనువారి గదిసితుంగపయోధర పదాంతరంబుచే రంగనీదు
వివృతాగ్రరదనులై వ్రేళ్లుచీకెడువారి మోముజేర్చిశిరంబు మూరుకొనదు
పదములు తొట్రిలబరువులెత్తెడివారి ననురక్తవృత్తి వెన్నాడిచనదు
పలుచాపలముల బుట్టలుమెట్టజనువారిదత్తరంబునగ్రుచ్చియెత్తుకొనదు."
కాంచదో విజయశ్రీల బెంచదో ప్రతాప
బాలార్కులను శుభోదయముమీర
నౌరతిరుమలరాయబాహాసిపుత్రి
యఖిలలోకాద్భుత క్రీడ నతిశయిల్లు.

వసుచరిత్రము-౧ ఆ. ౨౬ ప.

వ్యాజస్తుతికన్న వ్యాజోక్తి వేరని జెప్పుచున్నాడు.

వ్యాజమునకు సత్యముతోడి సారూప్యము వ్యాజోక్తి ౨౫ సూ.
దీనినే మాయోక్తి యందురు.

'శారదేందు మయూఖాళిగౌరమైనకాశపుష్పలవంబది గాలికెగిరి
నామొగమ్మునబడియెను, భామినీ! యిదేనిమిత్తము కనులునీరూనెచూడు'

స్వప్నవాసవదత్తము.

మఱియు
ఉదాహరణము:—

ఉన్నతసౌధమెక్కి యన్నతోదరి యొక్కెడపద్మనాభు జూ
డన్నిజ దేహవల్లిక గడల్కొను సాత్వికలీలజూచు నా
సన్నసఖీజనంబుగని సౌధశిఖాగమనశ్రమంబునన్
గన్నియలార మేన్పడలె గంటిరె నాకనిబొంకె నేర్పునన్.

పారిజాతాపహరణము—౩ ఆ. ౧౫ ప.

వ్యాజస్తుతికన్న తుల్యయోగిత వేరనుచున్నాడు.
విశిష్టముతో సామ్యమునకై యేకకాలయగు క్రియయందు
గూడిక తుల్యయోగిత ౨౬ సూ.

ఏకకాలయగు క్రియయందు-ఒకే సమయమున నొకే పనియందు; విశిష్టమునకును నవిశిష్టమునకునుగూడ జేరిక వర్ణింపబడి యది సామ్య నిష్పాదకమగుచో దుల్యయోగిత.

ఉదాహరణము:—

'ఉదధిరశన ధరణి నూనుచునున్నారు భుజగవిభుడు నీదుభుజమునిపుడు'
మఱియు

యామినీసమయంబు నాశాతటప్రదే
  శంబు ప్రసన్నభావంబునొందె
బ్రియచుంబితాంగనా బింబాధరంబులు
  నుడురాజునపరాగ యుక్తిదోచె
నఖిలవస్తువులు బ్రాగచల కూటవిటంక
  తలములు నతిరోహితంబులయ్యె
నుత్తుంగ పురగోపురోపరిస్థలులు సా
  రసములు నాప్తసౌరభములయ్యె

దరుణగోత్రర్ణకంబులు సురపథాంత
రంబులును విచ్యుతగ్రప గ్రహంబులయ్యె
నియమపరతంత్రి భూదేవచయముగౌశి
కవ్రజంబు సమాధియోగమునబరగె.

పారిజాతాపహరణము- ౨ ఆ. ౬౫ ప.

ఉపమానము నాక్షేపము ఆక్షేపము ౨౭ సూ.

ఉపమానము నాక్షేపించుట యనగా నిషేధించుట. సమానమగు కార్యము నొనర్పగలదానిని వ్యర్థమని చెప్పదలచునపుడీయాక్షేపము ప్రసక్తించును. అనగా నుపమానమొనర్పవలసినపనిని యుపమేయమే యొనర్పగలదు, కావున నిక నుపమేయమవసరములేదని నిషేధించుట యాక్షేపమనిపర్యవసానము.

ఉదాహరణము :—

పడతికన్నులయొప్పు దడవుచో నదియెంత
వెలిదమ్మిజేకుల విలసనంబు
పొలతినెన్నడపెంపు బొగడుచో నదియెంత
కలహంసములయాన గౌరవంబు
ఉవిదనెన్నడుముతో నుపమింప నదియెంత
కొఱనెల నెలకొన్న నెఱసుకలిమి
వనితయూర్పుల తావికెనపోల్ప నదియెంత
యరవిరులందలి సురభిమహిమ
లలన కరివంక బొమల యొప్పులుగణించు
చోటనదియెంత వెడవింటి సోయగంబు
కాంత తనుకాంతి నరసేయ నెంతమాత్ర
వాలుమెఱుగుల సౌభాగ్య వైభవంబు.

అనిరుద్ధచరిత్రము- పెమ్మన భావన.

తక్కక రామసింగ వసుధావరుడర్థులకర్థమిచ్చుచో
దిక్కులలేవికర్ణుని దధీచినిఖేచరు వేల్పుమ్రానుబెం

పెక్కైన కామధేనువు శిబీంద్రుని నెన్నెదుభట్టదిట్టవై
కుక్కవోనక్కవో ఫణివోకోతివో పిల్లివోపూతపిల్లివో.

శ్రీనాథుని చాటుధార.

నీమహత్త్వంబును నిర్జరు లెఱిగిన
    దరితోడ నమృతంబు తఱవబోరు
నీవిధంబును మునుపావని యెఱిగిన
    సంజీవి వెదకెడు జాడబోడు
నీవార్తమునుదేవతా వైద్యులెఱిగిన
    నౌషధావళికి బ్రయాసపడరు
నీరీతి మునుమౌని నికరంబులెఱిగిన
    బలుతపోనిష్ఠలు సలుపబోరు
సంతతోక్షిప్త జీవరక్షణములకును
రోగముల్ పాప, మోక్షంబు రూఢి తెలుప
బుడమిలోపల జనులను బ్రోవనీవు
ఒనర జనియించితివొకాక యోపొగాక.

ఉపమానము నాక్షేపము-ఉపమానమాక్షిప్తమై బోధపడుట యాక్షేపమనియు సూత్రార్థము:—

ఉదాహరణము :—

సరసుల పొందుగల్గనగజాలి బహూన్నతచారుశాఖలం
బెరిగి మహాద్విజావనమె పేర్మినిజాయతిగాదనర్చి ని
ర్భరజనతాప సంహరణ పాత్రములయ్యుమహీజవాటికల్
పురివెలినిల్చె మేటియునపూజ్యుడగున్ మధుపానుకూలతన్.

కందర్పకేతువిలాసము- తెనాలి రామలింగయ్య.

ఇందు మహీజవాటికలు శ్రేష్ఠపురుషులవలెను వెలినుండుట సాంఘిక బహిష్కరణమువలెను స్ఫురించుచున్నవి.

తుల్యయోగితకన్న సహోక్తి వేఱని చూపుచున్నాడు.

ఒకేసమయమున జరుగు రెండువస్తువుల పనుల నొకపదమున
జెప్పుట సహోక్తి ౨౮ సూ.

సహార్థకములగు పదముల సామర్థ్యమువలన నొకపదముననే పై
జెప్పినట్టి రెండుక్రియలనుజెప్పుటకువీలగును కావున నదిసహోక్తి.

.... .... .... .... .... .... .... .... ....

పొరిద్దుతోరిపులఁగ్రుంకిరి సైన్యములఁ మరల్పుడీ.

శేషసంహారము-౫ అం. వడ్డాది సుబ్బారాయుడు.

ఇక మిగిలియున్న సమాహితలక్షణమును జెప్పుచున్నాడు.
ఏవస్తువుపోలికయో అదియే సమకూరుట సమాహితము ౨౯.

ఉదాహరణము:—

వానను నానులేజిగురు బాష్పజలంబున దోగుమోవిగా
స్వానుగుణర్తు హీనతలతాంతములన్న నగల్ దొఱంగి యిం
పౌనళిపాటలేమి వగనయ్యెడు మౌనము దెల్పనంఘ్రులే
బూనినద్రోచివెన్కవెతబొందెడు కోపనవోలెదోచెడుఁ.

ఇట్లు లతయందూర్వశిపోలికను బురూరవసుడు భావించుచుండగా
నాతీవెయే యూర్వశియైనది.

ఈనిరూపించిన యలంకారములన్నియు కేవలములుగాను నొక
దానితో నొకటి కలిపియుగూడ బ్రయోగింపవచ్చును. విశిష్టములగు
నలంకారములొకదానితో నొకటికలియుట సంసృష్టియను చున్నాడు.

అలంకారమలంకార హేతువగుట సంసృష్టి ౩౦ సూ.

అలంకారహేతువగుట అనగా; అలంకారము తనకు
హేతువుగా నుండుటయు నలంకారమునకు దాను హేతువుగా నుండు
టయు నని రెండు విధములుగా నర్థములను గ్రహింపవలయును.
సంసృష్టి-సంసర్గము-సంబంధమని.

ఉపమారూపకము ఉత్ప్రేక్షావయవమునని దాని భేదములు ౩౧ సూ.

దాని భేదములు—సంసృష్టిప్రకారములు.

ఉపమనేర్పడు రూపకముపమారూపకము ౩౨ సూ.

ఉదాహరణము:—

*సహకారాధిపు గౌగలించుకొని వాసంతీలతాకాంత సా
రహరిద్రారసగౌరకేసరములన్ రంజిల్లుమాధ్వీక వా
ర్లహరీస్వేదము జూపబట్టపగ లేలాయింతటన్ సిగ్గులే
దహహాయంచుదొలంగినవ్వె జెలిమాధైముద్ద రాలయ్యెడన్.

ఉత్తరహరివంశము.

---

*సహకారాధిపు:—ఇచట "వాసంతీలత కాంతవంటిది" యను నుపమ ననుస రించి "మాధ్వీకవార్లహరియను స్వేదము" అను రూపకమేర్పడును. లేనిచో వాసంతీలతకు స్వేదము సరిగ కుదరదుగదా? ఇచట సహకారమను నధిపుని (నాయకుని) వాసన్తీలతయనుకాంత (నాయిక) మాధ్వీకవార్లహరియను స్వేదము (సాత్త్విక భావమును) అని యీతీరుగా నుడివినచో బరంపరగా రూపకమేర్పడునుగాన బరంపరితరూపకమేయనరాదా? వాసంతీలతాకాంత యనుచోట నుపమ నాశ్రయింప నేల? యనిన సమాధానము వ్రాయుచున్నాము.

ఈవామనాచార్యుని మతమున "లతాకాంత, ముఖచంద్రుడు" ఇత్యాది పదములన్నియు నుపమితసమాసములేకాని రూపకసమాసములు కావు. "ఉపమితం వ్యాఘ్రాదిభిస్సామాన్యాప్రయోగే" అనుచోట వ్యాఘ్రాదిగణము నాకృతిగణముగా నొనర్చి పై చెప్పిన పదములవంటి (లతాకాంత, ముఖచంద్రుడు) వన్నియు నాసూత్ర లక్షితముల నొనర్చెను. "ముఖచంద్రాదులుపమిత సమాసములు కావున నచట రూపక మనుట యయుక్తము". అని యారవ సూత్రవృత్తిలోని యీతని వాక్యమే మనకీ విషయమునంతను స్పష్టపరచుచున్నది. ఇట్లు 'వాసంతీలతాకాంత' యనుచోటుపమిత సమాసమే కావున నిక పరంపరిత రూపకమనుట కవకాశమెట్లు? నిజమునకు "మాధ్వీకవార్లహరీస్వేదము" అనుచోటగూడ పై న్యాయము ననుసరించి యుపమిత సమాసమనుటయే యుక్తముకాని ముద్దరాలు మాధ్వీకవార్లహరిని జూచినచో "ఇంతటన్ సిగ్గులేదహహాయంచున్ దొలంగినవ్వునా? సాత్త్వికభావమగు స్వేదమును జూచి నపుడట్లు నవ్వుటయుపపన్నమగును. కావున నీవిషయము ననుసరించి "మాధ్వీకవార్లహరీస్వేదము" అనుచోట రూపకమే చెప్పవలయును. ఇప్పటికిని దృష్టినొండని వారెవ్వరైన నుందురేని వారికై తర్వాత యుదాహరణ ముద్దేశింపబడినది.

*జలధరంబనవెద్ది పొలపంబు పుట్టించు
నిల్లాలిమెఱుగుల మొల్లములకు
మున్నీర నగనెద్ది మొలచుటకావాల
మాణిపూసలువోని యాత్మజులకు
నీడమ్రాకననెద్ది నిలువనీచై తోచు
నాకటనుండు ద్విజావళులకు
దాపనవెద్ది యాధార మాదిపెద్రాకు
పిత్రుపర్యులకు గుంటిపిచ్చుకలకు
నట్టిగృహమేధి ధర్మంబునందునీవు
కుత్ససేయుటనీరీతి గొడవయొదవె

---

* జలధరంబు :—'మొల్లములవంటి-ఘనములవంటి ఇల్లాలిమెఱుగులు' అని యుపమిత సమాసమును గ్రహింపవలయును. "ముఖచంద్రాదులుపమిత సమాసములు గావునవిటరూపకమనుట యుక్తముకాదు" అని వామనుని వ్రాతయే యిచటమూలము. అయితే ముఖచంద్రాదులకుపమిత సమాసమనుట యీతని మతము కావచ్చునుగాని "ఇల్లాలిమెఱుగుల మొల్లములు" అనువోటకూడ నుపమితసమాసమగుట యతని యభిప్రాయమనుటకు యుక్తియేమున్నది? ఇది యాంధ్రభాషీయమగు సమాసముకదా; ఇచట నీసమాసమేమును నూహ యెట్లు సంభవించును? అనిన చెప్పబడుచున్నది. ఆంధ్ర భాషలోని యీసమాసము నుపమితసమాసమేనని వామనుడనెనని యనుటలేదు. వామ నాచార్యుని యభిప్రాయమున నీయదే సమాసము కాదగునను విచారించుచో నుపమిత సమాసమే యగునని చెప్పబడుచున్నది. ఈవిషయ మెట్లూహింపబడినదనిన "ముఖ చంద్రాదులు" అనువాక్యమువలననే యూహింపబడినది. ఎట్లనగా; "ముఖచంద్రా దులు" అను వాక్యమున "ఆదిశబ్దము ముఖచంద్రాది గణమని యొకగణము లేనందున ప్రభృతివాచకముకాదు ఇకేమన్న ప్రకారవాచకమే. ఆదిశబ్దమునకు రెండేగదా యర్థ ములు. మొదలు, ప్రకారము. ప్రకారమనిచతీరు, పోలికయనియనర్థము. ఆపోలికయేమని విచారించినచో "ఉపమేయోపమానము లేక సమాసమున క్రియనివిష్టములై యుండు టయే" ప్రకారమని గుర్తింపబడును. ఆతీరున నున్నపదములేగదా; "ఉపమితం"... అను సూత్రముచకు గోచరములగునవి. కావున నాతీరుగల "మెఱుగుల మొల్లములు" అనునది కూడ నుపమితసమాసమేననియు "ఉపమితం" ఇత్యాది సూత్రవిషయమే ననియు గ్రహింపనగును. ఈపద్ధతి నితరస్థలములందుగూడ గ్రహింపనగును. ఇంక రెండవ పాదమున నుపమయు తదారబ్ధమగు రూపకమును "ఆణిపూసలువోని యాత్మజులకు "మున్నీరనగా" అని స్పష్టముగనే యున్నది.

నొప్పుగతినొప్పుగనగల్గె దుద్ధతులకు
గసరిపై వచ్చు జ్వాలపై గాలియైన.

పాండురంగమాహాత్మ్యము-౫ ఆ ౨౬౧ ప.

ఈనిరూపణముచే

"ననుభవదీయదాసుని మనంబుననెయ్యపు గిన్కబూని దా
చినయదినాకు మన్ననయె చెల్వగు నీపదపల్లవంబు మ
త్తనుపులకాగ్రకంటకవితానముదాకిన నొచ్చునంచునే
ననియెదనల్కమానవుగదా యికనైననరాళకుంతలా.

పారిజాతాపహరణము"

అనుచోట "పదపల్లవంబు, మత్తనుపులకాగ్రకంటకవితానము" అనునదియు

వదనాంబుజంబుపై వ్రాలిన మదభృంగ
జాలంబుల బలనీలాలకములు
రదనముక్తాఫల పంక్తికరంబుదాచిన
పవడంపునును గ్రోవి పడతి మోవి
యౌవనాంభః ప్రవాహములోన దేలెడు
జక్కవకవ కాంతచన్నుదోయి
నతనాభికూపసంగతమైన నవజల
ద్రోణిపల్లవపాణి రోమరాజి
రామణికినిడిన కమ్మపూదండల
బ్జాక్షి కరయుగంబు చరణ పద్మ
ముల్ ముట్టంగ జాలునట్టి కరి
కరంబులు నిడువాలుగంటితొడలు.

సావిత్రికథ-తులసి బసవయ్య.

అను పద్యమును వివరించినట్లయినది.

ఉత్ప్రేక్షకు హేతువు ఉత్ప్రేక్షావయవము ౩౩ సూ.

అవయవశబ్దమునకు లక్షణచే నారంభించునది యనియర్థము కావున నుత్ప్రేక్ష నారంభించు నలంకార ముత్ప్రేక్షావయవమన బడును. ఆరంభించుటయనగా ఏర్పడుటకు సహాయమొనర్చుట.

ఉదాహరణము :—

అంగుళులబోలు కిరణాల నంధకార
మనెడు ధమ్మిల్లమునుబట్టి యంబుజాత
నేత్రములు మొగుడనారజనీముఖమ్ము
నదిగొముద్దిడుకొనునట్టు లలరెడుశశి.

ఇచట నుపమా రూపకములు "ముద్దిడుకొనునట్టు లలరెడు" అను నుత్ప్రేక్షను సమకూర్చును.

మఱియు,

మాగుపాఱిన చంద్రమండలంబులువోలె
వదనారవిందంబు వన్నెదరుగ
మకరందమున నిండు మధుకరంబులువోలె
నేత్రోత్పలంబుల నీరుదేర
నెఱిదప్పిప్రాలిన నీలమేఘమువోలె
గచభారబర్హ మగ్గలమువీడ
దొడగిజాలజలించు తొండంపుగవబోలె
నూరు రంభాస్తంభ యుగమువడక
గడకలేని తనూవల్లి ఘర్మజలము
దళముగాజిందజెందని తాల్మితోడ
వగపుజిత్తరువో కళవళపుగరువొ
యనగనొకకాంత గానంగనయ్యెనంత.

ఈపద్యమునగూడ పైయట్లే యుత్ప్రేక్షావయవమును గ్రహించునది.

వచనభంగులవై చిత్తవృత్తివశమువలన
నుపమయే యిన్నితెరుల నొప్పుచుండు
నీయదియె స్వీయముల బరకీయములని
దర్శనముల బ్రపంచితత్వమ్ము నొందె.

సౌభాగ్యము నొదవించున లంకారైకదేశములుగూడకవీశ్వరులచే వించుమించుగ నలంకారములుగనే కూర్పబడదగును.

ఇది ఆంధ్రకావ్యాలంకార సూత్రవృత్తియందాలంకారికమను

నా ల్గ వ య ధి క ర ణ ము

ము గి సి న ది.



## పంచమాధికరణము.

ఇపుడు కావ్యసమయమును శబ్దశుద్ధిని చూపుటకై ప్రాయోగిక మను నధికరణమారంభింపబడుచున్నది. అందు మొదట కావ్యసమయము (సాంప్రదాయము) నుడువబడును.

ప్రాయికముగా నొకపదము రెండుసారులు ప్రయోగింపదగదు ౧ సూ.

ఉ:—"పయోద, పయోద," సముచ్చయ బోధకములగు "ను" మొదలగు కొన్నికొన్ని పదములు రెండుసారులుకూడ నుపయోగింపనగును.

"జనకుండుఁ గురుభీష్ములుఁ దగినకర్జంబాప్తులై నీక"
ఉద్యోగపర్వము-౩ ఆ. ౩౭౨ ప.

"కరితురగాదిఘట్టనయుగాలియు నొంపదెయొంటియున్నయత్తరువు"
ఉద్యోగపర్వము-౨ ఆ. ౭౭ ప.

అర్ధాంతమునగాక మిగిలిన పాదముల సంహిత యొకపదము నందువలె నిత్యము ౨ సూ.

సంహితయనగా నక్షరములు మిక్కిలి దగ్గిరగానుండుట. ఇక పదమునందువలె అనగా నొక పదమున సంహిత తప్పకుండ నుండ వల యునని సాంప్రదాయము. పెద్దలవాక్యమిది "ఏకపదమున నిత్య సంహిత క్రియాపదోపసర్గమ్ములను నిత్య" అని. అర్ధాంతమున సంహిత లేకున్నను దోషములేదు.

"సర్వతీర్థాభిగమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుగావు
ఎఱుగుమెల్లధర్మములను నెల్ల బెద్ద
యండ్రుసత్యంబు ధర్మజ్ఞులైన మునులు"

కాని యాంధ్రమున నొకవిశేషము, అర్ధాంతమునందు కాక పాదాంతమునందు సంహితలేకుండుట ప్రామాణిక గ్రంథము లందు గన్పట్టుచున్నది.

"పదగను న్న కూసమ భయవిహ్వలగాను
అరవమునకు సూతునమ్మృతుందు."

పాదాంతమున లఘువునకు గురుత్వమున్ను సంతటఁబొడదు ౯ సూ.

ఉదాహరణము:—

"సర్వతీర్థాభిగమనంబు...." ( చూ. 141 పే. )

ఇటువంటి వానియందును వసంత తిలక ప్రహర్షిణీ ప్రవర్షాదులందును పాదాంతలఘువునకు గురుత్వ మొప్పవచ్చును. కాని వంశస్థాదుల మాత్రము పనికిరాదు "గురుత్వమును" నను చోట సముచ్చయము వెనుకటి సూత్రములోని యర్థాంతమిచటగూడ ననువర్తించుటకై గ్రహింపబడినది.

గద్యముతోడి పోలికగల యుద్ధతాదులకన్న నితరవృత్తములు గద్యమున నిముడ్పరాదు ౧౦ సూ.

ఉద్ధతాదులు గద్యతోడిపోలికకలవిగాన చేర్చుట దోషముకానేరదు. ఇతరములు పోలికలేనివగుట గద్యబుద్ధిని తొలగించును కావున నచట వానిని జేర్పరాదు.

పాదముమొదల "ఖలు" వంటివి ప్రయోగింపరాదు ౧౧ సూ.

"ఖలు" వంటివి-అనగా నేవి మొదలనిడిన సరిగానదుకవోయట్టివి. వాటిని ప్రయోగింపరాదని యర్థము "ఒగి ఓజ" ఇత్యాదు లిట్టివే. ఇక "బత, హంత, రే, చెలువు, ఎసకము" ఇత్యాదుల ప్రయోగము దోషావహము కాదని గ్రహించునది.

ఇంచుమించుగా ముగిసిన వాక్యము సగములో కూడదు ౧౨ సూ.

పద్యముసగములో చాలవరకు ముగిసిన వాక్యమునిముడ్ప కూడదు.

ఉదాహరణము:—

'తాండవమ్మునమిగుల నందమ్ములగుచు
భంగురాంగుళి కోటులౌపార్వతీశు

కరములు యశోదతనయుని కలితచక్ర
కపిశకాంతులు భుజములంగనుల జూడు"

మఱియు,

భీకర దానవు డొక్కడు
నాకొమరుండాడుకొనుచు నాశ్రమము కడన్
భూకాంతా యుండంగని
చేకొని పోయెన్ వచింపగలదే యింకన్".

శ్రీరామ వనవాస నాటకము.

బహువ్రీహిబుద్ధినొదవించు కర్మధారయము కూడదు. ౭ సూ.

ఉదాహరణము :—

"అధ్యాసితమగు తరువు = అధ్యాసితతరువు" అని కర్మధారయముకూడదు.

దానిచే విపర్యయము వివరింపబడినది ౮ సూ.

అనగా; కర్మధారయ బుద్ధినిగల్గించు బహువ్రీహికూడచేయదగదనిభావము. వీరులగు పురుషులెవనికిగలరో నాతడు "వీరపురుషుడు" అనియు కలమగు రవముదేనికుండునో యది "కలరవ" మనియు ననునట్టివాని నొనర్పరాదు.

సంభావ్యమగు నిషేధమును మరలించునపుడు రెండు
ప్రతిషేధములు ౯ సూ.

సంభావ్యమగు నిషేధము-ఇదియిచట నట్లుకాకపోవచ్చునని యూహింపదగు నిషేధము.

ఉదాహరణము:—

"స్తనయుగ్మమ్మున వత్సనాభమును వాత్సల్యంపుబూతల్ చెలం
గినజూపుల్ వదనాంబుజమ్మున స్మితాంగీకారముల్ పల్కులన్
గొనబుల్ మేననువల్లవీస్ఫురణనెగ్గుల్ సేయగావచ్చు పూ
తననీ కెట్లెఱుగంగ రాదెఱుగుదంతా గోపికావల్లభా."

గోపికావల్లభశతకము.

ఇచట పూతన మాయాగోపిక వేషమున వచ్చునపుడు శిశువుగా నున్న శ్రీకృష్ణునకు దానికపటమెఱుకవడకపోవచ్చును. అని యూహింప దగిన నిషేధమును మరలించుటకై యిచటనాలవపాదమున "ఎట్లు ఎఱుగంగరాదు? ఎఱుగుదంతా'' అని రెండు ప్రతిషేధములు కూర్పబడినవి.

విశేష్యమెఱుకవడునపుడు విశేషణమాత్రప్రయోగము ౧౦ సూ.

ఉదాహరణము :—

(సంస్కృతమున) ''నిధానగర్భామివసాగరాంబరామ్"

వృత్తిచ్ఛన్నమును సర్వనామముతో ననుసంధించుట ౧౧ సూ.

వృత్తిచ్ఛన్నము-సమాసముచే నప్రధాన మొనర్పబడినది. సర్వనామము—తదాదులు. అనుసంధించుట-పరామర్శించుట చేయదగునని వాక్యార్థము.

ఉదా. చెంచెతగుబ్బ ( 123 పే. ) బాలముఖేందు ( 125 పే. )

సంబంధముతోడి సంబంధమునగూడ నొకయెడ షష్ఠి ౧౨ సూ.

ఒకయెడననుటచే నంతట నిదిపనికిరాదని గ్రహింపవలయును.

''తామరదుంప'' తామరతో సంబంధించియుండినది తామరతీవె "దానిదుంప" యని సంబంధముతోడి సంబంధము. ఇట్లే ''యరటిదుంప" మొదలైనవి యెఱుగునది.

బహుప్రయోగముగల దేశభాషాపదము ౧౩ సూ.

కవులధికముగా బ్రయోగించిన దేశభాషాపదమును ప్రయోగింపవచ్చును.

"హాలాపాన విజృంభమాణ" ఇట'హాలా' యనునది.

లింగమును నధ్యాహారమును ౧౪ సూ.

"బహుప్రయోగముగల" యనునది యిచటి కనువర్తించును. కవులధికముగా నుపయోగించినట్టి లింగమును నధ్యాహారమునే ప్రయోగింపదగునని. లింగమున కుదాహరణము :-'' సురాగండూషము '' గండూషశబ్దము స్త్రీలింగముగా గూడ నిఘంటునందు జెప్పబడియున్నను కవులధికముగా పుంలింగముననే బ్రయోగించియున్నారు.

అధ్యాహారమున కుదాహరణము:—

"జీవుల్ సంసృతిజాలబద్ధులయి పుంజీభూతపాపక్రియా
వైవిధ్యంబున బారముంగనక శోకంగా దటస్థస్థితి
తావిష్టుండగు వారికర్త యెవ్వడైనా? యెందుడైనా? యిదే
నా? వారందరి తెల్విఁదేటలుడిగెనా? గోపికావల్లభా.

ఇచట " ఉపయోగించునా " యను నధ్యాహారమన్వయపు సమ
మున బ్రయోగింపదగును.

లక్షణాశబ్దములును ౧౨ సూ.

కవులధికముగా నుపయోగించినవే బ్రయోగింపవలయును.

ఉదాహరణము:—

" ద్విరేఫము రోదరము " ఇవి క్రమముగా తుమ్మెదను చక్రవాకమును లక్షణచే బోధించును. ఎక్కువగా నుపయోగింపనివాటి నుపయోగింపరాదు. ఉదా:-"ద్వికము"-కాకము.

అవి యెక్కుడుగా నొకయెడగూడదు ౧౩ సూ.

ఆలక్షణాశబ్దము లెక్కువగా నొకవాక్యమున బ్రయోగింపకూడదు. ఏలయనగా; వాక్యముననేదేనొక్క పదమవాచకమగుచో వానినెట్లో వాచకమువలె సవరించవచ్చును. కాని చాలా పదములవాచకములగుచో నట్లొనర్ప వీలుకాదు.

ప్రాయికముగాస్తనాదుల జాతిద్విత్వావిష్టము ౧౪ సూ.

వనితల కుచాదికములవర్ణించునపుడు ప్రాయికముగా వానిని రెండుగానే వర్ణించుట యుక్తము. కాని యొకటిగావర్ణింపరాదనుట.

ఉదాహరణము :—

"ఎలదోటల్ వనముల్ వధూకుచముల ద్రింద్రంబులు"

వ్యతిరేకమున కుదా : "సరసుల్" చూ. 108 పే

ప్రాయికముగాననుటవలన నొకయెడ ద్విత్వమురాదు.

ఉదాహరణము :-

"ఇంతులందగిలి నీపై జూడ్కి నెక్కొల్పి"

విరాటపర్వము ౧ ఆ. ౩౨౧ ప.

"కీచకుఁ డిచ్చినాడిన నాడె చూడుఁడు"

విరాట పర్వము–౩ ఆ. ౯౧ ప.

"అయితే జాతి ద్విత్వావిష్టమగు టెట్లు? అవి ద్రవ్యమునందు గదా యుండును. జాతి యందుకాదే? జాతి ద్రవ్యరూపము కాదుగదా?" యనిన సమాధానము:—జాతి ద్విత్వరూపమే. ఆవిషయము జైనులెఱుఁగుదురు. మేము లక్ష్యము సిద్ధించుటకై సిద్ధమగు పరుల మతమునను వదింతుము. ఇదియుక్తమా? ఎవడైన నేదో యొకమతము నను సరించి యేమైన నిట్లు సమర్థింపవచ్చునుకదా? అట్లుగాదు; న్యాయము లక్ష్యము ననుసరించియుండును కావున నేదైన నిట్లు సమర్థించుట కవకాశము లేదు. అట్టి లక్ష్యము లుండవలయునుగదా। ఉండినచో యుక్తమె, లేనిచో నది న్యాయాపేతమగును. ఇట్టిదైన మహాకవ్యవస్థకూడ నూహింపవగును. లక్ష్యముల ననుసరించియే యేన్యాయమైనను నేర్పరుపబడెననియు దద్విరుద్ధముగా నేదియు నేర్పరుపరాదనియు నిందుగల సారాంశము.

ఇయ్యది ఆంధ్రకావ్యాలంకార సూత్రవృత్తియందు
పంచమాధికరణమున ప్రాయోగికమను
నధ్యాయము పరిసమాప్తము.



కౌండిన్యగోత్రుడును వేదాల రంగమాంబానరసింహాచార్యుల పుత్రుడును
శ్రీరాధారమణ పాదసేవకుడునునగు న్యాయశిరోమణి తిరువేంగళాచార్యుడు
రచించిన ఆంధ్రకావ్యాలంకార సూత్రవృత్తి సర్వము సంపూర్ణము
శ్రీరాధారమణార్పణమస్తు
శ్రీః
ఓం తత్సత్



# అ ను బం ధ ము

[37 పే.] ఇచటి వ్యాఖ్యానగ్రంథము మొత్తము నభిప్రాయమిట్లుండునది. "వాచకములు లేకున్నను ద్యోతకములున్నంత మాత్రమున నర్థమునకుపపత్తి సామంజస్యముండును" అను ప్రసంగమున మను చరిత్ర పద్యపు విచారణ యెత్తుకొనబడినది. "కొరవింపదమ్మా" అని యసలు పాఠము. ఇది శ్లేషస్థలమని శ్రీశాస్త్రులవారి యభిప్రాయము. అపుడు అప్రకృతమగు చోరార్థమున "కొలుకౌదమ్మా" అని యుత్వముతోడి పాఠముండవలయును. అట్లులేదు కావున నిచట నప్రకృతార్థము సమన్వితముకాలేదు. అని వారివాదసారాంశము.

ఇదినిజమునకు శ్లేషస్థలముకాదు. వ్యంగ్యస్థలము. శ్లేషస్థలమును కానినను "సబిందుకాబిందు కయో: సవిసర్గావిసర్గయో:" అను న్యాయమున నీయుత్వము లేకపోవుటదోషముకాజాలదు. నిజమునకిదివ్యంగ్య స్థలమే కావున నిచటనుత్వములేదను విషయమసలు తలంపునకే రాజాలదు. వ్యంగ్యస్థలములందేదో యొక విధమున నర్థస్ఫురణమే యభిలషింపబడును కాని వాచకములేయుండవలె నను నియమములేదు. ఇందుకు ప్రమాణము వామనాచార్యుని "చకాశేపనస" యనుశ్లోకోదాహరణమును ధ్వన్యాలోకమునందలి "అత్రాన్తరే కుసుమసమయయుగముపసంహరన్న జృమ్భత ఫుల్లమల్లికాధవళాట్టహాసో గ్రీష్మాభిధానో మహాకాల:" యనువాక్యమును. పైరెండుస్థలములందును క్రమముగా "శేష:" "కుసుమశరం" అనిలేకున్నను నప్రకృతమగు నర్థముస్ఫురించి సమన్వితమగుచున్నది. కావున నీతీరుననుసరించి మనుచరిత్ర పద్యమున నేమియులోపము లేదని తెలియవలయును" అని మాసిద్ధాంతము.

[46 పే.] "అజగవశాస్త్రాలంకృత" యను పద్యమున గ్రమభంగమున్నదని తలంచితిమికాని బాగుగాబరిశీలించినచో మాదేపొరబాటు.

తిక్కనగారి యుపోద్ఘాతములో "హరిహరనాథుడు" అఖండ వ్యక్తియగు పరమాత్మయేకాని యందు హరిహరులక్రమసమావేశము గాని వ్యక్తివిభాగముగానిలేదు. ఈ విషయమున వారిపద్యములే ప్రమాణము. "శ్రీయనగౌరినాబరగు చెల్వకు చిత్తము పల్లవింప భ ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపముదాల్చి విష్ణురూపాయనమ శ్శివాయ"యని పల్కెడు... చెల్వకే "శ్రీ" యనియు "గౌరి" యనియు నామములు. అట్లే విష్ణురూపుడగుశివుడు. అనగా శివకేశవ భేదము లేక నామద్వయమున శోభితమైన యఖండాద్వితీయమగు పరబ్రహ్మమే హరిహరనాథుడు. ఇదియేవారి వైదికధ్యాయితావిషయము. మరియు "కేమస్తిమాలాంకేము కౌస్తుభంవాపరిష్క్రియాయాంబహుమన్య సేత్వం కంకాలకూటఃకేమువాయశోదాస్తన్యం తవస్వాదు వదప్రభోమే" యను శ్లోకమునగూడ హరిహరనాథునందు వ్యక్తివిభాగములేదని స్పష్టపరచినాడు. ఇట్టియెడ విభాగసాపేక్షమగు క్రమమున కవకాశమేది ? కావున నైపద్యమున హర కృత్యములు మొదలను హరి కృత్యములు తరువాతను నున్నవనికాని, మొదటిచరణము నందలి క్రమమును గణింపక నాలవచరణమున హరి కృత్యము మొదలను పిదప హరకృత్యమును నిబంధింపబడినదనికాని దోషమెన్నుట కవకాశములేదని స్పష్టము.

[87 పే.] ఏకాన్తర పాదాదియమకోదాహరణముల విషయము. మొదటి యుదాహరణమున పదభంగవైచిత్ర్యములేదు. రెండవ యుదాహరణమున "ముష్కర—హితవృత్తి" యని మొదటి చరణమునను "ముష్క—రహితవృత్తి" యని మూడవ పాదమునను పదభంగము విశేషము. ఇట్లే రెండుదాహరణములున్న ప్రతిచోటను నెదోయొక విశేషము తప్పక యుండునని గ్రహింపవలెను.

ఇచటి టిప్పణపు తత్త్వమిది. "మధుపములు" అనునుపమానగత బహుత్వము ననుసరించి "క్రోలుదును" అను క్రియయందుగూడ బహుత్వముం ("క్రోలుదుముఅని")డ వలయునని వ్యాఖ్యాతయాశయము. అదిపొరబాటు. ఇట్టి యుపమాస్థలములందుపమేయగతవచన

మునను సరించి క్రియకు వచన నిర్ణయముకాని యుప్రకృతమగు నుపమా నము ననుసరించికాదు. ఇచట కర్త యుపమేయముకాని యుపమా నముకాదుకదా ! కర్తృనిష్ఠమగు క్రియకర్తృ వాచకము ననుసరించియే యుండవలయును. కావున "మధుపములు" అను నుపమాన వాచకము ననుసరించి క్రియకు బహుత్వముండవలయునను పక్షం. పోనిందత డన్నట్లు క్రియకు బహుత్వమును గ్రహించినచో నుపపత్తి పోవునా ? పోజాలదు. ఏమి ? ఉపమేయమునకర్త యొక్కటే కావున నుపమాన బహుత్వము వలననేర్పడిన వచనభేదదోషము తొలగుటెట్లు? తొలగదు. ఉపమేయము కూడ బహువచనాంతమే యందురా అప్పుడు ప్రకృతోపమకు వచన భేదదోషమెట్లు ప్రసక్తింపగలదు ? ఉపమానోపమేయములగు మధుపవక్త్రపదములు రెండుసమానవచనకములుగానే యున్నవికదా! ఇక "క్రోలుదును" అను క్రియయందలివచనభేదము "అసాధు" వను దోషమేకాని యుపమాదోషముకాబోదు. కర్తృక్రియలు భిన్నవచనములు గానుండుట వ్యాకరణస్మృతివిరుద్ధము కాని యుపమకు విరుద్ధమెట్లగును? కావున వ్యాఖ్యాత వ్రాసినదోషనిరూపణమంతయునయుక్తమని స్పష్టము. అసలిచటినిజమేమనగా—"తుమ్మెదలు పూవునువలెనేనామెలోచనముల గ్రోలుదును." అని యిచటివాక్యము. ఇందుపమానములు "తుమ్మెదలు, పూవు" ఉపమేయము "నేను" "లోచనములు". ఇచట మొదటి యుపమేయము నందేకవచనమున్నది. మొదటియుపమానమున బహు వచనమున్నది. రెండవయుపమేయమున ద్వివచనమున్నది. రెండవ యుపమానమునసేకవచనమున్నది. ఇట్లు రెండురకముల వచనభేదమును ఇచట గ్రహింపవలెను కావున నిటవచనభేదమను దోషముపమయందే ర్పడినది. ౨౦–సూ.

[111 పే.] ఇచట నీవిశేషము తెలియదగినది. "చంద్రికలేతనుకంజూ చెలతాంగి ఘూసురుప్రఫుల్లనేత్రపద్మంబులన్" అను మనుచరిత్ర పద్య భాగమున నీయనుపపత్తిదోషమున్నదని కొంతమందికి భ్రాంతియున్నది. వారియభిప్రాయమిది. "వరూధినినేత్రపద్మములందు జంద్రికలు తనుకుటయ యుక్తము పద్మములందు వెన్నెలలుండవుకదా!" యని.

కాని నిజమునకు ఇచట పద్మములకును వెన్నెలలకును సంబంధమునుడువ బడనేలేదు. ఇది రూపకస్థలముకాదు. అపుడే పద్మములకు ప్రాధాన్యము వచ్చును. అట్లగుచో "చూచెన్" అనుక్రియ సమన్వయింపదు. పద్మములతో చూచుట కుదురదుకదా! కావుననుపమ యొనర్పవలయును అనగా "తామరలవంటి కన్నులు" అని యుపమితసమాస మొనర్పవలెను. అపుడు పద్మములకు ప్రాధాన్యములేదు. నేత్రములకే కావున పైచెప్పిన విరోధమురాదు.

అయితే చూచుటయను క్రియకుదురదనికదా! నేత్ర పద్మంబులన్ అనుచోటను పమితసమాస మొనర్పబడినది? అట్లగుచో "ప్రసన్నేన దృగబ్జేన వీక్షతే మదిరేక్షణా" యను పరిణామాలంకారోదాహరణముతో "దృగబ్జేన"యనునది రూపక సమాసమెట్లు కుదురును? అచట మాత్రము వీక్షణక్రియావిరోధమురాదా? పోనిండచట గూడను పమితసమాసమే యనుచోనిది పరిణామాలంకారమునకు ఉదాహరణమెట్లగును? ఇటులిది రెండుప్రక్కల నుచ్చులుగల తాడైనదే! సమాధానము చెప్పెదము వినుడు.

అచట నుపమితసమాసమొనర్ప వీలులేదు. ఏల? "ప్రసన్నేన" యనిసామాన్య ధర్మమిచ్చట ప్రయోగింపబడినది. "ఉపమితం వ్యాఘ్రాదిభిస్సామాన్యా ప్రయోగే" యనికదా నియమము. అయితే రూపక సమాసము (విశేషణసమాసము)నందు వీక్షణ క్రియావిరోధ మెట్లువారింపనగును? అను ప్రశ్నయున్నది. అందుకొరకే "యారోపితమగు పద్మముపమేయ మగునేత్రరూపమున బరిణమించి ప్రకృతక్రియయగు వీక్షణమున కుపయోగించును" అని యంగీకరింపబడినది. కావుననే యిచట బరిణామాలంకారము. ఇట్లిచట రూపక సమాసమున నేమియు నడ్డము లేదని తేల్చితిమి. ప్రకృతస్థలమున (నేత్రపద్మంబులన్) అను చోటనుపమాసమాసమున కేమైననడ్డుకలదా? "చంద్రికల్ తనుకుట" పద్మములకు సంబంధింపదు కావున సామాన్యధర్మముకాదు. ఇక నుపమిత

సమాసమేల చేయరాదు? నిజమునకు "పద్మంబులన్" అనునది లేక పోయినను "చంద్రికల్" అనునది ముఖ్యార్థము కాదు. గౌణార్థము. నేత్రములకు మాత్రము చంద్రికలు తనుకుచుండునా? కావునగన్నుల మెఱుగులో లేక ప్రేమతరంగములో చంద్రికలుగా నభ్యసింపబడినవని గ్రహింప వలయును. ఇట్టి స్థితిలో పద్మంబులకును వానికిని విరోధ మెట్లేర్పడును? అది సాహాయకమెట్లగును? అసలే పద్మములు నేత్ర విశేషములు కావున చంద్రికలతో సంబంధ ప్రసక్తి లేదు. ప్రాధాన్య మెట్లో తెల్పినను గౌణార్థకమగు "చంద్రికల్" అనుదానితో విరోధము రాజాలదు గౌణపదములక్షలములందు ముఖ్యార్థ విరోధము దోషము కాజాలదుకదా. "పశ్యనీలోత్పలద్వంద్వాన్నిస్సరన్తి శితాశ్శరాః" యనుస్థల మును బరికింపుడు. కావున "చంద్రికలు తనుకునట్లు సహాధిని ఘనుడని జూచుట" యేమాత్రమును దుష్టము కాదని తెలియునది....

[115 పే.] "చంద్రమండలముతే" యని. పైపద్యమునగేవల నిషేధము మాత్రమే ఈపద్యమున ముఖ్యాహ్నవము తాత్పర్యలభ్యము కాని వాచ్యముకాదు. మరియు పర్యవసానాలంబనకమగు చంద్రమండలత్వమును దిరస్కరించుటయు కేశములందళి త్వాధ్యవసానమును బురస్కరించుకొని జలజాతత్వము వాక్యతాత్పర్యబలముచేనారోపితమగుటయు విశేషము ఇట్టివిశేషము తరువాతిపాదములందుగూడ గ్రహింపవలయును.

[116 పే.] "ఎలదోటల్యానముల్" అనిపైదానియందొక్క వనితలయందే కందర్పాస్త్రత్వాదులా రోపింపబడినవి. రెండవపద్యమున నొక్క సమాజములోని వానికినిమరొకసమాజములోని వానికినివానివాని యుప యోగసామ్యయుక్తుల ననుసరించి యారోపము సమకూర్పబడినది.

[121 పే.] "ఈయధ్యవసాయము" అని. ఇచటమూలములో "సాదృశ్యాది యముత్ప్రేక్షేతి. ఏనాంచేవాది శబ్దాః ద్యోతయన్తి" అనియున్నది, వ్యాఖ్యా తయిట్లర్థము చెప్పినాడు. "ఉత్ప్రేక్షోదాహరణములందు కొన్నిచోట్ల "ఇవ" శబ్దము వినబడుచుండుట వలన నెవ్వనికైన "నుపమ" యను

సందేహము కలుగవచ్చును. దానికి సమాధానమిది. అనగా ‘‘ఉత్ప్రేక్షో దాహరణములలో ‘‘ఇవ’’ శబ్దమున్న యెడల అది సాదృశ్యమూలక మగుటను సూచించిదానిమూలమునను త్ప్రేక్షను గూడా సూచించును.’’ అనిభావము అని. ఇదియంతయు పొరబాటు మూలకారుడు ‘‘ఇతి’’ శబ్ద ముతో వాక్యమును ముగించి ‘‘ఏనాంచేవాది శబ్దాః ద్యోతయన్తి’’ యని విభిన్నవిషయమును నిరూపించుచుండగా నీరెండువాక్యములకును సం బంధము కుదుర్పబోవుట యుక్తముకాదు. పోనిండు మూలవిరుద్ధమై నను వ్రాసినవి సరిగానున్నదేమో యనిననదియులేదు.

ఇవాదులుత్ప్రేక్షను బోధించునపుడు ‘దేవదత్త ఇవదృశ్యతే’ ఇత్యా దిస్థలములందు ‘దేవదత్తునిగా’ అను నూహనుమాత్రమే చెప్పునుగాని సాదృశ్యమూలకత్వమును గూడనుత్ప్రేక్షకు జెప్పజాలవు. ‘దేవదత్తుని వలె దోచుచున్నది’ యనుచోట ‘వలె’ యనునది యూహాప్రకారమును బోధించునుగాని ‘‘ఉత్ప్రేక్ష సాదృశ్యమూలకము’’ అను విషయమును బోధించునా? ఇట సాదృశ్యమునకు బోధనముగాని సూచనముగాని యావశ్యకమా? ‘‘ఉత్ప్రేక్షా ప్రకరణమున పై శబ్దములు సాదృశ్యమును సూచింపవలెనని మేమనుటలేదు. కాని సాదృశ్యసంభావననుగూడ సూచింప గల్గునని మాయాశయము’’ అని కదాయప్పయ్య దీక్షితులు కువలయానందమున వ్రాసిన పంక్తులయాశయము. ఇటనివాది శబ్దములు సంభావనసాదృశ్య మూలకమని సూచించుటగాని అట్లు సూచింపవలసిన యవసరముగాని లేదు. అట్లు సూచింపకున్న, సంభావనను బోధింప జాలదా? ఇవాదులుత్ప్రేక్షావ్యంజకములనెడి దండివాక్యమునే యనుస రించి పై వాక్యములను మూలకారుడు వ్రాసియుండునను భ్రాంతిచేవిభిన్న విషయకములగు పై రెండు వాక్యములనేదో విధముగానతికివ్యాఖ్యాతపై పొరబాటును గావించి యుండును. ఇదియే యిందలి రహస్యము.

[123 పే] ‘‘చిన్న మిటారులో’’అని. ఇచట కొందరు అతిశయోక్తి యని యనుకొందరు. అప్రభచరులకు వీరచ్చరలని తెలిసియు చిన్నమిటారులో

చికిలిచేసిన మాయని చిక్కటితావలో' అను నిశ్చితిగా ననుట సంశయము కాదు. ఏమి? సంశయమనాహార్యాత్మక జ్ఞానముకదా! ఇదియాహార్య జ్ఞానము. 'ఇచ్చకుమెచ్చగ' అనుపదమునర్థముకూడ నీయభిప్రాయమునే దృఢపఱచును. 'అభ్రచరులుసంశయించుటలేదు. వారిసౌందర్యాతిశయమును 'వెన్నెలగుమ్మలో' యనుతీరున మెచ్చుకొనుచున్నారు? ఇది యధ్యవసాయముగాని సంశయముగాదు." అని వారి యభిప్రాయము.

అది సరికాదు. ఏమన? సంశయమాహార్యముగాకుండ నుండ వచ్చును. శాస్త్రజ్ఞులే మెచ్చుకొన్నారు. మఱియు ప్రకాశ్వరము లందెట్లైనను కావ్యసమయము నందాహార్య సంశయము తప్పదు. కావ్యగ్రథితులగు వక్తలకందరకును సంశయము కల్పించుటలో కవు లెట్టియభిప్రాయముతో నున్నారు? ఇట్టి సాదృశ్యసంశయములందుతప్ప కుండా యసలువస్తువు నెఱింగియు నా వస్తువున కతిశయమునమకూర్చు టకే కదాసంశయములు కల్పింపబడుచుండును? కావునవస్తుతత్త్వజ్ఞానము తోడికావ్యములగల సంశయములన్నియు నాహార్యసంశయములే అసలు శాబ్దజ్ఞానము. అందును కావ్యములందు గద్యనది బాధజ్ఞానమునకు లొంగ దనియు. ఇచట వాస్తవికత్వావాస్తవికత్వ విచారము కూడదనియు ప్రాచీనులగు నాలంకారికులు నిర్ణయించి యున్నారు. "ఇచ్చకుమెచ్చగ" యనునది 'సౌందర్యమును మెచ్చుకొన్నారని' తెల్పినను "వారచ్చరలు" అని తెలియుననుట కదిజ్ఞాపకముకాదు. కావున, సంశయమాహార్యము కాగూడదనునియములేదు కావునను, నిటసందేహాలంకారమును గురించి యాశంకింపరాదు.

[124 పే.] "ముసుగువెట్టిననేమి" యని, ఈపద్యమున "ముసుగువెట్టు" యనియీా తీరుగా క్రియచెప్పబడినదేకాని "నిషేధము" చెప్పబడలేదు కదా! లక్షణమెట్లు సరిపడును! అని సంశయింపవలదు.

ముసుగువెట్టుట—బయల్పరుపకుండుటయని యర్థము కావున క్రియానిషేధము కుదిరినది. పదముల కిట్లర్థముసుడువుటలో వామనా

వాక్యని విశేషోక్తి సూత్రవృత్తియే ప్రమాణము. "జంగమ శబ్దస్యస్థావరత్వనివృత్తి ప్రతిపాదనపరత్వాత్" ("నడచెడు" అనుపదము కదలకుండుటను నిరసించుటకే నుడువబడినది) (చూ. విశేషోక్తివృత్తి 130 పే సూ. ౨౩) అని యుపటి వాక్యము.

[125 పే.] "వాంఛముఖేందు, అని. "ఎట్లుపోల్చినన్ పోలదా" అనునది. "ఆ రతము పోలగనిత్రయియె సుగల్గునే?" యను వాక్యార్థముచే నుపష్టమై "ముఖకాంతియానలీలాదులు తమలో బరస్పర ముపమింప దగును" అనియుపమేయోపమాస్వరూపము సమర్పించుచున్నవి. "ముఖకాన్తియానలీలాదులకువానిలోవానికైనాకొంతపరస్పరము పోలిక కుదురవచ్చును కాని త్వద్రతముతో సమానమైనది మాత్రమీప్రపంచమున వేఱొకటిలేదు, అని యనన్వయ మిటనున్నది.

[127 పే.] అంత్యదీపకోదాహరణమునుగురించి.....

సరసులకింపుగావు" అనుదానితర్వాత "సుగుణాకర! పెమ్మయ సింగధీమణీ" యని యున్నది కావున నంత్యదీపక మెట్లగును? క్రియ చివరనున్నగదా యన్త్యదీపకమగును? అని యాశంక కల్గును.

క్రియవాక్యావసానముననున్నచోనన్త్యదీపకమగును. వాక్యమును బట్టియే యాదిమధ్యావసానములు దీపకమునకేర్పడును. ప్రకృతోదాహరణమున క్రియ వాక్యావసానముననేయున్నది. "సుగుణాకర పెమ్మయసింగధీమణీ" యనునవి సంబోధనములు. అవిపైవాక్య ఘటకములుకావు. ఇవిస్వతంత్రములు. సంబోధనాన్తములకు వాక్య ఘటకత్వములేదని వ్యుత్పత్తివాదాదిశాస్త్ర గ్రంధములందు నిర్ణయింపబడి యున్నది. మధ్యదీపకములో "సుద్దులు వేయునేల" ఇత్యాదివాక్యమొకటి పైవాక్యముతో నేకవాక్యతాపన్నమగునది క్రియకు దర్వాతనున్నది. కావున నదిమధ్యదీపకమగుట సరిపడునని గ్రహింపవలయును.

[138 పే.] చి. నిరూపణముచేసెను.

ప్రకృత విషయమున నింకొకవిచారము మాట్లాడినను నొకయాశంక పుట్టకతప్పదు. ఏమనగా 'పదపల్లవంబు ఫలితాగ్రకంట కవితానము' అనుచోట పల్లవమునకు కంటకవితానము తాకిన నొప్పుటన్యాయము. ఇట్లే యంబుజములంపు మదభృంగవాలంబు వ్రాలుటకుదుడునుగాని వదనమునందు వ్రాలుటకుదురదు. ఇట్లే సంస్కృతములోని వామనాచార్యుని యుదాహరణము 'పశుపతిరలోకవల్లికందః ? అనుచోట (తీవవంటి పదునాలుగు లోకములకును మొలకెత్తించునట్టి నారాయణుడు) గూడ తీవకు దుంపయుండునుగాని లోకములకును దుంపకును సంబంధమేమి ? ఇట్లే 'సహకారాధిపు' 'జలధరంబు' అనుచోట్లగూడన నుపపత్తులు గ్రహించునది. ఇట్లీయనుపపత్తులన్నియు మొదలనుపమిత సమాసగ్రహణమువలననేర్పడుచున్నవి. అపుడేకదా పైజెప్పిన స్థలముల నంతటను నుపమేయములకు ప్రాధాన్యమేర్పడును. ఇక రూపక సమాసము (విశేషణసమాసము) నాశ్రయించుచోనిదిరాదు. అపుడు పమానములే ప్రధానములు కావున పైజెప్పినట్లు పపత్తులుగ్రహించునది. ఇట్టిస్థితిలో నుపమితసమాసమెనర్చుటలో వామనుని యభిప్రాయమేమి? దీనికి సమాధానమిది. అసలు రూపకము ఎచట జెప్పుట న్యాయ్యము, ఎచట నుపమన్యాయ్యము అనువిషయమును మనము బాగుగా నాలోచించినచో నిందులోగల రహస్యమంతయు బోధపడును. అసలు రూపకమనగానేమి ? ఉపమానముతోనుపమేయమున కభేదారోపము గదా ! అదిదేని నాధారముగా గొనియేర్పడును. గుణసామ్యమును. అనగా గౌణవృత్తిరూపకమునకు మూలమని తెలిసినది. దీని పిండితార్థమిది. లోకముననుపమానోపమేయములుగా ప్రసిద్ధినొందినవానికి గాని, కవిచేనట్లుకల్పింపబడిన వానికి గాని గుణ సామ్యమును బురస్కరించుకొని యభేదమునుడువ వలసివచ్చినచో రూపకమనుట యుక్తము. ఇకనుపమకుస్థలమేదనగా పై జెప్పిన రెండువిధములగు నుపమానోపమేయములకునభేదము చెప్పవలసిన యావశ్యకత లేక

యౌపమ్యము నుదుపుటకవకాశముకలస్థలము. చూడుడు. 'ముఖమును చంద్రునివలె జూచుచు' అనుచోటగాని 'ముఖచంద్రుడు' అనుచోటగాని అభేదము చెప్పకున్నచో పోయెడిదేమియులేదు. ఔపమ్యమునుదుపుట కవకాశమున్నది. కావుననిదియుపమాస్థలము. ఇక 'కందర్పాస్త్రములు' 'ఎలదోటల్పూనముల్' అనుచోటులందు సామ్యమునుదుపుట కవకాశము లేదు. 'సామాన్యములకభేదము సంబంధము' అను శాసనముననుసరించి ఉపమానోపమేయములగు కందర్పాస్త్రవనితలకును,ఉద్యానవనములకును నభేదముచెప్పితీరవలయును. కావున నిటరూపకము.

సరియే! రూపకోదాహరణములలో మాకువిప్రతిపత్తియేమియు లేదు. ఇకనుపమోదాహరణములలో 'ముఖచంద్రుడు' అనుచోట రూపక మేలచెప్పరాదు? వెనుక జెప్పినట్లుపమవలననునుపపత్తులుగూడనేర్పడును కదా! అని యాశంకింపకుడు. 'ముఖచంద్రుడు' ఇత్యాదిస్థలములందు నిజమువిచారించినచో రూపకమునకవకాశములేదు. ఏమి? 'విశేషణం విశేష్యేణ బహుళమ్' అనుసూత్రముననుసరించి విశేషణ సమాసముగా దానినంగీకరించినపుడుకదానచటమీకురూపక మేర్పడును,అసలాసమాసమే యచటచేయుటకుపీలులేదు. విశేషణమువిశేష్యముతో సమసించునపుడు పై సూత్రము ప్రవర్తించును. చంద్రునకు ముఖము విశేషణముకాదు. ఉపమానమగును. చంద్రునియందుండి అతనిని నితరమునుండిభేదింప జేయునదిగదా చంద్రునకు విశేషణమగును. అసలు విశేషణములు నాలుగు విధములు. జాతి, గుణ, క్రియా, ద్రవ్యములు. 'ఇదికుండ' 'ఇదినల్లనికుండ' 'ఇతడువంటవాడు,' 'ఇదికొమ్ములుకది' అనిక్రమ ముగానుదాహరణములు ద్రవ్యము విశేషణ మగునపుడుమతుబాదులు (కలవాడు, కలదియను నర్థమునుదుపునవి) చేరవలసియుండును. ఏల? జాతిగుణ క్రియవలెప్పుడును పరనిష్ఠములే. అనగా స్వతంత్రముగా నిలువలేనివి. ద్రవ్యమన్ననో అట్టిదికాదు కావున కడమవానివలె మతు బాదులులేకుండ విశేషణము కాజాలదు. కావుననే విశేషణములు స్వని ష్ఠములు పరనిష్ఠములని రెండు విధములుగా విభజింపబడి మతుబాదులు

లేకుండగనే యితరాన్వయులగుట పరనిష్ఠముల లక్షణమని ప్రాచీనులు వ్రాసిరి. అదియట్లుండనిండు. ప్రకృతమున ముఖము దర్శ్యము అనగా స్వనిష్ఠము. ఇది చంద్రునకు విశేషణముగా నన్వయింపవలెననినచో మతుబాదులులేనిదేయెట్లు? పోనిండు 'అర్శ ఆది భ్యోఽచ్' అనుసూత్రము ననుసరించి అజంతముగా గ్రహించి విశేషణమనుకొందమన్నను నిది చంద్రుని యందుండదుగాన విశేషణము కాజాలదు. ఇట్లు విశేషణ విశేష్యభావములే నందున విశేషణ సమాసము పనికిరాదు. ఇకనేమి చేయవలయును. ముఖపదమునకు ముఖతుల్యమని యర్థముచెప్పి (గౌణవృత్తి నవలంబించుటచే) విశేషణ సమాసము జేయవలయును. ఇది కొంత వరకు నైయాయికాదులంగీకరించినను వైయాకరణ సిద్ధాంతమునకు విరుద్ధము ఏమి? ఇతరులమతములలో సమాసము నందఖండ శక్తిని (బోధకత్వమును) అంగీంకరింపలేదు. కానవారికి సమాసైక దేశమగు ముఖపద మునందు ముఖతుల్యమను నర్థమునకై గౌణవృత్తి నవలంబింపదగును. కాని సమాసము నందఖండ బోధ కత్వమును (శక్తిని) అంగీకరించిన వైయాకరణులకు ముఖపదమునందు గౌణవృత్తికవకాశమేది?

అదికాదు. ముఖముచంద్రుడు అను విగ్రహములో గౌణవృత్తిని గల్పింతుము అనియందురేమో! అదియుకుదురదు. అసలీరెండును నుపమానోపమేయములని లోక ప్రసిద్ధములు. వీనికి 'చంద్రునివంటిది ముఖము' అని విగ్రహవాక్యమొనర్చినచో లోక ప్రసిద్ధమగు నర్థము సరళముగా వచ్చుచుండగా ననావశ్యకముగా గౌణవృత్తినాశ్రయింపనేల? అట్లాశ్రయించినను నపుడు వచ్చునర్థము ముఖమువంటి చంద్రుడు అనితల క్రిందుగానుండును. చంద్రుడు పమానముగాని ముఖము కాదుగదా! కావున నిది యత్యంత మసంగతము.

పోనిండు. 'మయూరవ్యంసకాదయశ్చ' అనుసూత్రముచే నిచట సమాసమును కుదుర్తమన్నను సరిగాలేదు. 'ముఖచంద్రుడు' అను

స్థలమును పురుషవ్యాఘ్రాదులలో జేర్చి 'ఉపమితం' అను సూత్రమునకు లక్ష్యముగా నొనర్పవలయునా? 'మయూర వ్యంసకాదయశ్చ' అను దానికి లక్ష్యమొనర్పవలయునా? విచారింతము.

పురుషవ్యాఘ్రుడనునట్లు ముఖచంద్రుడనునది ఉపమానోపమేయ పదఘటితస్థలము. ఉపమానోపమేయభావమే ఉభయత్ర నిరూపింప దలచినది. కావున వెనుకజెప్పినట్లుగా ఆదిశబ్దార్థమగు ప్రకారము వ్యాఘ్రాదిగణమునకు సంబంధించినదే ముఖచంద్రుడను చోట స్పష్టముగనున్నది. గాననిదియుపమితసూత్రమునకే లక్ష్యమగుటసమంజసము. ఇక మయూరవ్యంసకాదులు సహజముగా విశేషణవిశేష్యభావము కలిగి విశేష్యము ముందును, విశేషణము తర్వాతనునున్న సమాసములు. చూడుడు వ్యంసకమగుమయూరము—మయూరవ్యంసకము. ప్రాయికముగా నిట్టిస్థలములే పై సూత్రమునకు లక్ష్యములు. ఎప్పటనైనపై దానికి విరుద్ధములగు లక్ష్యములు నవి సూత్రాంతరముల చేసమర్థింపబడనపుడే యీసూత్రము క్రిందికి గొనిరాబడును. ఇట్టి స్థలములకును ముఖచంద్రుడను స్థలములకును ఏ విషయమునను పోలికలేదు.

అటుకాదు, పోలికయున్నది. 'చంద్రుని వంటి' అను విశేషణము తర్వాత నుండుటయు ముఖమను విశేష్యము మొదటనుండుటయు అను విషయమున సామ్యమున్నదికాదా యని యందురా? అదితప్పు. "మయూరవ్యంసకము" అను పదము విన్న వింటనే సహజమగు విశేషణ విశేష్య భావము స్ఫురించినట్లు "ముఖచంద్రుడు" అనునదివిన్న వెంటనే స్ఫురించునా? ఉపమానోపమేయ భావమే స్ఫురించును. ఇట్లా సమాసము విన్నవెంటనే యెట్టియర్థము స్ఫురించునో తదనుగుణమగు విగ్రహమే యొనర్పదగునుకదా! కావున నుపమిత సూత్రమునకే దీనిని లక్ష్య మొనర్పదగునుకాని "మయూరవ్యంస కాదయశ్చ" యను దానికి లక్ష్య మొనర్పదగదు. అది యుంగాక "ముఖచంద్రాదులు"

ఇట్లే విగ్రహమొనర్పవీలగుచో "ఉపమితం" అనుసూత్రమేల ! "పురుషవ్యాఘ్రాదులన్నియునిట్లే విగ్రహమొనర్చి "మయూరవ్యంస కాది" గణములోనే చేర్పవచ్చునుగదా ! ఆమహర్షి పాణిని యీవివేకమును గ్రహించియే "ఎచట నుపమానోపమేయ భావము స్ఫురించునోయచటనెల్ల నుపమితం"అను సూత్రము ప్రకారమును "ఎచట వ్యత్యస్త విశేషణ విశేష్యభావము స్ఫురించునో యచటనెల్ల "మయూరవ్యంసకాదయశ్చ"అను సూత్రము ప్రకారమును విగ్రహమొనర్పవలయునని రెండు సూత్రములను వ్రాసియున్నాడు. ఆమహానుభావుని యూహను "ఉపమితం" అను సూత్రారంభమే స్పష్టపరచుచున్నది. ఇది యసలు తత్వమైయుండ" ముఖచంద్రాదులు" "మయూరవ్యంస కాదయశ్చ" అనుదానికి లక్ష్యములనుట సరియగునా ?

అదికాదు ! గౌణవృత్తినాశ్రయించునపుడు "ముఖమువంటిది చందమామ" యనికాని "చందమామవంటిది ముఖము" అనికాని విగ్రహమేలచెప్పవలయును ? "ముఖము చంద్రుడు" అనియే కదా విగ్రహవాక్యము. ఈ రెంటికిని విశేషణవిశేష్యభావమెట్లుకుదురును ? అను ప్రశ్నకుసమాధానము కొరకేకదా గౌణవృత్తినాశ్రయించినది ? దీనివలన "ముఖాభిన్నుడు చంద్రుడు" అనియే అర్థమేర్పడును. వెనుకటిమీయను పపత్తులన్నియు దొలగిపోవును.

ఇదియుబొరపాటే. దీనివలననింకను చిక్కేర్పడును. అసలీగౌణవృత్తి విగ్రహములోనా ? సమాసములోనా ? మొదటిదానికి "ఉపమితం" అను సూత్రమువలననిట్టి స్థలములందట్టి విగ్రహ మొనర్ప రాకుండుటయేబాధకము. "ఉపమవివక్షించునపుడు అట్టి విగ్రహము పనికి రాకున్నను రూపకమును జెప్పదలచినపుడు పనికివచ్చును. సమాసమువైవక్షికముకదా !" అనియనరాదు. ఇట్టి స్థలములందు పురస్ఫూర్తికమగు నుపమనే లోకము గ్రహించునుకాని రూపకమును గ్రహింపదు. సమాసమువైవక్షికమైనను లోకప్రసిద్ధి విరుద్ధమగు విగ్రహమునొనర్పరాదు. అనగా సమాసస్థలములందు లోకప్రసిద్ధి

విరుద్ధములగు నర్థములను స్ఫురింపజేయు విగ్రహములనుడువరాదు. ఈ విషయమును వామనాచార్యుడే అయిదవయధికరణమున మొదటి యధ్యాయములో 7, 8, సూత్రములందు వ్యక్తపరుపబోవుచున్నాడు.

అట్లగుచో "వార్లహరీస్వేదము" మొదలగు ప్రయోగములం దెచ్చటను రూపకమాశ్రయించుటకు వీలుకాకపోవును. ఇట్లే చాల మందిమహాకవుల పరంపరితరూపకములు కుదురక పోవలసివచ్చునే.

సరి! ఇక నిల్వుడు. వానికన్నిటికిని తగిన యుపపత్తులున్నవి. నిజము నకుపమానోపమేయభావము పురస్స్ఫూర్తికమగుచోటనెచ్చటను రూపకముచెప్పదగదు. కారణమేమి? ఉపమితసమాసములో శబ్ద స్వభావమునునుసరించి జఘన్య వృత్తికి (గౌణవృత్తికి) ప్రసక్తి లేకుండగనే నిర్వహించును. కావునను పమాస్ఫూర్తి నిర్బాధకమైముఖ్య వృత్తిచేతనే సంపన్నమగును. ఇకరూపకమాశ్రయించుచో ముఖ్యవృత్తి బోధ్యమగు" ముఖాభిన్నుడు చంద్రుడు" అనునర్థముబాధితమై జఘన్యయగుగౌణవృత్తి నాశ్రయింపవలయును. అపుడు చంద్రభిన్న మైననుముఖము గుణములచే జంద్రునికన్న వేరుకాదు" అనునాహార్య జ్ఞానరూపమగు రూపకమేర్పడును. ఇది సబాధకమైజఘన్యవృత్తి నాశ్రయించి సంపాదింపబడవలయును. కావున నుత్తమవృత్తి లభ్య మును, బురస్స్ఫూర్తికమును నిర్బాదకమును,రూపకమునకు బర్యవసా నసీమయు, నగునుపమార్థము మునుపీడి, జఘన్యవృత్తిలభ్యమును, బురస్స్ఫూర్తికముకానిదియు,సబాధకమును,నపర్యవసాయియు,నుపమా పర్యవసాయియునగు, రూపకమును గ్రహించుట యుక్తమగునా? కాదు. ఇట్టిలాఘవ గౌరవములజాల దూరము పర్యాలోచించియే వామనాచార్యుడు "ముఖచంద్రాదులుపమితసమాసములు కావున రూపక మనుట అయుక్తము." అని స్పష్టపరచినాడు ఇట్లింతవరకుపమాస్థల మేదియోసిద్ధాన్తీకరించితిమి

"ఇకరూపకమేచట గ్రహించుటయుక్తము." అను ప్రశ్న యున్నది. వస్తుతఃభిన్నములగు రెండువస్తువులు (ఉపమానోపమేయ ములుగా లోకమున ప్రసిద్ధములు కాకుండు కవి కల్పింపనిండు. ఏవిధమై నను) సామ్యము నడువుట కవకాశములేకుండ నొకదానితో నొకటి యభిన్నములుగా జెప్పబడు స్థలమున రూపకమనుట యుక్తము. ఎట్లి నగా—"ఈనెలత మొగము చందురుండే నిజముగ" ఇట్టి వ్యస్తస్థల ములందు ద్వైక్యానిషేయభావము స్ఫురించును. ఇటవిభిన్నులగు "ముఖ చంద్రులకుపమానోపమేయ భావమును బోధించు శబ్దసామర్థ్యమేమి యునులేదు. మరియు "నామార్థములకభేదము సంబంధము" అని సర్వశాస్త్రజ్ఞు లంగీకరించిన న్యాయము. విభిన్నములగునీ ముఖము నకును జంద్రునకును అభేదము బాధితము. కావున నీయన్ని విషయ ములను బర్యాలోచించి యిట్టిస్థలములందు గౌణవృత్తి నాశ్రయించి ముఖమునకును జందురునకును నభేదమునను కూర్పబడినది. అది యేరూపకము. దీని పర్యవసానమిది. "ఉపమానము, నుపమేయము విడివిడిగా బ్రయుక్తములై సామ్యబోధకమగు శబ్దసామర్థ్యమేమియు లేనిచోట నభేదమునుతువ వలసినచో నచటరూపక మంగీకరించుట యుక్తము." అని ఈయభిప్రాయమును మనసుననిడుకొని యేవామనా చార్యుడు "ఇయంగేహే లక్ష్మీరియమమృత వర్తిర్నయనయోః" అని వ్యస్తస్థలమును రూపకమున కుదాహరణముగాను, "చతుశ్శర్దలోకవల్లి" అని సమస్తస్థలముపమ కుదాహరణముగాను నిరూపించెను. అట్లు నిరూపించుచు "ముఖచంద్రాదులు పమిత సమాసములు. కావున నచట రూపకమనుట అయుక్తము." అని సందేహము తొలగించుచు నిష్కర్షగా రాయి గ్రుద్దిచెప్పెను. ఆయాచార్యుని సూత్రవైఖరిని ఉదాహరణ వైఖరిని వృత్తి వైఖరిని పూర్వాపర గ్రంథసమన్వయ మును జక్కగాబరిశీలించుచో మనకీ యభిప్రాయము స్పష్టపడిపోవును.

మఱియు నుపమానమాస స్థలములందుకూడదానికి బోధక మగు ప్రబల ప్రమాణమేమైన నున్నచో రూపక మాశ్రయించిననే య చ ట

యర్థమపపన్నమగుచో నాచోటగూడ రూపకమునే చెప్పవలయును. ఉదాహరణము "మాధ్వీకవార్లహరీ స్వేదము జూచి పట్టపగలేలాయింత టన్ సిగ్గులేదహహా యంచు దొలంగినవ్వెఁ జెలిమాపైముద్దరాలయ్యెడన్." ఇచట ముద్దరాలు నవ్వుట మాధ్వీకవార్లహరిని జూచికాదు. ఇకనేమి ? సాత్త్వికభావమగు స్వేదమునుజూచి "పట్టపగ లేమగని గౌగిలించుకొని తత్పారవశ్యమును వెల్లడించుచున్నదే యింతటనైన సిగ్గులేదా ?" యనినవ్వెను. తానుముగ్ధకావున నిగూఢప్రేమయగుటయు లజ్జాలుత్వమును దనస్వభావము కావున దానికి విరుద్ధముగా నున్న యీ విషయమును జూచినవ్వెను. అనవ్వుటకూడ ప్రకటముగానా ? కాదు. అదిముగ్ధా స్వభావమునకుదగునా ? నిగూఢభావత కదాయది ! ఇక నేమి ? చెలిమాపై నవ్వెను, ఇట్లాముగ్ధనవ్వునకు గారణము స్వేద మేకాని "మాధ్వీకవార్లహరి" కాదు, కావున నిచట నుపమితసమాసము బాధితమైనది. రూపకమాశ్రయించిననేయనగా "మాధ్వీకవార్లహరియను స్వేదము." అని రెంటికిని నభేదమాశ్రయించిననే యుపపన్నమగును. ఎట్లు ? ఇచట స్వేదమున్నగాని నగవుకుదురదుకదా ! మాధ్వీకవార్లహరికన్న స్వేదమున కుపమేయముమఱొకటి యిచట లేదుకదా ! ఏకసమాస ఘటితములగు నీరెంటికిని నభేదమాశ్రయింపకున్నచో నసలిచట శబ్దార్థమే యుపపన్నము కాదుకదా ! మరియు మాధ్వీకవార్లహరి కిచట స్వేదరూపమునకన్న వేరురూపమున ప్రకృతమున నుపయోగము లేదుకదా ! ఈయన్ని కారణములవలనను రూపకమే అనగా మాధ్వీకవార్లహరీ స్వేదముల కభేదమే యాశ్రయింపవలసి వచ్చినది, కావున నిదిగూడ రూపకమే.

సరియే ! కాని యీయభిప్రాయమును వామనాచార్యుడెచట నుడివి నాడు ?

నిరూపింతుము. ఈ యభిప్రాయమనగా నేయభిప్రాయము ? ఉపమాస్థలమైనను దానికి బాధకమును, రూపకము నాశ్రయించిననేగాని

యచటి యర్థము కుదురకుండుటయున్నచో నచట రూపకమే చెప్పవలయును అనునదియేకదా ! వామనాచార్యుడు అపహ్నుతి లక్షణ సూత్రవృత్తిలో నీ వాక్యమును వ్రాసియున్నాడు. "ఈరెండు పద్యములందును వాక్యార్థమునకు తాత్పర్యమువలన తాద్రూప్య ప్రతిపత్తి యేర్పడును గాన రూపకముకాదు"అని. ఇందుగల యభిప్రాయమేమి ? తాద్రూప్యము వాచ్యము కానున్నను ప్రకృతము లోననుపపత్తియేమియులేదు కావున రూపకమనవలసిన యావశ్యకతలేదు అనియేకదా ! ఇపుడు "తాద్రూప్యము వాచ్యమైననె ప్రకృత మననుపపన్నమగుచో రూపకమంగీకరింపక తప్పదని స్పష్టపడలేదా ? మరియు విశేషోక్తి సందర్భమున 'ఇది చాలవరకు రూపకమే'అను వాక్యమువలన ఈ క్రిందియభిప్రాయము స్పష్టపడుచున్నది. "రూపక బీజమగు తాద్రూప్యప్రపత్తికే కొంచెము విఘాతము కలిగినను అనగా ప్రకృతార్థము సర్వాంశములందును సామంజస్యము నొందుటకై స్వీకరింపబడు తాద్రూప్యప్రతిపత్తి యితర సహాయమును గూడ బొందుచో నచట రూపకముకాదు.

ఆ సహాయము అలంకారాంతరకృతమగుచో నచట సంసృష్టి. మరియొకటేదైననగుచో విశేషోక్తి" అనియేకదాయచటి వాక్యమువలన దెలియవచ్చునది దీనివలన రూపకమాశ్రయించిననే సర్వసామంజస్యము సంపన్నమగుచో నచటరూపకమేయనవలయుననునంశములభించినది. ఇక నుపమాస్థలమైనను దానికి బాధకమున్నచోననునంశమెట్లులభించునో తెలియపరతుము. ప్రతివస్తూపమ మొదలుకొని నిరూపింపబడు నీ యలంకారములన్నియు నుపమాప్రపంచమేకదా ! ఉపమాప్రపంచమనగా నేమి ? ఉపమాస్వరూపమీయలంకారములన్నిటియందును గనపడుచుండును. ఇవియన్నియు ఉపమాలంకారముయొక్క రూపాంతరములు. అనగాపరిణామభేదములు అనియేకదా! ఇవి యుపమారూపాంతరములు, పరిణామభేదములెట్లయినవి. అచటనుపమాలంకారమనుటకు కావలసిన సామగ్రిలోనేదో లోపముండుటవలన నచట నుపమానుగమమున్నను నాయాచోట్లగల విశేషవిషయములననుసరించి 'ప్రతివస్తు' మొదలగు

పరిణామములైనవి. క్రమముగానుపమానుగమమును, ఉపమాప్రతిపాదనమునకుగల బాధకమును నిరూపింతుము. మొదటప్రతివస్తువునందు రెండువాక్యముల యర్థమునకును తాత్పర్యమువలన నౌపమ్యము స్ఫురించును. గావుననుపమానుగమమున్నది. "ఇవ" శబ్దప్రసక్తియేతీరున గూడనచటసంభవించదు గావున నుపమయనుటకవకాశములేదు. తత్తన్నామభేదప్రయోజకములగు విషయ విశేషములు వానివాని లక్షణములకడనే చెప్పబడియున్నవి కావునవాని నిచట నిరూపింప దొరకొనము. ఇట సమాసోక్తియందు తాత్పర్యమువల్లనే అప్రస్తుతార్థము వాచ్యమగునపుడు ప్రస్తుతము తత్సమానమగు నది ప్రతిపన్నమగును కావుననుపమానుగమమును, పైచోటవలెనేఇవాదిశబ్దములకెట్టిప్రసక్తియు లేదుకావున నుపమాలంకారమనుటకు బాధకమును సమకూడినది. ఇట్లే యప్రస్తుత ప్రశంసయందుకూడ నెరుగునది. ఇకనపహ్నుతి, రూపక, శ్లేష, వక్రోక్తి, ఉత్ప్రేక్షా, అతిశయోక్తి, సందేహ, పరివృత్తి, క్రమ, దీపక, అర్థాంతరన్యాస, వ్యతిరేక, విశేషోక్తి, వ్యాజస్తుతి, వ్యాజోక్తి, తుల్యయోగితా, ఆక్షేప, సహోక్తి, సమాహితములందు నుపమాప్రసక్తి యున్ననునచట నివాదిశబ్దములను ప్రయోగించి సామ్యప్రతిపాదన మొనర్పవీలులేదు. కావున నుపమయనుటకువీలులేదు. పైజెప్పిన యలంకారములలో గొన్ని యుపమామూలకములు. పరివృత్తి, క్రమ, దీపకా, అర్థాన్తరన్యాస. విశేషోక్తి, వ్యాజస్తుతి, తుల్యయోగితా, సమాహితములు తక్క మిగిలిన యలంకారములన్నియునిట్టివే. అన్ని యలంకారములును నుపమాపర్యవసాయులే. అందుపరివృత్త్యాదులు కేవలము సమాపర్యవసాయులు మాత్రమేకాని యుపమామూలకములు కావు పరివృత్తియందు పమాపర్యవసానమెట్లని శంకింపకుడు. పరివృత్తిలోని "సదృశవినిమయము" అను మొదటి ప్రకారములో నుపమానుగమ మున్నదికదా! రెండవది యగు విసదృశవినిమయ ప్రకారముసందుకూడ వినిమయము వలననేయచటివస్తువులకు సామ్యమిచటనించించుకస్ఫురించును. అసలీ రెండుప్రకారములందునువినిమయమువలననే సామ్యస్ఫూర్తియేర్పడును.

కావుననే యిదిపర్యవసాయిగా గణింపబడినది. లేనిచో మొదటిప్రకారము వలెనుపమామూలకములలో గణింపవలసివచ్చును. అట్లు గణించుటకు గారణమగు సామ్యమును బురస్కరించుకొనినవినిమయమచటలేదు కదా! అనగానచటనొనర్పబడు వినిమయము సామ్యమును బురస్క రించుకొని జరుగుటలేదుకదా! కర్ణకేశలయగ్రహణమునరణకిసలయ సమర్పణములందు గర్త్రయగు సాగరిక రెంటిసామ్యమును గ్రహించి యొనర్పలేదుకదా! ఇకనేమి? ఆమె యొనర్చిన పనిని సామ్యపర్యవ సాయిగా కవినాయకుని నోటచెప్పించుచున్నాడు. ఇట్లే తెనుగున నుదాహరణములందుగూడ గ్రహింపవలయును. అయితే రెండిటి యందును సాదృశ్యమూలకత్వములేక క్రియానన్తరరముననే సాదృశ్య పర్యవసానమగుచో సదృశవినిమయమనియు విసదృశవినిమయమనియు ప్రకారభేదములెట్లచట నేర్పడినవి? వినుడు వినిమయానన్తరమున గృహ్యమాణ మగుసామ్యములోకముననిదివరకే సుప్రసిద్ధముగానున్న చోనవియిదివరకే సదృశములుకావున నావినిమయము సదృశవినిమయ మనియును, సాదృశ్యము లోకసిద్ధము కాకుండుటయేకాక వస్తువులలో తారతమ్యముకూడ తర్వాత స్ఫురించుచో, నచట విసదృశవినిమయ మనియునందుడు. ఇట్లిచటగూడసాదృశ్యపర్యవసానమును గ్రహించునది. ఇకప్రకృతముననన్వయోపమేయోపమలందివాదిశబ్దములప్రయోగమున సామ్యప్రతిపాదనావకాశమున్నదికాని యనన్వయములో రెండవ వస్తువు లేకపోవుటవలన నచటనుపమాలంకారము కుదురదు ఉపమేయము కన్నవేరగు వస్తువుతో నుపమచెప్పబడినకదా; యచటనుపమాలంకార మగును. కావున నచటగూడ నుపమకవకాశములేదని స్పష్టము. ఇక నుపమేయోపమయందాబాధకము లేకపోయినను నుపమానత్వోపమే యత్వముల వ్యవస్థితములై తద్వ్యవస్థామాత్రనిష్పాద్యమగు నుప మాలంకారమునకవకాశమీయవు. ఇచటనుపమితసమాసమునకొకపక్ష మున నవకాశమున్నను రెండవపక్షమున నట్టియవకాశములేకపోవుటయే కాక, రూపకమాశ్రయించిననేకాని ప్రకృతార్థముపపన్నముకాదేమో యను బాధకములేదు. కావుననిచటరూపకమునకవకాశములేదు. ఇకవిరోధ

విభావనలలో నుపమానుగమమేది ? అని సంశయింపకుడు. మొదట విరుద్ధముగాదోచుటయు దర్వాతనది యవిరుద్ధముగా నుండుటయుగదా ! విరోధాభాసము. ఇందు శబ్దవిశేషముచేతగానిండర్థ విశేషముచేత గానిండు విరుద్ధావిరుద్ధములకు ప్రథమమున సామ్యస్ఫురణమగపడుట లేదా ? ఎట్లు ? అవిరుద్ధమగునది విరుద్ధమువలె స్ఫురించునపుడే ఉ ప మా ను గ మ ము స్పష్టపడుచున్నది ? "నీవుపానమొనర్పగా నామనసునకుమత్తత కలుగుచున్నది," అనునపుడు ప్రే మ వ ల న నీ హర్షము విరుద్ధముకాకున్నను. కార్యకారణములు (పానమత్తతలు) భిన్నాధికరణస్థములగుటచే విరుద్ధములవలె స్ఫురించుచున్నది. ఇదియే ప్రాచీనులవిరోధాలంకారము నందుపమానుగమము. ఇక నవీనుల మతమున విరుద్ధములకాదాత్మ్యము రూపకమునవలెనుండును. ఉదా :— శ్రీ రామచంద్రుడు వింటనమ్మసంధింపగనే నదీనుడయ్యు దీనుడై సముద్రుడరుదెంచెను." ఇచట "ముఖము చంద్రుడు" అను రూపకమునవలెదీననదీనులకుదాద్రూప్యముతోబాటు విరోధమున్నట్లు ప్రతిపన్నమగును. అట్టి తాద్రూప్య ప్రతిపత్తివలన సౌపమ్యము రూపకమునవలె స్ఫురింపగల్గును. పిమ్మట గౌణవృత్తికాక వేరుగా వక్తృనివక్షితమగు నుపాయాన్తరము, శ్లేషాదిక ముండుటవలన గౌణ వృత్తి ప్రతిహతమైవిరోధముకూడపోవును.

ఉపాయాన్తరమున బరస్పర విరుద్ధముల కభేదము సమన్వితమగుచో ననగా విరోధము వారితమగుచో నచట గౌణవృత్తికెట్లు ప్రసక్తికలుగును ? ఇట్లిచటకూడ ప్రాథమిక సమన్వయదశలో నౌపమ్యస్ఫూర్తియుండును. కావున నుపమానుగమ మిచట గూడ దప్పనిదే. ఇట్టి యుపమానుగమమునే వామనాచార్యుడు సూత్రములో స్పష్టముగా సూచించెను. "విరుద్ధమువలె భాసించుట విరోధాభాసము." అని గదా విరోధాభాస సూత్రము. "విరుద్ధమువలె" ననుపదమే యిచటి యుపమానుగమమును స్పష్టముగా సూచించుటలేదా ? ఇట్లు ఆభాసము లగుచోటుల నెల్లెడనునౌపమ్యస్ఫూర్తియుండుననుట ఆబాలగోపాలమె

రింగినదే. "హేత్వాభాసము, రసాభాసము" ఈ స్థలములందు "హేతువులవంటిది, హేతువులవలె భాసించునది యనియు, రసము వంటిది రసమువలె స్ఫురించునదియనియు." నర్థములు శాస్త్రజ్ఞుల కందరకును దెలిసినవే. ఇట్లు స్పష్టముగా నుపమానుగమమున్న స్థలమునే యుపమాప్రపఞ్చమని తెలియజాలని శ్రీమదభినవభట్టబాణులకు, ఇక విభావనాలంకారములోనుపమానుగమమెట్లు తెలియవచ్చును? అది యట్లుండనిండు. ఇక విభావనాలంకారమున నుపమానుగమమును వివరింతుము. "క్రియనుప్రతిషేధించినను ప్రసిద్ధమగు దాని ఫలమును వ్యక్తీకరించుట" కదా విభావన? ఇచట "కారణమగు క్రియలేకున్నను, ఉన్నప్పుడువలె కార్యమగు ఫలమేర్పడినదని వర్ణించుటయే విభావన" యని స్పష్టమగుటలేదా? అందుకొరకేకదా "దానిఫలమును" అని ఇక్కడి ఫలమునకు వెనుకటిక్రియతోడి సంబంధము స్పష్టపరుపబడినది, కారణములేని యవస్థయందునుగూడనున్నప్పుడువలెకార్యోత్పాదమును" వర్ణించుటలో కారణసత్త్వాసత్త్వావస్థలకు సామ్యమునే కదాఫలోత్పత్తి వర్ణన రూపమగు విభావనస్ఫురింపజేయునది? ఇట్లిచటగూడ నుపమానుగమమును దెలసికొనునది. ఇంకనుజాలనపేనాలంకారములందుపమానుగమమున్నది కాని యవి ప్రకృతగ్రంథమునకైకొనకుండుటవలన వానినిచట వివరింప బూనము. గ్రంథాన్తరములవాని ప్రసక్తి వచ్చినపుడు వివరింతుము. ఇట్లీయుపమాను గమముగల ప్రకృతా లంకారములు రెండును నుపమాపర్యవసాయులే. ఇచట నివాదిశబ్దములకుగాని యుపమితసమాసాదులకుగాని ప్రసక్తిలేదుకదా! కావునబై నిరూపించిన వామనాచార్యుని మూడు వాక్యములనుండియు (అపహ్నుతిలక్షణ సూత్రవృత్తిలోని వాక్యమును, విశేషోక్తి సూత్రవృత్తిలోని వాక్యము, "ప్రతివస్తువు మొదలుకొని యుపమా ప్రపంచము" అనుసూత్రరూపమగువాక్యము.) మేముపై నిరూపించిన యభిప్రాయము సంపూర్ణముగా నేర్పడుచున్న దనుటలోనేమైననెవరికైన విప్రతిపత్తి యుండుట కవకాశమున్నదా? లేదు. కావున "సహకారాధిప" ఇత్యాది

పద్యములమేమునిరూపించినచోటులందు గూడ రూపకమే యాశ్రయిం పక తప్పదని స్పష్టపడినది.

సరియేనయ్యా ! అచట రూపకమైననగుగాక మేమునుడువు విషయమిది. "పాదములను పల్లవములకు పులకములను కంటకవితానము తాకెన నొచ్చుటయయుక్తము. ఇట్లేవదనములను నంబుజముల భృంగజాలము వ్రాలుట యుక్తము కాని మొగమున వ్రాలుట యుక్తము కాదుకదా ! కావున వెనుకచోటగూడ రూపక మాశ్రయించుటయుక్తము కాని యుపమనాశ్రయించుచో నీయనుపపత్తి వారించుటెట్లు ?

ఎట్లు వారించునో చెప్పెదము వినుడు. సత్యముగా విచారించుచో రూపకమాశ్రయించునదే యీయనుపపత్తి వచ్చును. ఎట్లు ? మనమెన్ని యలంకారములవాడిను బ్రకృతమగునర్థ మునందువానికి సంబంధము కలిగి శోభోత్కర్షములు కలుగుట కదా వానికన్నిటికిని ఫలము. ఇపుడు. "వదనమను పద్మమున వ్రాలుతుమ్మెదలుకురులు." అనుచోట వదనమునకును గురులకును సంబంధము, స్వాభావికమగునది, వినష్టమైయవిరెండును వ్యవహితములగుచున్నవి. "పద్మము భృంగములు" ఇవి రెండును, వదనకున్తలముల నడుమజేరివానికి సాహజికమగు సంబంధమును దొలగించుటయేకాక, వానిని రెంటిని చాలదూరమొనర్చినవి. మరియు తుమ్మెదలకును మాత్రము సంబంధము స్వాభావికమా ? కాదు. అట్లా సంబంధముకూడ బోయి యిచట బ్రకృతములును నుత్కర్షణీయములును నగువదనకున్తలములకుగల సాహజికరామణీయకము వినాశమగుచున్నది. ఇంకొక విశేషము. అసలుత్కర్షణీయములగు వాని సంబంధమున సాహజికత తొలగి యవాస్తవికత యేర్పడుటయు, ననుత్కర్షణీయములగు పద్మభృంగముల సంబంధమున సాహజికత్వ స్ఫూర్తియునుత్కర్షము నేర్పడుటయు నయుక్తముకాదా ! కావుననే వామనాచార్యుని మతముననిట్టి స్థలములందు బరంపరిత రూపకములేదు. ఏమి ? అందు ప్రకృతము

ల కుత్కర్షముపోయి యప్రకృతములకుత్కర్షము శబ్దతః ఏర్పడును అసలుశబ్దతస్తాద్రూప్య మేర్పడినగదా రూపకము. అదిప్రకృతోత్కర్షకము కావలయునుకదా! అట్లు రూపకమున శబ్దతస్సంపాద్యమగు. ప్రకృతోత్కర్షము, పరంపరితరూపకమను స్థలమునందుసిద్ధింపకపోవుటయును, నప్రకృతోత్కర్షమేర్పడుటయు జరుగును అదియలంకారత్వభంజకముకదా! దీనినంతను నుదాహరణము నవివరింతును. “ముఖ పద్మమున కున్తల భృంగములు జెలువొందుచున్నవి” ఇది పరంపరిత రూపకమని కదా యితరుల యభిప్రాయము. ఇచట ప్రకృతములును నుత్కర్షణీయములుననగు ముఖకున్తలములకు సమాసాత్మకమగు శబ్దమున (ముఖమను పద్మము, కున్తలము లనుభృంగములు.) నప్రాధాన్యమును వ్యవహితమగు సంబంధమును (ముఖ కున్తలములు పద్మభృంగములచే తవ్యహితము లొనర్పబడినవి ) నుత్కర్ష రాహిత్యమును ( పద్మభృంగముల బరస్పర సంబంధమున సౌందర్యసామంజస్యముస్ఫురించును కానివదనకున్తలములకసలుసంబంధమే కలియకుండుటవలనవానికలయికవలననేర్పడవలసినసౌందర్యముస్ఫురింపదు.)నున్నవిఇకనప్రకృతములగు పద్మభృంగములకుశబ్దమునందు బ్రాధాన్యమునునవ్యవహితమగుసంబంధమును నందువలన శోభోత్కర్షమును నేర్పడుచున్నవి. సమాసములో (ముఖ పద్మమున, వదనకున్తలములు) ముఖమును కున్తలములును నప్రధానములుగానే చెప్పబడునుకదా! “మొగమను పద్మమున కున్తలములను తుమ్మెదలు” అని గదా యర్థము. కావున నిట్టి పరంపరిత రూపకమసలలంకారసామాన్యలక్షణమగు ప్రకృతశోభోత్కర్షకత్వము లేకయసలలంకారమే కాకపోవుచున్నది. ఇకనిట్టి చోటుల గతియేమందురా ? ఉపమాలంకారాశ్రయణమే, అనగా “పద్మమువంటి మొగమున దుమ్మెదలవంటి ముంగురులు శోభిల్లుచున్నవి” యనియేయర్థము చెప్పవలయును. అపుడుపమిత సమాసమునాశ్రయింపకతప్పదు. ఎచట నట్లాశ్రయించుట కవకాశముండదో యచట నగత్యా శబ్దమునందు గౌణవృత్తి నాశ్రయించి తాద్రూప్యప్రతిపత్తి వాచ్యార్థమునందుదాత్కాలికముగానేర్పడినను. బర్యవసానమున బ్రకృతార్థమునకే ముఖ్యతయేర్పడును

కావునగొంతకొంతప్రకృతోత్కర్షముసమకూడును. ఇదియెట్లు? "వదనాంబుజమ్మున వ్రాలు భృంగములు కురులు" అను స్థలమును గైకొనుడు. ఇచట "భృంగములు కురులు" అను భాగమున నుపమచెప్పుట కవకాశములేదు. కావున భృంగ కుంతలములకు దాద్రూప్యప్రతిపాదకమగు నభేదముతో నన్వయము. అపుడు ప్రముఖమున రూపకమేర్పడినను జివరకు కురులకే విశేష్యతయుండును కావున బ్రకృతమగు నర్థమునకు ముఖ్యతయుండును. ప్రకృతములకు సంబంధముకూడ తొలగదు (పద్మమువంటి మొగమున వ్రాలు తుమ్మెదలుకురులు,) మరియు నిందు భృంగతాద్రూప్యము కురులయందు విశేషణముగా నన్వయించును కావున గురుల కునుత్కర్షమును సమకూడును. మొదలిచోట (వదనాంబుజమ్మున అనుచోట) నిట్టులంబుజతాద్రూప్యము వదనమున నన్వయించుట కవకాశములేకపోవుట వలన వదనమున కుత్కర్షమేర్పడజాలదు. ఇది ఎందువలన నేర్పడినది? "వదనమను నంబుజము" అను రూపకమిచట జెప్పుట వలన వచ్చినది. ఈ పక్షమున వదనతాద్రూప్యము అంబుజమున నన్వయించును గాని అంబుజ తాద్రూప్యము వదనమున నన్వయింపదు. అందు వలన నంబుజమునకు బ్రాధాన్యమును శోభోత్కర్షమును నేర్పడును కాని వదనమునకవి యేర్పడజాలవు. ఇందుకొరకై కొంతమంది వీనిని "మయూరవ్యంసకాదిగణము" లో జేర్చి "అంబుజముతో నభిన్నమగు వదనము" అని చెప్పబోయిరి, కాని యిదిమిక్కిలియసందర్భమైనది. "వదనమను పేరితమ్మిని వ్రాలునళులు కున్తలమ్మలు" అను వ్యస్తస్థలములందు అంబుజతాద్రూప్యమువదనమునకెట్లు చేకూరును? మరియు అపుడు వదనమునకును భృంగములకును సంబంధమెట్లుకుదురును? అదికుదురదనియేకదా యుపమితసమాసము పనికిరాదని మాతో మీరింత సేపటినుండి వాదించునది? ఈ విషయమున మరొకరు ఇంకొకవిధమున సమన్వయమును వ్రాయుచున్నారు. "కేవల వదనమునకును భృంగములకును సంబంధములేకున్నను, అంబుజరూపము నొందిన వదనమించుమించుగా నంబుజమే కావున నట్టులంబుజ తాద్రూప్యాక్రాన్తమగు వదనమునకును భృంగములకును సంబంధ

ముపపన్నము కావచ్చును." అనివారిసమన్వయము. కాని యిచటనొక మాటను నుడువవలసియున్నది. అసలు "వదనాంబుజము" అనునిత్యాది స్థలములందు గౌణవృత్తి నాశ్రయించుటకుదగిన ప్రమాణమేది? "వదనాంబుజము, ముఖచంద్రుడు" మొదలగుపదములు చెవినిబడిన వెంటనే యుపమానోపమేయములని స్ఫురించునుకాన" ఉపమితం వ్యాఘ్రాదిభిస్సామాన్యాప్రయోగే" అను సూత్రమువెంటనే యుపస్థితమై యుపమిత సమాసమాశ్రయించుట యుక్తమైయుండును. "అంబుజ రూపమగు వదనము" అనునర్థము అసలెవ్వరికిని స్ఫురింపనే స్ఫురింపదు. అట్లు స్ఫురించినపుడుకదా! వ్యత్యస్త విశేషణ విశేష్య భావజ్ఞానముకలిగి "మయూరవ్యంసకాదయశ్చ" యనునది యుపస్థిత మగును. అప్పటికిని గౌణవృత్తినాశ్రయించుటకు గావలసినంతటి ప్రమాణములేనేలేదు. "మయూరవ్యంసకము" అనుచోట గౌణవృత్తి యాశ్రయింపబడుచున్నదా? తత్ప్రకారముగలదని స్వీకరింపబడిన "వదనాంబుజము" అనుచోట గౌణవృత్తినాశ్రయించుటకు తగినంత ప్రమాణమేది? సమాసపదమునందుగూడ నిట్లే గౌణవృత్తియాశ్రయింప వీలుకాదని తెలియునది.

మయూర వ్యంసకాదిగణములో "వదనాంబుజాదుల" చేర్చుట కవకాశములేదని యిదివరకు చూపియుంటిమి. ఇపుడు "తుష్యతు" న్యాయమున నంగీకరించినను వారికేమాత్రమునుగూడ లాభములేదని స్పష్టపరచితిమి.

అదికాదయ్యా! "అంబుజతాద్రూప్యమునొందని వదనమునకును భృంగములకును సంబంధము కుదురదు" అను ననుపపత్తియే యిచట గౌణవృత్తినాశ్రయించుటకు బ్రమాణముకారాదా? సంబంధానుపపత్తియే కదాలక్షణకు బీజము. "గౌణ్యపిలక్షణా ప్రభేదఏవ" యని విద్యానాథుడు "గౌణవృత్తిని" గూడ లక్షణయే" యనెను కాదా?

ఈ మార్గముకూడ మంచిదికాదు. ఏమందురా ? అంబుజ తుల్యమగు వదనమునకుగూడ భృంగములతోడ సంబంధముండవచ్చును. ఇది యెట్లు ? ఇచటి భృంగములు కేవలభృంగములుకావు. కావుననే మీమతమునగూడ అంబుజతాద్రూప్యము నొందిన వదనమున వానికి సంబంధముపొసగినది. అట్లుగానిచో వదనమ్మునందంబుజతాద్రూప్యము శబ్దమువలన జెప్పబడినంతమాత్రమున లోకసిద్ధములగు కేవల భృంగములు అచట నుండగలవా ? అదికుదురదు కావున అంబుజ తాద్రూప్యమునొందిన వదనమునకును భృంగములకును మీరుసంబంధ మంగీకరించినట్లు మేము అంబుజతుల్యమగు వదనమునకును కుంతల తద్రూప్యములగుభృంగములకునుసంబంధమంగీకరింతుము. అంగీకరింతు మనుటేల? అంగీకరింపదగినదియు మీకుగూడ నంగీరింపకతప్పనిదియు నదియే ఏమందురా? ఇతరోపాయములచే నన్వయముపపన్నమగునపుడు గౌణవృత్తియెన్నడును ప్రసక్తింపజాలదని యిదివరకే చూపియుంటిమి. మరియు భృంగతాద్రూప్యము కున్తలములందు శబ్దముచే జెప్పబడిన తర్వాతగూడ జివరకు సామ్యమేకదా తేలునది. రూపకమునందంతటను జివరకు బర్యవసానసీమయగునది సామ్యమే. ఈవిషయమును వామనా చార్యుడు విశేషోక్తి లక్షణములోనిట్లు చెప్పియున్నాడు. "ఒకగుణమునకు హాని కల్పించునపుడు పోలికను దృఢపరచుట విశేషోక్తి". సూ. ౨౩. "ఇది యించుమించుగా రూపకమే". (పై సూత్రవృత్తి) అని ఈ వ్రాతవలనను "రూపకమునకుపమయే మూలము" అని రూపకలక్షణ సూత్రవృత్తిలోనుడువుటవలననుగూడ వామనాచార్యుని యభిప్రాయమున "రూపకముపమాపర్యవసాయి" యని స్పష్టపడుచున్నది. కావున ప్రకృతమున భృంగముల తాద్రూప్యము భృంగములతోడి యుపమా పర్యవసాయియే యనవలయును. ఇట్టియెడ "అంబుజమువంటివదనమున భృంగములవంటి కుంతలములు". అనుపర్యవసన్నార్థము చాలా యుక్తియుక్తముగానుండలేదా ? నిష్ప్రమాణమును సబాధకమునునగు గౌణవృత్తినాశ్రయించుట కవకాశములేనపుడు సప్రమాణమును సరిగా

కుదురునదియు నిర్బాధకమును నగునుపమితసమాసమునాశ్రయింపక యేమిచేయుదురు ?

అయితే పర్యవసానమున నుభయత్రయుపమయేర్పడుటవలన బాగున్నట్లుతోచినను ప్రముఖమున బ్రారంభముననుపమయుదర్వాత రూపకమును (పద్మమువంటి మొగమున భృంగములు కురులుఅని) సరిగానున్నదా ? ఇట్లెచ్చటైననుండునా ?

ఇట్లు రూపకమునకుపమాసాహాయ్యమున నిర్వహణము అసందిగ్ధముగానెచ్చటనులేదనుకొనవలదు. చూడుడు, వామనాచార్యుడు త్ర్యేకావయవమునకుదాహరణముగా నిరూపింపబోవుచున్న" అంగుళుల బోలు కిరణాలనంధకారమనెడుధమ్మిల్లమునుబట్టి యంబుజాతనేత్రములు మొగుడగా రజనీముఖమ్ము నదిగొ ! ముద్దిడుకొనునట్టులలరును శశి." అనుపద్యమును. ఇచట కిరణములందు అంగుళీసామ్యమును మొదట నుడివి, అంధకారమునకునుధమ్మిల్లమునకును తాద్రూప్యమును దర్వాత జెప్పుచున్నాడు మహాకవి కాళిదాసుడు. అంగుళీతుల్యములగు కిరణము లకును ఆంధకారాభిన్నమగు ధమ్మిల్లమునకును నిచటగూర్పబడిన సంబంధము నిర్బాధకముగాను సమంజసముగానునుండలేదా ? మరియు "జలధరంబననెద్ది" యను తరువాత పద్యములోని రెండవపాదమును జూడుడు "మున్నీరనగనెద్ది మొలచుట కావాలమాణి పూసలువోని యాత్మజులకు." (పాండురంగమాహాత్మ్యము. తెనాలి రామకృష్ణకవి.) అని ఇచట రూపకముపమానిర్వాహ్యమగుట స్పష్టముగానేయున్నది. కావునప్రకృతముననంబుజతుల్యమగువదనమునకునుకుంతలతద్రూప్యము లగు భృంగములకును సంబంధముండుటలోనే మాత్రము బాధకమును లేదు. అదియేసమంజసము. అత్యంతరుచిరమును. కావున ఈవిషయమై వదనాంబుజములకు గూడరూపకమంగీకరింపవలసిన యావశ్యకతలేదని యొప్పుకొనకతప్పదుకదా !

ఇట్లు "వదనాంబుజమున" అను స్థలమునందుపమితసమాసము నాశ్రయించినపుడు మీఁదనుడువననుపపత్తులన్నియు వారించితిమి. గౌణవృత్తికవ కాశములేదని చూపితిమి. పరంపరిత రూపకమనునది ఇట్టి స్థలములందు (ఉపమిత సమాసమాశ్రయింప వీలగుచోట్ల) కుదుర దనియు స్పష్టపరచితిమి. ఈయభిప్రాయముతోనే అనగా నిట్టిస్థలము లందు పరంపరిత రూపకము సంభవింపదను నభిప్రాయముతోనే "చతు ర్దశలోకవల్లికందః" అనుస్థలమును నుపమారూపకోదాహరణ ముగా వామనాచార్యుడు నిరూపించెను. కావున నీతీరుననున్న స్థలము లన్నియు పరంపరిత రూపకములు కావనియునుపమా రూపకములను సంసృష్టి భేదములనియు గుర్తించునది. పరంపరిత రూపక ప్రసం గమువచ్చినది కనుకనింకొక చిన్న విషయమునుగూడ చెప్పెదము. "విద్వన్మానసహంస" ఇత్యాది స్థలములు పరంపరిత రూపకమను మాట సరియైనదేకాని ఇతరుల (అప్పయదీక్షితాదులు) మతమునకును వామనా చార్యుని మతమునకును భేదమున్నది. "మానసపదమునందుశ్లేష యున్నది. అందువలన సంభవించునది తాద్రూప్యప్రతిపత్తి. ఈ విషయము శ్లేషలక్షణ సూత్రమునందును దానికిమేము వ్రాసినటిప్పణము నందును విస్తరించి నిరూపించి యున్నాము. కావున "మానస" స్థలమునందొక రూపకమును "హంస" యను స్థలమునందొక రూపక మును కలసి "పరంపరిత రూపకము" అగుట వామనాచార్యుని మత మున యుక్తియుక్తమే. ఇక నితరులమతముననట్లుకాదు. వారం దరికిని శ్లేషస్థలమునంద భేదాధ్యవసానమేకాని యారోపములేదు. ఇట్టి వారికి "మానస" స్థలమందు రూపకమెట్లేర్పడును ? అది మొదట నేర్పడినగదా రెండవ రూపకముతోగలిసి పరంపరిత రూపకమేర్పడుట ? కావుననెదో "యంధపరంపరా న్యాయమున" పైస్థలమునందు వీరు పరంపరిత రూపక మనుచున్నారుకాని నిజమునకు శ్లేషస్థలమున యుక్తి యుక్తమగునారోప మంగీకరింపనివీరికి "విద్వన్మానసహంస" ఇత్యాదిస్థ లములందు బరంపరిత రూపకము యుక్తియుక్తముగా కుదురదు ? అని మనకందరికిని స్పష్టపడుచునే యున్నది. అదియట్లుండనిండు. పైస్థల

ములతోబాటు పమితసమాస మంగీకరింప వీలులేని "వదనమను పేరి తమ్మిపై భ్రమరాలునవలు కుస్తులమ్మలు గమనింపు కువలయాక్షి" ఇత్యాది వ్యస్తస్థలములు కూడ బరంపరిత రూపకములేయని గ్రహించునది.

[139 పే.] "ఇచటనుపమారూపకములు" అని. "ముద్దిడుకొనునట్లు తోచుచున్నాడు" అనునూహకు కిరణములు వ్రేళులవలెనుండుటయు చీకటికొప్పుగానుండుటయు నావశ్యకములు. ఎట్లు? ఇచటచుంబనమన, నాయికా నాయకులు పరస్పరానురాగాతిశయమున నొనర్చెడుసంభోగాంగ మగుచుంబన విశేషము. అదియెనర్చునపుడు ధమ్మిల్లమును వ్రేళుల తోబట్టి ప్రియుడు ప్రియురాలి మొగమెత్తును. ప్రియురాలాచుంబన జనిత మగు నానందాతిశయముచే దన్మయీభావము నొందుచునేత్రసరోజముల మొగుడ్చును. ఇదియాచుంబన పద్ధతి. కావున నంగుళులతో ధమ్మిల్ల గ్రహణమును నేత్రసరోజముకుళనమును నిపుడిచటనావశ్యకములేకదా! నిశాముఖమున కిరణములు చీకటిపై వ్యాపించుటయు సరోజములు ముకుళించుటయు గనుబడినతోడనే కిరణములు వ్రేళుల వలెచీకటియను కొప్పును బట్టికొనుట స్ఫురించును. అపుడు "చంద్రుడునిశావదనమును ముద్దిడుకొనుచున్నాడా?" యను నూహతట్టును. కావున నీవిధమున మొదలనున్న నుపమా రూపకములు రెండును నుత్ప్రేక్షారంభకములు. అగుటచేనిట "నుత్ప్రేక్షావయవము" అను సంసృష్టి ప్రభేదమును గ్రహించునది.

ఇచట తిప్పేన్ద్రిగోపభూపాలుడు తన వ్యాఖ్యానములో శ్లేష యొకటియున్నదనియు నది యుత్ప్రేక్షారంభకమనియు వ్రాసినాడు. అది పొరబాటు. ఏమి? అసలిచట శ్లేషయెక్కడున్నది? "రజనీముఖమ్ము" అనుచోట శ్లేషయనుకొన్నాడు అతడు అచట "ముఖము" అనగా "వదనమే" కాని "ప్రారంభము" అను నర్థ మనవసరము. వెనుక నిరూపించిన నంగుళీకేశగ్రహణములచే నిశావదన చుంబనము త్ప్రేక్షింప బడును కావున నిచట ముఖశబ్దమునకు "ప్రారంభము" అను నర్థము చెప్పవలసిన యావశ్యకత యేమున్నది?

అట్లుండుటయేమి? దీనితోదుల్య విషయమగు ఉపోఢరాగేణవి లోలతారకంతథాగృహీతంశశినా నిశాముఖం యధాసమస్తంతిమిరాంశుకంతయాపురోఽపిరాగాద్గళి తంనలక్షితం (ధ్వన్యాలోకం ౧ ఉద్యోతం) అను శ్లోకమునకు వ్యాఖ్యచేయుచునభి నవగుప్తపాదాచార్యులు "నిశాముఖం–ప్రారంభః వదనకోకనదంచ." అని రెండర్థములను వ్రాసియున్నారు. కావునదానితోదుల్య విషయము కావుననీ శ్లోకమున గల "రజనీముఖము" అను పదమునకుగూడ "రజనీప్రారంభము." అనునర్థము తప్పక చెప్పవలసినదే. ఇప్పుడు శ్లేషయుండలేదా?

పొరబడుచున్నారు. మీరు వ్రాసిన శ్లోకమునునాశ్లోకమును నొక విషయమందలివర్ణనములే కానివర్ణనా ప్రకారములు మాత్ర మొకటికావు. అచటనలంకార రూపవర్ణనము ప్రాచీన మతమున సమాసోక్తి రూపము. వామనాచార్యుని మతమునవాక్షేపరూపము. ఇచటి వర్ణనము అందరి మతమునను నుత్ప్రేక్షా రూపము. కావున భిన్నప్రకారములగు వర్ణనములందు గలపదముల కొకేవిధమునవర్థములనుడువవలయునను నిర్బంధమెట్లు పొసగును? మీరు వ్రాసిన శ్లోకమునసమాసోక్తి, లేక యాక్షేపము, కావుననవి పొసగుటకై "ముఖ" పదమునకు "ప్రారంభము" అను నర్థముచెప్పక తప్పదు, ఏమందురా? అచట ప్రకృత మగునర్థము చంద్రోదయ కాలమునందలి వాస్తవికార్థము. "ఉదయరాగముతోడి చంద్రుడు, నక్షత్రములు స్ఫురించుచుండగానిశీ ప్రారంభమునొనర్చినాడు" అనునర్థమును జెప్పినతర్వాతనే "అనురాగమెక్కినచంద్రుడను నాయకుడు తారకములు చలించుచుండనిశయను నాయిక వదనమును చుంబనార్థమై గ్రహించెను," అనునప్రస్తుత నాయికా నాయక వృత్తాన్తము స్ఫురించును. ఇట్లే వామనాచార్యుని మతమున ఎఱ్ఱవనము అనురాగమువలెను, నక్షత్రములు కనీనికలవలెను, చంద్రుడు నాయకుని వలెను, నిశనాయికవలెను, ప్రారంభము, వదనమువలెను ఆక్షిప్తములై తర్వాత స్ఫురింతురు కావున నాక్షేపము. ఇట్లచట మొదట ప్రస్తుతార్థము చెప్పవలయును. పిమ్మట రెండవ

యర్థమునకు బ్రసక్తి కల్గును. కావుననచట ముఖపదమునకు రెండ ర్థములును చెప్పవలసియున్నవి. ఇక ప్రకృతమున "అంగుళులు" అనుచోటనుత్ప్రేక్షాలంకారముకావున "ముఖ"పదమునకు "ప్రారంభము" అనునర్థము చెప్పవలసిన యావశ్యకత యేమున్నది ? అది చెప్పక పోయినందువలన నచట నుత్ప్రేక్షాలంకారమున కేమైనలోటుకల్గునా ? ఉత్ప్రేక్షాస్థలములందు విషయమును నుడువవలసిన యావశ్యకతలేదు చూడుడు. "లింపతీవతమోంగాని వర్షతీవాంజనంనభః" ఇత్యాదు లందు విషయమగు నంధకారవ్యాపనము నుడువబడనేలేదు. అంధకార వ్యాప్తినే గదయచట నుత్ప్రేక్షించినది. అయిననునచట విషయమును జెప్పకుండుట వలన నుత్ప్రేక్షకులోటేమియు గల్గలేదు,

అచట విషయమగు వ్యాప్తిని జెప్పుపదములేదు కావుననది నుడువబడకపోనిండు. ప్రకృతమున విషయము ముఖము, దానిని జెప్పుపదమున్నదికదా దానినేలజెప్పరాదు ?

చెప్పరాదు. చెప్పినచో నుపయోగము లేకపోవుటట్లుండమీదు మిక్కిలి యసలర్థము కుదురదు. ఎట్లు ? "నిశాప్రారంభమును ముద్దుపెట్టుకొనుచున్నాడు" అనికదా యపుడర్థము. ఇదిపొసగునా ? "శశినిశావదనమును ముద్దిడుకొనుచున్నాడని" యూహించుటలోక సిద్ధముకాని "నిశాప్రారంభమును ముద్దిడుకొనుచున్నాడు" అనియూహ లోక సిద్ధమా ? నాయికావదన చుంబనమేకదా లోకప్రసిద్ధము.

అదికాదయ్యా ! ముఖపదమునకు "ప్రారంభము" అనునర్థ మునుడువునపుడు విశిష్టార్థ మిట్లుండును. "నిశాప్రారంభమను వదన మును శశిముద్దిడు కొనుచున్నాడు" అని కాని, మీరు చెప్పినట్లుకాదు.

అని యందురా? సరేకాని, యపుడు మాత్రమానర్థాక్యమెచటకు పోయినది? "నిశావదనమును ముద్దిడు కొనుచున్నాడు" అను నూహయే

కుదురుచుండగా "నిశాప్రారంభమను వదనము" అని యుండవలసిన యావశ్యకత యేమున్నది. "నిశకు ప్రారంభమేకాని వదనమేది?"యను చో మొత్తమంతయు నూహయే కావుననిశకువదనము లేకున్నను బాధలేదందుము. అట్లేకానిచో "నిశయను నాయికకు ప్రారంభమను వదనము" అని యుండవలయును కాని "నిశకు" మాత్రము "ప్రారంభమను వదనము" ఎట్లు కుదురును? దానిని చంద్రుడు ముద్దుపెట్టు కొనుటమాత్రమెట్లు కుదురును?

"అదికాదయ్యా! ఇచ్చటి తత్త్వము. ఉత్ప్రేక్ష యనగా నభేదా ధ్యవసాయముకదా! కావున నిచటప్రారంభమునందు ముఖాధ్య వసాయమును స్పర్శ యందుచుంబనా ధ్యవసాయమును నుత్ప్రేక్షయని గ్రహింప వలయును"

అనియందురా?

సరె! నిజమేకాని యిచట నుత్ప్రేక్ష యొక్క నియతస్వరూప మేయగు నీయధ్యవసాయములో శ్లేషకుపయోగమేమున్నది? శ్లేషలే కున్ననా యధ్యవసాయమెట్లు కుదురునందురా? అధ్యవసాయముకు దురవలసినచోట్ల నంతటను శ్లేషయేయుండునా? చూడుడు" బాలేందు వక్రములగు పలాశకుసుమములు వసన్తసంగతలగు వనస్థలుల నఖక్షతములనా నొప్పారు చున్నవి" అనునీచోట పలాశకుసుమములకు నఖక్షతముల స్వభావాధ్య వసాయమే కదాయు త్ప్రేక్ష. ఇచటశ్లేషయేది? "వస్తూత్ప్రేక్షయందుండకపోయినను క్రియోత్ప్రేక్షయందుండక తప్పదం దురా?" అదియుబొరపాటే, చూడుడు.

"అతివ ! యీర్ష్యాకషాయితమైన నీదుమొగము సామ్యమ్ము నిప్పుడ పొందినంత । పూర్ణిమాచంద్రుడదియేమి పొంగొతనదునొడలిలో నిముడనెయిముడడిదె చూడు."

(ఆంధ్ర ధ్వన్యాలోకం ౨ ఉద్యోతం)

ఈ పద్యమునందు పూర్ణిమాచంద్రునకుచితమగు దశదిక్పూర్ణమూతన శరీరములోనిముడకుండుటగానధ్యవసీయమానమగుచున్నది. ఇచట శ్లేషయేది ?

పోనిండు శ్లేషలేని స్థలములనెట్లో సరిపెట్టుకొందము. ప్రకృతమునను న్నదికదా ! దానిని వదలుకొనుటేల ? దానియధ్యవసానమునను పయోగ మంగీకరింపరాదా ?

అదితప్పు. ఇచట ముఖ ప్రారంభములకు శబ్దతః అధ్యవసానమని మీతాత్పర్యమా ? అర్థతః అధ్యవసానమనియా ? మొదటి పక్షమున రెండుత్ప్రేక్షలన వలసివచ్చును. "ముద్దిడుకొనుచున్నాడు" అనుచోటనొకటియు నిచటనొకటియు. "కానిండైనచో నష్టమేమ"ందురా ఏయుత్ప్రేక్షకీ శ్లేషయారంభక మందురు ? మొదటిదాని కేయనినచోనీ "శ్లేషకుపమా రూపకములను ప్రాణకముల"ను మీవ్రాత తప్పుకావలసివచ్చును.

"అంగుళుల వంటి కిరణములు" అనునుపమయు "తిమిరమను ధమ్మిల్లమును" అను రూపకమును లేకపోయినచో నిచట "ముఖ" పదము "ప్రారంభము" అనునర్థమును జెప్పలేదా ? నిశాప్రారంభము వదనముగా నధ్యవసాయ మొనర్పరాదా ? ఏవిధమగుననుపపత్తియు సంభవింపబోదు. కావున ప్రారంభవదనముల యధ్యవసాయమున నుపయోగించునని మీరనుకొనిన శ్లేషకుఉపమా రూపకములతోడ్పాటుపయోగింపదు. ఇక "ముద్దిడుకొనుచున్నాడు" అను రెండవ యుత్ప్రేక్షయందీ శ్లేషకేమియు నుపయోగము లేదు "ముఖము సిద్ధించినగదా చుంబనాధ్య వసాయముపపన్నమగును?" అనినచో నపుడు ముఖాధ్యవసాయము చుంబనాధ్య వసాయమునకుపయోగించునుగాని శ్లేషయేముపయోగించును?

"ఈశ్లేషవలననేకాదా యీయధ్య వసాయమేర్పడినది. ఇట్లేర్పడిన యీయధ్య వసాయమేకదా చుంబనాధ్యవసానమున నుపయోగించును. కావున వ్యాపారరూపమగు నీముఖాధ్య వసాయము ద్వారా చుంబనాధ్య వసాయమునకు శ్లేషయుపయోగించును. వ్యాపారము చేత వ్యాపారికి అన్యథాసిద్ధిని శాస్త్రిజ్ఞులొప్పుకొనరుకదా? ఇపుడు ముఖాధ్యవసానముననుపయోగించును కావున శ్లేష కన్యథాసిద్ధిరాబోదు". అని యొకరందురు.

కాని అసలిచటవాస్తవమేమో వదలిపెట్టి చాలదూరము పోయితిమి. అసలు శ్లేషకధ్యవసాయమున నుపయోగమున్నదా? లేదు. వామనాచార్యుడు శ్లేషకేమని లక్షణము వ్రాసినాడు? "అదితంత్రప్రయోగముననగుచో శ్లేష" అని. "అది" యనగా "అభేదారోపము" ఇకను ఉత్ప్రేక్షాలక్షణ సూత్రవృత్తిలో నిట్లువ్రాసినాడు. "ఇది యధ్య వసాయమేకాని యధ్యారోపముకాని లక్షణకానికాదు! అని. తాద్రూప్యము శ్లేష, అధ్యవసాయముత్ప్రేక్ష. వీనికి సహకారిత్వము కుదురుటెట్లు? "ముఖము" అనుపదమునందు ప్రారంభ వదనములకు తాద్రూప్యమేర్పడునుగాని యధ్యవసాయ మేర్పడదు. శ్లేషయనారోపమేకాదా, అదియచట స్ఫురించిననేకదా శ్లేషయగును? ఇకనచటనధ్యవసాయమేది?.

"పోనిండు! తాద్రూప్యప్రతిపత్తికల్గిన తర్వాత నధ్యవసాయము స్ఫురింపరాదా" యందురా?

అదియుగుదురదు!

తాద్రూప్యారోపమును నధ్యవసాయమును పరస్పర విరుద్ధములు. ఎట్లు? వేఱ్ఱని స్పష్టముగదెలియు చున్నను రెండువస్తువులలోనొకదాని రూపము ఇంకొకదాని యందున్నదను తెచ్చికోలుతెలివి (ఆహార్యజ్ఞానము) తాద్రూప్యా రోపము, అధ్యవసాయమన్ననో భేదజ్ఞానము

లేశమునులేక "అదియేయిది" యని భావించుట. ఇట్టియీ రెండి టికి పరస్పరోపకారమెట్లు జరుగును ? కావున "ముఖ" శబ్దమునందు గల శ్లేషయధ్యవసాయమున కుపయోగింపదని స్పష్టము. ఈ పొరబా టున కసలు కారణమే మందురా ? "ముఖ" పదమునకు రెండర్థ ములుండుట యొకటి, నవీనుల మతములో శ్లేషమువలన నధ్యవ సాయ మేర్పడునను నభిప్రాయమొకటియు నీవ్యాఖ్యాత పొరపాటునకు గారణములు.

వామనాచార్యుని మతమున శ్లేషలోదాహ్రూప్య ప్రతిపత్తియేకాని యభేదాధ్యవసాయమురాజాలదు. వామనాచార్యునిమతమననేల ? నిజ మునకెపుడు నెచటనుగూడ శ్లేషయంద భేదాధ్యవసాయము రాజాలదు. ఈ విషయమును శ్లేషవివరణమున వి స్త రి ం చి నిరూపించితిమి. మరియు నిచట శ్లేషకవసరమునులేదు. దానివలన నుపయోగములేక పోగా వైరుధ్యముకూడ నేర్పడును, గావున "ముఖ" పదమున శ్లేష నంగీకరింప వీలులేదు. ఇది యంతయు ప్రారంభ వదనముల కధ్య వసాయము శబ్దతః ఏర్పడుననుటలో శ్లేషస్వీకరింపవలనుగాదని నిరూ పించితిమి. ఇకనర్థతః అధ్యవసానమగుచోనసలు శ్లేషపేరైన విన బడరాదుకదా !

ఈ నిరూపణమువలన నీక్రింది పూర్వపక్షము కూడనిరాకరించి నట్లయినది "ముద్దిడుకొనుచున్నట్లు" అనుచోట శ్లేషనంగీకరింతుము. అపుడు స్పృశించుట చుంబించుటగా నధ్యవసీయమానమగును. ఇట్లు శ్లేషకుత్ప్రేక్షోపయోగమున్నది. "అని పూర్వపక్షము. దీనికి సమాధా నమిది. ఇచట "స్పృశించుట" యనునర్థము జెప్పవలసివచ్చినచో సాదృశ్య ప్రయుక్తమగు లక్షణనొప్పవలయును. ఆయర్థములక్ష్యము కాని ముఖ్యముకాదు. అదిలేకపోయినను బ్రకృతమగునధ్య వసాయ మునకు గలుగులో టేమియులేదు. ఆయర్థమును దప్పక చెప్పవల యునను పట్టుదలమీకున్నచో నపుడిచట వక్రోక్తియనునలంకారమగును

కాని యుత్ప్రేక్షకాదు "సాదృశ్యమున లక్షణవక్రోక్తి" యనికదా వామనాచార్యుని లక్షణసూత్రము. ఇంతయేలనీచోట ప్రకృతార్థమేవిధమునగూడ జెప్పవలసినయావశ్యకతలేదనియునది యధ్యవసాయమునకెట్లును నుపయోగింపదనియు పిండితార్థము. కావున శ్లేషకెట్లును నుత్ప్రేక్షారంభక త్వములేదని సిద్ధాంతము,

మరియునవయవ పదము ఆరంభకమును లక్షణచే బోధించునని కదా వామనాచార్యుడనునది. ఇపుడుమనము జాగ్రతగా నాలోచించిననో వారియభిప్రాయము ప్రకారము శ్లేషయభేదాధ్య వసాయమును బోధింప గల్గినను నదియుత్ప్రేక్షారంభక మెట్లగును? ఉత్ప్రేక్షా బోధకమగును' కాని యారంభకము కాజాలదు. ఏల? ఉత్ప్రేక్షా రంభకమనగానేమి? అధ్య వసాయమును బ్రారంభించునది. అనగా భావనయేర్పడునట్లొనర్చునది. అని పర్యవసానము. శ్లేష రెండర్థముల బోధించినవీనమతాను సారముగా నధ్యవసాయమును దెలిపిననునది యధ్యవసాయమును జెప్పినదేయగును కాని యారంభించినది కాజాలదు. అనగా భావనా సంపాదకము కాజాలదనుట. కావున శ్లేష కుత్ప్రేక్షా వయత్వమెన్నటికిని రాబోదు. ఇది వ్యాఖ్యాత పొరపాటే. ఇకనుపమారూపకములకట్టి యవకాశమున్నది. చంద్రకిరణములు ప్రేశులవలె తిమిరము మీదవ్యాపించిన తోడనే తిమిరమను కొప్పును బట్టుట సమకూడినది. (ఇది యేయుప మారబ్ధమగు రూపకము) ఇట్లు చుంబనారం భకకృత్య మేర్పడినతోడనే సరోజనేత్రముకుళనము గలనిశాముఖమును శశిచుంబించుచున్నాడన నూహసహజముగానే యేర్పడును. తత్పూర్వతన కృత్యము జరగినతోడనే యాకృత్యము, సన్నిధి వశమున సహజముగానేయుపస్థితమగును "ఈవిషయము లోకమునందును మీమాంసాది శాస్త్రములందునుగూడ సుప్రసిద్ధమే. కావున ప్రేశులవలె కిరణములు గనుపడుచుండగా తిమిరము ధమ్మిల్లరూపము నొందినపుడు ధమ్మిల్లమును ప్రేశుల గ్రహించినట్లు స్ఫురించిన తోడనే చంద్రుడుని శావదనమును ముద్దిడు కొనుచున్నా డనునూహ సహజముగా కలుగును.

ఇట్లుపమారూకపముల కిచట నుత్ప్రేక్షారంభ కత్వమున్నది కావుననవి యుత్ప్రేక్షా వయవములు కాజెల్లును.

సరియే! కాని యిచటనొక విషయమడుగవలసి యున్నది. "ఆరోపాత్మకమగు శ్లేషయధ్యవసాయాత్మకమగు నుత్ప్రేక్షకుపయోగింపదు. పరస్పర విరుద్ధములవి రెండును." అనికదా ఇంతవరకును మీరునుడివినది. అట్లగుచో రూపకము మాత్రము ఉత్ప్రేక్షకెట్లా రంభకమగును? రూపకముకూ డనారోపాత్మకము కాదా; మీరు శ్లేషవిషయమున జెప్పినయాపత్తు లన్నియునించుమించుగా నిచట గూడ సంభవించునే.

నిజమే! చాలమంచిప్రశ్న; సమాధానమునువినుడు. శ్లేషయందలి ద్వితీయార్థమునకు బ్రసక్తియేమియులేక వైయర్థ్యదోషమొకటున్నది. అది ప్రకృతమగు రూపకమున బ్రసక్తింపదు. ఇక తాద్రూప్యారోపాత్మకమగు రూపకమధ్యవసాయాత్మకమగు నుత్ప్రేక్షకు విరోధికాని యుపకారకమెట్లు కాగల్గును? అని మీయనుమానము. అయితే యిచటనున్నరహస్యమిది. రూపకమునందు విరుద్ధపదార్థములకభేదాన్వయమువలన దాద్రూప్యారోపము సంభవించును. ఎచట నాయారోపము పర్యవసానమున గూడనిలువ గల్గునో యచట రూపకస్వరూపము సమగ్రమైనిలసిల్లును. దానికిఇతరాంగత్వముఅనగానుత్ప్రేక్షారంభకత్వము సంభవింపదు. కారణము వెనుకమేము నుడివినదే. అయితే యీరూపక స్వరూపము సమగ్రము కాకుండుటకు జాల ప్రతిబంధకములున్నవి.

శబ్దమువలన దాద్రూప్యప్రతిపత్తి యేర్పడక తాత్పర్యమువలన నేర్పడుట యొకటి. రెండవది యారోపప్రతిబంధకముగానేదో యొకగుణములేదని చెప్పుట. మూడవది యారోపము గౌణవృత్తినాశ్రయింప నక్కరలేకయే కుదురుట. నాల్గవది తంత్ర ప్రయోగమున్న

నారోపము. అయిదవది పదార్థములకారోపము వాచ్యమగుచున్నను పర్యవసానమున రూపకఫలమగు తాద్రూప్యప్రతిపత్తి యేర్పడకపోవుట. ఇట్లేయింకను ప్రతిబంధకముల నూహించునది.

పైవానిలో మొదటిది యపహ్నుతి. రెండవది విశేషోక్తి, మూడవది విరోధాభాసాదికము, నాలవది శ్లేష, అయిదవదుత్ప్రేక్షాదు లేర్పడుచోటు. దీనిపర్యవసన్నతాత్పర్యమేమి? రూపక స్వరూపము పూర్తినందుటకే కొంచెమభ్యన్తరమున్ననునది మరియొకయలంకారము ప్రసక్తించు స్థలమగును. అచట రూపకైకదేశమేకాని పూర్ణమగు రూపకమేర్పడలేదని తెలియవలయును. అయితే యీరూపకమేర్పడు డుటకుగారణముపమయే కావున నీ రూపక స్వరూపము పూర్తియైన తరువాత చివరకు సామ్యాదార్ఢ్యామే రూపకమునకు జరమ ఫలమగును. మరియు రూపకనిష్పాదకములు రెండు రకములుగా నుండును. ఒకచోట నేవస్తుద్వయమునకు రూపకము చెప్పబడునోఅట వానికిగల యౌపమ్యము రూపకనిష్పాదకమగు చుండును. ఇంకొకచోట మరొకవస్తుద్వయగతమగు ధర్మమునిష్పాదకమగుచుండును. ఆధర్మము రెండు విధముల నుండును. ఒకచోట మరొకవస్తుద్వయమునందలి రూపకము ప్రకృతరూపకనిష్పాదకము కావచ్చును దీనికే పరంపరిత రూపకమందురు. ఇంకొకచోట వస్త్వంతరగతమగునౌపమ్యము ప్రకృతరూపకనిష్పాదకముగావచ్చును. ఈస్థలమునే యుపమా రూపకమందురు. అనగా కడమచోట్ల రూపకముపమాజన్యమును నుపమాపర్యవసాయి యునగునుకానియుపమా రూపకమునందలి రూపకము మాత్రము ఉపమాపర్య వసాయియేకాని యుపమాజన్యము కాదని గుర్తించుకొన వలయును. రూపకాశ్రయ వస్తుద్వయమునందలి యుపమ, దానికి కడమరూపకములకువలె మూలకారణముకాదని భావము. వస్త్వంతరగతోపమకారణము కావుననేయుపమా రూపకమను నీపేరు వచ్చినది. లేకున్నచో రూపకములన్నియు నుపమాజన్యములేకదా! దీనికి మాత్రమే యుపమాజన్యమని పేరురానేల? ఈ నిరూపణమంతయు

ప్రకృతమునకేముపయోగమని సంశయింపవచ్చును. ఇంతకును చెప్పవచ్చిన విషయమది. ఉపమా రూకములోనున్న రూపకము మామూలు రూపకమువలె పూర్ణస్వరూపముకాదనియు, తదేకదేశమే యనియు, దానియేకదేశాన్తరపూర్తి యుపమవలన నగుననియు, ఇట్లే యుత్ప్రేక్షావయవ మగురూపకముకూడ ననమగ్రమగురూపకమేననియు నది యధ్యవసాయాత్మకమగును త్ప్రేక్షకారంభకము కాగలుననియు జెప్పవచ్చితిమి. ఈచివరిసంగతి నింక కొంచెము వివరించి నిర్ధా రింతుము.

ఎచట దార్ఢ్యప్రతిపత్తియే పర్యవసానసీమయగునో యచట శబ్దములవలననేయభేదారోపము చెప్పబడుచో రూపకమే. అదియించుమించుగా నుత్ప్రేక్ష కారంభకము కాజాలదు. ఎచట రూపకము యొక్కయ సమగ్రస్వరూపముండి యనగానచటదార్ఢ్యప్రతిపత్తిపర్యవ సానసీమకాకపోవునోలేక ప్రధానము కాకపోవునో యాస్థలమున రూపక మధ్యవసానాత్మకమగు నుత్ప్రేక్ష కారంభకము కావచ్చును. ఏమి? ఆరోపము దృఢముగానుండక పోవుటవలన భేదజ్ఞానమునకు ప్రాబల్యము పోవును శబ్దజన్యమగునభేదజ్ఞానము మాత్రము దృఢముగానుండును. అది యధ్యవసాయమున కించు మించుగా జాలచేరువగా నుండును. బాధజ్ఞానము దుర్బలముగ్గానే యుండునుగదా! అట్టియీప్రతిపత్తి, తర్వాతనధ్యవసాయాత్మ కమగు నుత్ప్రేక్షను బ్రారంభింప గల్గును.

ఉదాహరణము — చీకటిమీద వ్యాపించిన చంద్రకిరణములు కొప్పుబట్టు కొనిన ప్రియుని వ్రేళుల వలెనున్నవి. ఇపుడు కిరణాలకు నంగుళులకునుండు పోలికవలన జీకటిధమ్మిల్ల మనుబుద్ధికల్గినది. ఇచట తిమిరధమ్మిల్లముల కారోపబుద్ధి యున్నది, కాని యిదిస్వప్రతిష్ఠి తము కాదు. ఏమనగా—తమోధమ్మిల్లములకు ఇచట గల్గిన యభేద బుద్ధి వాని యౌపమ్యమునవలంబించి యేర్పడలేదు. ఇకనేమి? చీకటి

మీదకిరణములు వ్యాపించుటను బరికించుట వలన కిరణముల కంగుళుల యుపమస్ఫురించి యీయుపమలోని యొకభాగముగా నిదితయారైనది. అనగా కిరణాంగుళుల యౌపమ్యబలమే యీతాద్రూప్యబుద్ధికి దోహదమైనది. కావుననిచట "చీకటి ధమ్మిల్లముకాదు" అనుబాధ బుద్ధి, (భేద బుద్ధి) చాల దుర్బలమైనది. ఇట్లగుటకు, పదార్థాన్తర గతమగు నౌపమ్యము ఈరూపకమునకుగారణమగుటయు నిదికూడ నాయుపమలోనియొక ఖండముగా దయారగుటయు గారణము (కావుననే యీరూపకము నుపమాజన్యరూపక మందురు.) ఇట్లు కాగా శబ్దముల వలననేర్పడు నభేదబుద్ధి యేప్రబలమైనది. ఇట్లి బాధబుద్ధి యించుమించుగా లేనట్లే. ఉన్న పదార్థాద్వయా భేదబుద్ధి యధ్యవసాయాత్మ కజ్ఞానమునకు జేరువైనదేకదా! కావుననిది యుత్ప్రేక్షా రంభకము కావచ్చును. అసలు ప్రకృత రూపకము త్ప్రేక్షారంభకమగుటకు పైజెప్పినంతమాత్రమే కారణము కాజాలదు. నిజమునకు వెనుక నిరూపించిన దంతయు రూపకములోని తాద్రూప్యప్రతిపత్తి యధ్యవసాయాత్మ కమగు నుత్ప్రేక్షకు విరోధికాకుండుననుటకు మాత్రమే పనికి వచ్చును. అసలారంభకమగుట కింకొకకారణమున్నది. అది యేమనగా నీయుపమా రూపకము త్ప్రేక్షలోని యొక భాగమై పోవునది. గనుకనిదియు త్ప్రేక్షావయవమనబడును. ఎట్లనగా—చీకటియందువ్యాపించిన చంద్రకిరణములు ప్రియురాలి కొప్పు బట్టుకొనిన ప్రియుని వ్రేళులవలెనున్నవి. (ఇది యే యుపమారూపకము) ఇది ప్రియుడు ప్రియురాలిని ముద్దిడు కొనబోవునపుడా (అధరచుంబన మొనర్ప బోవునపుడు) నర్మకృత్యమేకదా. కావుననిదిచుంబనా రంభకృత్యము, తర్వాతి చుంబనోహను కలిగించినది. (ఇదియేకదా యుత్ప్రేక్ష) కావుననిటనుపమారూపకముత్ప్రేక్షారంభకము అనగా నుత్ప్రేక్షావయవము అనుటకుదగి యున్నది. ఎచటనిట్లూహారంభకములు కాజాలవో యచట రూపకాదులు మఱొకవస్తువునందువస్త్వంతరరూపణాదికమునుసమకూర్చియేకదేశవివర్తి రూపకాదిక మనబడును ఉదాహరణము "నిరీక్ష్యవిద్యున్నయనైః పయోదో ముఖంనిశాయామ

భిసారికాయాః । ధారానిపాతైస్సహకిన్ను వాన్తశ్చంద్రోయమిత్యా ర్తతరంరరాస?" ఇచట విద్యుత్తులందునయనతాద్రూప్య మున్నను నది యుత్ప్రేక్షారంభకము కాజాలక పోయినది. అనగా" వానకో బాటువంద్రుని గూడ నేలబడవైచితినేమోయని పయోముడతిదీనముగా మొఱవెట్టెనా? యనునూహను కల్గింపజాలదు. "రాత్రియందభిసారికావదనమును మెఱపు దీవెలకనులతో మేఘుడుచూచుట" పైయూహలోని భాగముకాదు. ఈ చూచుటతోడనే యట్టియూహ కల్గుచుండుట లోకసామాన్యన్యాయ సిద్ధమునుకాదు. కావుననేయచట పయోదుని యందు దుఃఖితమనుష్య రూపణము మాత్రమునమకాడి యేకదేశవివర్తి రూపకమైనది, అట్లు గాక తాద్రూప్య బుద్ధిపర్యవసానమున నేర్పడినను దానికి ప్రాధాన్యము లేకయది కూడ మొత్తపుటూహలోని యేకదేశమాత్రముగా నేర్పడుచో నది-అతాద్రూప్యబుద్ధి-రూపకము-అచటియుత్ప్రేక్షకు (మొత్తపుటూహకు,) ఆరంభకమై యుత్ప్రేక్షా వయవమనబడదగును. అనగానచటి రూప కము సంపూర్ణ స్వరూపమగు రూపకముగాదు, తదేకదేశమేనని తెలియవలయును. అట్టియేకదేశాలంకారములలంకారాస్త్రములతో గలియనగును వానినిగలుపుట యుశోభోత్కర్ష హేతువేయగును. ఈ యాశయమునే వామనాచార్యుడు ఈయధికరణము చివరనిట్లుచెప్పినాడు.

"అలంకారైకదేశాఃయే మతాస్సౌభాగ్యశాలినః ।
తేష్వలంకారదేశీయాః యోజనీయాః కవీశ్వరైః ॥"

అని (సౌభాగ్యమునొదవించు నలంకారైకదేశములు గూడ కవీ శ్వరులచేనించుమించుగ నలంకారములుగనే కూర్పదగును,)

కావునపై చెప్పిన రూపకముకూడ సంపూర్ణముగాక తదేకదేశ మేనని స్పష్టము. ఉదా: పలితాని ముఖేందురోచిషాంశకలానీతి వితర్కయామహే । అతఏవవితన్వతే తరాంతరుణీ లోచనపద్మ మీలనం" (నరసిన వెంట్రుకలు ముఖచంద్రుని కాన్తిశకలములని

యూహించెదము కావుననే యువతులకనుదమ్ముల మెఱుగుప్పవేయును.) ఇచట ముఖేందులకుగల రూపకముత్ప్రేక్షారంభకము. ఈరూపకము పూర్ణసామగ్రీకముగాదు. అపుడుద్దేశ్యవిధేయభావాదిక మంతయు నుండును. ఇదిపైనున్న యుత్ప్రేక్షలోనియొకఖండము అనగా ముఖమున బీరాడుచున్న నరసిన వెంట్రుకల జూచినతోడనే చంద్రుని తెల్లని రోచిశ్శకలములను నూహకల్గినది. ఈయూహాలోని యొక భాగమేకదా ముఖము చంద్రుడనుబుద్ధి! కావుననీ రూపకైకదేశముత్ప్రేక్షారంభకమైయుత్ప్రేక్షా వయవమనచిడదగును. ఇట్లేస్థలాన్తరములగూడ గ్రహింపదగును. నిజముగా విచారించుచో "సహకారాధిపుగౌగిలించుకొని" అనుచోటి రూపకము కూడముగ్ధకుగల్గిన యూహకు గారణమే "సహకారము నల్లుకొనిన వాసన్తిలత కుండు మాధ్వీక వార్లహరిని" జూచినతోడనే ముగుదకు "నాయకుని గౌగిలించుకొనిన నాయికకు గల్గిన పులకాంకురముల"ను నూహపొడమెను. కావున రూపకమిచటగూడ నుత్ప్రేక్షారంభకమే. అయినను నదిగమ్యమే కాని వాచ్యముకాలేదు. ముగుద "ఇంతటఁ సిగ్గులేద హహాయంచునవ్వు"టకు బైయూహకల్గుటయేకదా కారణము. చూచి నవ్వెననుటలోనా యూహతోచుచున్నది కాని యది వాచ్యముకాదు. మఱియు నీయూహకన్నముగ్ధా స్వభావమే రూపకాలంకృతమై చమత్కారాతిశయ మొసగుచున్నది. ఈ యూహకు జమత్కారకత్వమగు పడుటలేదు. మరియు వామనాచార్యుని యుదాహరణపైఖరిననుసరించి వాచ్యోత్ప్రేక్షారంభక మగుదానినే యుత్ప్రేక్షావయవ మనదగియున్నది. ఈ విషయమింకను బరిశీలింపవలసియున్నది. ప్రకృతము మాటాడుదము. ఇప్పటికి దేలినదేమి?

ప్రకృత స్థలమున నుపమా రూపకమునగల తాద్రూప్యప్రతిపత్తిలోని భేదబుద్ధి భాగము దుర్బలము అభేదబుద్ధ్యంశము మాత్రమట్లుగాకుండుటయు గారణముగ్గా సీరూపకమధ్యవసాయాత్మక మగు

నుత్ప్రేక్షకు విరుద్ధముగాక చేరువైతదేకదేశమైతదారమ్భకము కాగల్గును. కావున నుత్ప్రేక్షావయ వమనబడుట సమంజసము, అని తేలినది.

ఇచట నింకొక్క చిన్న విశేషము తెలియవలసియున్నది. కిందటి సూత్రముననుపమారూపకమను సంసృష్టి ప్రకారమునుజెప్పెను. ప్రకృత సూత్రమున నుత్ప్రేక్షావయవమును జెప్పెను. దీని తాత్పర్య మిది. వెనుకటి సూత్రములో సంసృష్టిని నిరూపించి ప్రకృత సూత్ర ములో సంసృష్టి సంసృష్టిని జెప్పెను. ఇది యతని యుదాహరణము వలన స్పష్టపడుచున్నది. ఉపమారూపకములకుసంసృష్టివెనుక సూత్ర మునకు దాహరణము. ప్రకృత సూత్రోదాహరణము ఉపమా రూప కమను సంసృష్టితోగలసిన యుత్ప్రేక్షయును సంసృష్టి సంసృష్టి, వివరింతుము.

ఇచట తిమిరధమ్మిల్ల రూపకము కిరణాంగుళ్యుపమవలన నేర్పడును. ఈ యుపమాజన్య రూపకము "చంద్రుడుముద్దిడుకొను చున్నాడు"? యను నూహనారంభించి యుత్ప్రేక్షావయపమగును. ఇట్లు సంసృష్టి సంసృష్టి యీసూత్ర లక్ష్యముగా గ్రహింప వలయును. ఇట్టి విచిత్రనిరూపణము నొనర్చు శ్రీవామనాచారునిప్రతిభా విశేషమును వెలువరించుటకే మేమీ తిప్పేన్ద్రభూపాలుని వ్యాఖ్యానమును మిషగా గైకొంటిమిగాని నిజమున కుదత్ఖండనా గ్రహము మాకులేదు. అది యెట్లున్నమాకేల? నిజముగా దానిని ఖండించుటయే మాయభిప్రా యమగుచో నింకను నాతడు తప్పుగా వ్రాసినవి చాలకలవు. వాని నన్నింటిని నిరాకరించితిమా? లేదు శ్రీవామనాచార్యుని నిగూఢమగు నభిప్రాయమును వెలువర్చుటకును జిజ్ఞాసువులగు విద్యార్థులకు విషయ విశేషముల దెలుపుటకును మాత్రమే మాయీపరిశ్రమ సహృదయార్పణమగు విజ్ఞాపనము.

[113 పేజీ] "కర్మధారయము కూడదు" అని

ఇచటి తాత్పర్యమిది. "అధ్యాసిత" యను పదము వినబడిన తోడనే అధిష్ఠింపబడినయను కర్మార్థము స్ఫురించును. అపుడు బహువ్రీహిబుద్ధి కలుగునుగాని కర్మధారయబుద్ధికలుగదు. కావున నిట్టివి పనికిరావని భావము. ఇట్లే "కృతమగుకటము కృతకటము" మొదలగువానిని (కర్మార్థకక్త ప్రత్యయాన్తములగు మొదలిపదములుగల సమాసములను) గ్రహింపవలయును. ఇచట నీవిషయము ముఖ్యముగా గ్రహింపవలయును. కర్మధారయము కూడదనగా నేమి? "అధ్యాసిత తరువు" అను పదము పనికిరాదని కాదు ఏమి? ఆపదమున దోషమేమియులేదు. అయినచో నిచటి యభిప్రాయమేమి? ఇట్టిసమాసములందు గర్మధారయ సమాసలభ్యమగు నర్థమును జెప్పరాదు. అనగా గర్మధారయార్థమును బోధించు విగ్రహము నీస్థలమునందు నుడువరాదు. అని భావము. ఇట్లే ముందు సూత్రముకడగూడ గ్రహింపవలయును. కర్మధారయార్థమనగా "అధ్యాసితమగు తరువు" అనునిట్టి యభేదసహితమును నుత్తర పదార్థ ప్రాధాన్యమునుగల యర్థము. బహువ్రీహియర్థమనగా "అధ్యాసితమగు తరువుకలది" యని ఈ సమాసఘటకములగు పదములయర్థముగాక వేరొక పదార్థమునకు బ్రాధాన్యము కల యర్థము.

[143 పేజి] "వీరపురుషుడు" అని. ఈపదము విన్నవెంటనే "వీరుడగు పురుషుడు" అనుకర్మధారయార్థము స్ఫురించునుగాని పైన వ్రాసినట్లు బహువ్రీహి సమాసార్థము స్ఫురింపదు. ఏల? ఇచట వీరాది పదములు వెనుకటి "అధ్యాసితా"ది పదములవలె క్రియాకర్మలను బోధించి క్రియాకర్మాదుల నపేక్షించునవికావు. ఇకనేమి? ఉత్తర పదార్థములతో పూర్వపదార్థముల నభేదమున నన్వయింపగలిగి యుండును. కావున నిచట వెంటనే కర్మధారయబుద్ధి కలుగును. తదర్థాను గుణమగు విగ్రహమునే యొనర్తురు. అంతేకాని బహువ్రీ

హియర్థ మునుస్ఫురింపజేయు గురుతులేవియు నిచట లేవు కావున నాయభిప్రాయము స్ఫురింపదు.

అయితే "పితాంబరుడు" ఇత్యాది ప ద ము లం దు బహుప్రీహిసమాసమయుక్తము కాబోదా? యని కొందరు సంశయింపవచ్చును. వారుసంశయించుటకు గొంత హేతువున్నది. మేమింతకు బూర్వము చెప్పినట్లుగా సమాసములోని మొదటిపదమగు "పీత" యనునది క్రియా కర్మను బోధించికర్మ నపేక్షించి యుండలేదు. తనకుదర్వాతనున్న "అంబర" పదముతో నభేదమునన్వయించును. ఇవి యన్నియు గర్మధారయ బుద్ధికి అవకాశమునిచ్చునవి యెకాదా.

కాని యిచట ముఖ్యమగు విషయమొకటున్నది. బహువ్రీహిస్ఫూర్తికది ముఖ్యముగా సాధకమగుటయేకాక కర్మధారయబుద్ధికి బ్రతిబంధకముగా గూడనున్నది. అది యేదనినచోపుంలింగము అనగా మహత్తగుట. అట్లు మహత్తుగాకుండునపుడు గర్మధారయమే పుర స్ఫూర్తికము. చూడుడు "పీతాంబరము" పట్టుపీతాంబరము" ఇత్యాది స్థలములందు గర్మధారయమేకదా. ఇక మహత్తుచిహ్నమగు "డుజ్" కనుపడినతోడనే యీసమాసములోని పదములయర్థముగాక మరేదో వేరే పదమునర్థ మునుపాయముగా గొనినగాని సరిపడదని వెంటనే స్పష్టమగును. "పచ్చని గుడ్డ" యనుకర్మధార యార్థమును విలువ నీయదు. కావున నిట్టిస్థలము లందంతటను నిట్టివే యేవో మరికొన్ని బహువ్రీహిచిహ్నములు పురస్ఫురితములై కర్మధారయప్రతిపత్తిని ద్రోసివైచునని గ్రహించునది. బహు వ్రీహియర్థమును జెప్పువిగ్రహమును జేయుటయిచట సమ్మతముగా నుండును. గాని కర్మధార యార్థమునకు లోకాంగీకారముండదని తాత్పర్యము. ఇచట దేలిన విషయమిది. "లోకప్రసిద్ధి ననుసరించి స మా స ము న విగ్రహ మొనర్చుట కావ్యసాంప్రదాయము కాని, దానినతిక్రమించియథేచ్ఛగా నొనర్చుట కావ్యసాంప్రదాయ విరుద్ధము" అని.

[146. పే.] "ఇట్లే మరొక వ్యవస్థకూడ నూహింపదగును" అని.

ఈగ్రంథమునగల సందిగ్ధదోష వివరణములో సంశయజనకమగు వాక్యముసందిగ్ధమను దోషముతో దుష్టమైనదని నిరూపించెను. ఇచట గలన్యాయమేమి? ప్రమాణములన్నియు, నిశ్చయజ్ఞానమునే కల్గించి తీరవలెననియు, వానిలోనొకటగు శబ్దప్రమాణముకూడ నిశ్చయమునే కల్గింపవలెననియు, అట్లుగాక సంశయమునుకల్గించుచో శబ్దప్రమాణము యొక్క ప్రామాణ్యమునకు భంగము కలుగుననియునైయాయికాదుల సిద్ధాన్తము. అందలి వ్యవస్థలను లక్ష్యములననుసరించి గ్రహించ వలయునని సూచించెను. ఇట్లే స్థలాన్తరము లందుగూడ వ్యవస్థాన్తర ములను గ్రహింపవలయును. ఇట్లు సర్వమును సమంజసము.

శ్రీవేదాల తిరువేంగళాచార్య విరచితమగు
ఆంధ్ర కావ్యాలంకార సూత్రవృత్తి వివరణము ముగిసినది.

శ్రీ శ్రీ శ్రీ